# దాంపత్యదీపిక

ముద్దుకృష్ణ

విజ్ఞాన ప్రచురణలు
హీరా.హాల్ ★ జవహర్‌లాల్ రోడ్డు
★ విజయవాడ ★



మానవలోకానికి

అత్యంత అవసరమైన జ్ఞానాన్ని

సమీకరించి గ్రంథస్థంచేసి

ఈ రచనలకు శాస్త్రగౌరవాన్ని సంపాదించిన

వైజ్ఞానికులు

వాత్స్యాయన మహర్షికీ

హేవెలక్ ఎల్లిస్ మహాశయుడికీ

అంకితం



ఈ శాస్త్రానికి సంబంధించి ఇంగ్లీషులోవున్న గ్రంథాల ప్రస్తావనలో, తెనుగులో ఇటువంటి గ్రంథం తయారుకావడం అవసరమని నా అభిప్రాయాన్ని తెలియబరచగా, ఈ రచనకు పూనుకొమ్మని నన్ను ప్రోత్స హించారు, నా మిత్రులు మేజర్ జయంతీ, అతని భార్య రత్నమ్మా. ఈ సంభాషణ జరిగి యిప్పటికి పన్నెండు సంవత్స రాలైనది.

నాటినుంచీ, ఈ రచనకు తోడ్పడగలవనే గ్రంథాలు లభ్యమైనప్పుడల్లా, వాటిని జాగ్రత్తగా చదివి, వాటిలోనుంచి ఉపయుక్తమయ్యే విషయా లను, యేర్చి రాస్తూరాగా, అది, యించుమించు వెయ్యి పేజీల గ్రంథం తయారయ్యింది. సంస్కృతంలో ముద్రితమైన గ్రంథాలను గురించిన ప్రసక్తిలో, అడయారు పుస్తకభాండా రంలోనూ, ప్రాచ్యలిఖిత పుస్తక భాండారంలోనూ వున్న అముద్రిత గ్రంథాలను గురించిన వివరాలను తెలియబరిచి, సహాయకులయ్యారు, మిత్రులు పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు. ఈ విధంగా అవసరమనిపించిన జ్ఞానాన్ని యేర్చుకుని, రాసి, తరిచి చదివి, యీ రచనకు కావలసిన

యత్నమంతా పూర్తిచేసికూడా రచనకు పూనుకోలేదు, ఎందుచేతనో.

కిందటి సంవత్సరం, రాయఘడలో, తన ఆతిధ్యంలో వున్నప్పుడు, నా మిత్రుడు నూతక్కి రామశేషయ్యకు, నేనుచేసిన యీకృషిని చూపించగా, తక్షణం రచనకు పూనుకొమ్మని ప్రోద్బలాన్ని కల్పించాడు, యీ మిత్రుడు. అన్యచింతలేకుండా, దీక్షగా, రచనకు అనుకూలమైన పరిస్థితులూ, రాయఘడలో ప్రకృతి కల్పించిన ప్రశాంతవాతావరణమూ, కలిసిరావడంవల్లను, ఈ రచన అంతా మా రామశేషయ్య ఆతిధ్యంలో, రాయఘడలోనే పూర్తి అయ్యింది.

హైస్కూల్ చదువు పూర్తి కాగానే, శరీరశాస్త్రాన్ని సరదాకి చదివి, ప్రత్యేకపరీక్షలో ఉత్తీర్ణుడనయ్యాను. కాలేజీ చదువులో, మనస్తత్వశాస్త్రం అభిమానశాస్త్రంగా చదవడం తటస్థించింది. ఈ విధంగా విద్యార్థికాలంనుంచీ శరీర - మనస్తత్వ శాస్త్రాల మీదను అభిమానం యేర్పాటు కావడంవల్లను, యీ శాస్త్రాలలో జరుగుతూవున్న పరిశోధనలను అవగాహనచేసుకోడం మామూలు అయ్యింది. సిగ్మండ్ ఫ్రాయిడ్ చేసిన మనస్తత్వ పరిశోధనలు ఆకర్షణను కల్పించడంవల్లను, కొత్తసిద్ధాంతాలను

తెలిసికోడం పరిపాటి అయ్యింది. ఈ చదువులు, నేటి యీ రచనకు చాలా తోడ్పాటు అయినవి.

తగినంతకృషి వున్నప్పటికీ, అవగాహనలోకాని, రచనలోకాని, పొరబాటులు వుండవొచ్చునని, విశాఖపట్టణం వైద్యకళాశాలలో శరీరశాస్త్ర అధ్యాపకులుగావున్న, నా మిత్రుడు, లెఫ్టునెంట్ కల్నల్, జి. వి. యస్. మూర్తి, ఎం. బి. బి. యస్‌కు, ఈ గ్రంథాన్ని చదివి వినిపించి, శరీరభాగానికి చెందిన ప్రకరణాలలో పొరబాటులు లేవనిపించుకుని, ఆయన సలహాలను కొన్నింటిని అనుసరించాను.

ప్రచురణ సందర్భంలో చేయూతను యిచ్చారు, నా యందు ఆదరమూ, అభిమానమూ గల మిత్రులు శ్రీ జి. కె. మంగరాజు, శ్రీ సుందర్‌లాల్ సహతా.

ఈ మిత్రులు అందరికీ నా కృతజ్ఞత.

రాయఘుడ,
మార్చి : 1952

ముద్దుకృష్ణ

# 1

## చరిత్ర

"బాల్యే విద్యా గ్రహణాదీ న్నర్థాన్" అనగా, బాల్యంలో విద్యాభ్యాసంలో నిమగ్నులు కావలెననీ; "బ్రహ్మచర్య మేవత్వా విద్యా గ్రహణాత్" అనగా, విద్యాభ్యాసము పూర్తి అయ్యేవరకూ బ్రహ్మచర్యం అవసరమనీ; "కామంచ యౌవనే" అనగా, యౌవనం వొచ్చిన తరువాతను కామాన్ని అనుభవించవలెననీ; "ప్రాగ్యౌవనా త్స్త్రీ కామసూత్రం తదంగ విద్యాశ్చాధీయీత" అనగా యౌవనారంభంలో స్త్రీ కామసూత్రాలనూ, దానికి అంగభూతాలైన విద్యలనూ నేర్వవలెననీ శాస్త్రజ్ఞుడి వాదం.

ఈ విపరీత వాక్యాల్ని, ఈ విప్లవతుల్యభావాల్ని, ఈ వితండవాదాన్ని, వెల్లడించిన ఈ శాస్త్రజ్ఞుడు యెవ్వరు ?

పాశ్చాత్యభావాల ప్రభావంలో పట్టుబడి భారతీయ సనాతనధర్మాలను సర్వనాశనం చేయదలచిన అప్రాచ్యుడా ?

సంఘంలో విప్లవాగ్నిని చెలరేగజేసే ఈనాటి అరాచక ప్రచారకుడా ?

ప్రాచీన భారతీయ సంస్కారాన్ని పరిమార్చ నెంచిన పరమతప్రచారకుడైన విదేశీయుడా?

అప్రామ్యుడు కాడు, సనాతన ధర్మాలు సజావుగా జరుగుతూవున్న కాలంలో, ఆర్యపురుషుల గౌరవాన్ని ఆర్జించుకున్న మునిపుంగవుడు, ఈయన!

ఈనాటి విప్లవకారకుడూ అరాచకప్రచారకుడూ కాడు; అతిప్రాచీనుడు, సంఘశ్రేయస్సు పరమలక్ష్యంగా తీవ్రయోచనలు చేసిన శాస్త్రవేత్త, ఈయన!

పరమత ప్రచారకుడై, భారతీయ సంస్కారాలకు ప్రమాదాన్ని తలపెట్టిన పరాయి దేశస్థుడు కాడు; ప్రాచీన భారతవిజ్ఞానాన్ని పదిలపరిచి, పాశ్చాత్యఖండాల లోని ప్రతిభావంతుల. మన్ననలను మనకు సంపాదించిపెట్టిన మహానుభావుడు, ఈయన!

ఈమహర్షి కూర్చిన గ్రంథాన్ని పాశ్చాత్యదేశభాషలలోకి రిఛార్డ్ స్మిడ్టు, ఐవాన్ బ్లాష్, హీన్‌మన్-స్ట్రీఫెన్ మొదలైన పండితులు, తమతమ భాషలలోకి తర్జుమాచేసి, ఆకార్యానికే గర్వించారు. ఫ్రెంచి భాషలోకి తర్జుమాఅయిన గ్రంథానికి ఉపోద్ఘాతం రాస్తూ, "కామశాస్త్ర చర్చ భారతదేశ మేధావుల చేతులలో అత్యుత్తమ లక్ష్యాలను సాధించింది. ప్రాచీనకాలంలో సహితం స్త్రీని భారతీయులు గౌరవించినట్టుగా ఏ యితరదేశస్థులూ గౌరవించలేదు." అన్నాడు, లా మేరెస్సీ.

మన దేశానికీ, మన ప్రాచీన నాగరికతకూ యింతటి గౌరవాన్ని సంపాదించినవాడు వాత్స్యాయన మహర్షి. ఈయన ప్రఖ్యాత గ్రంథం "కామసూత్రాలు." ఈయన జీవించిన కాలం క్రీస్తు పూర్వం నూటయాభైవసంవత్సరం - అనగా, కామసూత్రాల రచన నేటికి సరిగ్గా రెండు వేల ఒక వందసంవత్సరాల క్రితం జరిగింది.

మన ప్రాచీన కామశాస్త్ర గ్రంథాలను గురించి పాశ్చాత్యులలో ప్రతిభావంతులు పలికిన ప్రశంసలు గమనించదగినవి: "ప్రకృతిసిద్ధమైనది యేదీ అసభ్యమూ, అసహ్యమూ, బూతూ కానేరదని భారతీయ ధర్మశాస్త్రకర్తల విశ్వాసం అయివుండవలెను; వారి రచనలలో ఏతత్సుడన యెక్కడా గోచరించకపోవడం ఆశ్చర్యం! అంతమాత్రాన, నీతి నియమాల నిర్ణయాలలో ఒక్కఅడుగు కూడా వారు దిగజారలేదు."

సర్. విలియం జోన్స్

"It seems never to have entered into the heads of the Hindu Legislators that anything natural could be offensively obscene; a singularity which pervades all their writings, but is no proof of the depravity of their morals."

Sir William Jones

"కామవాంఛను గురించి తర్కించడంలోనూ, తదాచరణలోనూ, భారతీయులు దానికి కల్పించిన ప్రాముఖ్యత మనకు ఊహించ సాధ్యం కాదు."

రిఛార్డు ష్మిడ్ట్

"Love in India, both as regards theory and practice, possesses such an importance which is impossible for us to conceive."

Richard Schmidt

"మతతీవ్రతను సన్యాసం వరకూ సాగించడంలో ప్రముఖమైనది భారతదేశం; అయినా, కామవాంఛను పవిత్రంగానూ, దైవీయంగానూ, ఆ దేశం యెంచినట్టుగా ప్రపంచకంలో మరియే దేశమూ యెంచలేదు.

రతి కార్యాన్ని మతపవిత్రతతో చూడడమే కాక, కామకార్యకలాపాలకు చెందిన అతిసూక్ష్మ విషయాలను గురించిన శాస్త్రచర్చను అతి ధీరంగా చేయగలిగారు భారతీయ రచయితలు."

హేవెలక్ ఎల్లిస్

"In India, although India is the home of the most extreme forms of religious asceticism, sexual love has been sanctified and divinized to a greater extent than in any other part of the world. The sexual act

had often had a religious significance in India, and the minutest details of the sexual life and its variations are dicussed in a spirit of gravity."

Havelock Ellis

ఈ విధంగా పాశ్చాత్య విజ్ఞాన వేత్తలు మన యీ ప్రాచీన సంస్కృతిని మెచ్చడానికి వాత్స్యాయనుడు కారణమైనా, ఈ రచనలు వాత్స్యాయనుడితోనే ప్రారంభం కాలేదు. వాత్స్యాయనుడికి చాలా పూర్వీకుడైన బాభ్రవ్యమహాముని అనాదిని "కారికలు" అనే గ్రంథాన్ని తయారుచేశాడు. 1. వైశిక 2. సాధారణ 3. యోగిక 4. కన్యాప్రయుక్త 5. భార్యాధికార 6. పారదారిక 7. ఔప నిషదిక, అని ఏడు అధికరణాలుగా విభజన అయిన పెద్దగ్రంథం, కారికలు. బాభ్రవ్యుడి తరువాతను ఔద్దాలకిమహర్షి, తదనంతరం కుచుమారుడి వరకూ, మరి యేడుగురు రచయితలూ, బాభ్రవీయకారికలలోని వివిధ అధికరణాలను ఆధారంగా తీసుకుని, వ్యాఖ్యానపూర్వకంగా గ్రంథాలను తయారు చేశారు. వీరందరూ వాత్స్యాయనుడికి పూర్వులు.

ఈ పూర్వీకుల రచనలను ఆధారంగా తీసుకుని, వారి నిర్ణయాలను తర్కిస్తూ, తన స్వతంత్ర బుద్ధిని వినియోగిస్తూ, వాత్స్యాయనుడు "కామసూత్రాలు" అనే పదిహేడువందల సూత్రాలుగల స్వతంత్ర గ్రంథాన్ని రచించాడు. వాత్స్యాయనుడు క్రీస్తుపూర్వం నూటయాభై సంవత్సరాలనాటివాడనీ, బాభ్రవ్యుడు అంతకు అయిదువందల

సంవత్సరాల పూర్వపు వాడనీ; ఔద్దాలకి మొదలు కుచు మారుడివరకూవున్న రచయితలు బాభ్రవ్య – వాత్స్యాయనుల మధ్యకాలంలోనివారనీ నిర్ణయించారు పరిశోధకులు. వాత్స్యాయనుడి తరువాతను యశోధరుడితో ప్రారంభమై, రేవణారాధ్యుడి వరకూ ఇరవైయొక్కరు పండితులు కామ శాస్త్ర గ్రంథాలను రచించారు.

ఈ శాస్త్రానికి మనదేశంలో ప్రాచీన కాలంనుంచీ యింత ప్రాబల్యం వున్నప్పటికీ, కొన్ని శతాబ్దాలనుంచి దీనికి ఒక అసభ్యతా, ఒక అసహ్యతా యేర్పాటయి, ఈ శాస్త్రపఠనమూ, ఈ శాస్త్రచర్చా తెర చాటు రహస్యాలుగా మారినవి. ఈస్థితికి కారణాలు యేమిటి?

ఒక దేశాన్నిగాని, ఒక జాతిని గాని, లొంగుబాటులో వుంచుకుని రాజ్యాధికారం చెలాయించవలెనంటే, అధికారంలోవున్న పరజాతివారు, తమ చేతచిక్కిన దేశాన్నీ, ఆ జాతినీ, నీచంగా చూడడమూ, ఆ ప్రజల ఆచార వ్యవహారాలనీ, మతాన్నీ, నీతినీకూడా హాస్యాస్పదంగా యెంచడమూ మామూలు.

మహమ్మద్ ఘజ్నీ కాలంనుంచి, ఔరంగజేబు కాలంవరకూ, ఏడువందల సంవత్సరాలు ముసల్మాను పరిపాలనలోనూ, ఆతరువాతనుంచీ నాలుగు సంవత్సరాల క్రితం వరకూ ఇంచు మించు మూడు వందల సంవత్సరాలు తెల్లజాతుల చేతులలో పడీ, మొత్తం వెయ్యి సంవత్సరాలు

భారతదేశం పరమతస్థుల పరిపాలనలలో చిక్కుకుంది. విగ్రహ విధ్వంసనతో ఘజ్నీ ప్రారంభించిన హిందూమతద్వేషం, ఔరంగజీబు నాటికి 'జిజియా' తలపన్నువిధించే వరకూ మనల్ని బాధిస్తూ వొచ్చింది. తెల్లజాతుల పరిపాలనా యత్నాలలో మన దేశంలోకి దిగుమతి అయిన క్రైస్తవ పాదిరీలప్రచారం హిందూమతదూషణతో ప్రారంభించి, మన మతాన్నీ, మన నీతినీ, అతినీచంగా నిరూపించిన మిస్ మేయో "మదర్ ఇండియా" రచనవరకూ, మనకు అన్నివిధాలా వ్యతిరేకమైన ప్రచారం నిరాఘాటంగా సాగింది.

ఈవిధంగా, వెయ్యిసంవత్సరాల నుంచి సాగుతూ వొచ్చిన దుష్ప్రచారం, మన మనస్సులలో కూడ మార్పుల్ని కలిపించింది. బలవంతులై, పరిపాలకులై, తరతరాలుగా పరజాతులవారు అనేక విధాలను మన మతాన్ని, మన సంఘవిధానాల్నీ, మన నీతినీ, మన సంస్కృతినీ దుయ్యబట్టడంవల్లను, మనమనస్సులలో కూడ మార్పులు కలిగి, మన వ్యతిరేకుల విమర్శకదృష్టితో మనం కొంతవరకూ యేకీభవించడం తటస్థించింది. మన దృష్టికి యిటువంటి వక్రత్వం కలగడం వల్లనే, బాభ్రవ్యుడు మొదలు శేవణారాధ్యుడివరకూ, అనేక మేధావులకూ, రుషులకూ, విజ్ఞానవేత్తలకూ సంఘసుఖానికి అవసరమనితోచిన కామశాస్త్రచర్చలను మనం ఏహ్యంగా యెంచడమూ, జ్ఞానార్జనలో శాస్త్రగౌరవాన్ని పొందిన ఈ గ్రంథాలను అసభ్యమని నిరసించడమూ తటస్థించింది.

దీనికి తోడు యితర కారణాలు కూడా యీస్థితికి కారణమైనవి. వాత్స్యాయనాదులు శాస్త్ర దృష్టితో సాగించిన రచనలు రాను రాను విపరీతవిధానాలకు దిగజారి, శ్రీకృష్ణుడు గోపికలతో యిసుక తిన్నెలమీదను... అని, కేవలం ఉద్రేకాన్ని కల్పించడమే ప్రధానలక్ష్యంగా కొన్ని గ్రంథాలు తయారుకావడం లటస్థించింది. తెనుగులో ముఖ్యంగా కొన్ని గ్రంథాలు యీ విధమైన పచ్చిశృంగారముతో నిండినవి ఉన్నవి. మనశ్చాంచల్యం కలగని శాస్త్ర దృష్టిపోయి, కేవలం ఉద్రేకాన్ని కల్పించడమే ప్రధానోద్దేశంగా యిటువంటి గ్రంథాలు తయారుకావడంవల్లనుకూడా యీ శాస్త్రానికి గౌరవం కొంత తగ్గివుంటవొచ్చును.

ప్రాచీనకాలంలో నాగరికతకు పేరుపడ్డ అనేక దేశాలలో కామశాస్త్రచర్చలూ, తత్సంబంధమైన రచనలూ ఉంటూ వొచ్చినట్టి రుజువులు చాలావున్నవి: టూరిన్ ప్రదర్శనశాలలో యీనాడు భద్రపరచి వుంచిన పత్రాలను బట్టి యోచిస్తే, నేటికి మూడువేల సంవత్సరాల క్రితం క్రీస్తుపూర్వం పదమూడువందల సంవత్సరాలనాడు - ఈజిప్టుదేశంలో - ఐగుప్త - కామశాస్త్రచర్చలు సామాన్యమైనట్టూ, అందుకు సంబంధించినగ్రంథాలు రచన అయినట్టూ నిర్ణయమౌతూవుంది. ప్రాచీన గ్రీసుదేశంలోని ట్రాయ్ పట్టణానికి రాణి అయిన 'హెలెన్' వద్ద దాసిగా వున్న 'అస్త్యనస్సా' ఒక పెద్ద కామశాస్త్రగ్రంథాన్ని రచించినట్టు ప్రతీతి

వున్నది. గ్రీసు దేశంలో ప్రాచీనకాలంలో కవయిత్రి అయిన 'ఎలిఫేంటిస్' కూడా కామశాస్త్ర గ్రంథాన్ని రచించింది. రోమన్ సామ్రాజ్యం ఉచ్ఛదశలో వున్న ఆ ప్రాచీనకాలంలో 'ఓవిడ్' అనే మహాకవి, 'ఆర్ట్ ఆఫ్ లవ్'- Art of Love 'ప్రేమ కళ'-అనే గ్రంథాన్ని రచించాడు. అరబ్బుభాషలో వున్న ప్రాచీనగ్రంథం 'పెర్ఫ్యూమ్డ్ గార్డెన్'- Perfumed Garden 'సువాసన వనం'-అనే గ్రంథాన్ని బట్టి యోచిస్తే పూర్వకాలంలో అరబ్బుదేశాలలో యిటువంటి గ్రంథాలు వుండేవని నిర్ణయంగా చెప్పవొచ్చును.

అర్ధశతాబ్దం క్రితం హేవెలక్ ఎల్లిస్ కృషివరకూ, ఇంగ్లీషుభాషలో కామశాస్త్ర చర్చ సరియైన రూపాన్ని పొందలేదు. ప్రపంచకంలో వివిధదేశాలలో కామకాంక్ష ఏయే ఆచారాలను కల్పించినదో, ఏయేజాతులు తదాచరణలో ఏ యే విధానాలను అనుసరించారో తెలుసుకునే నిమిత్తం ఎల్లిస్ అద్భుతమైన కృషిచేసి, కొన్ని మహాగ్రంథాలను తయారుచేశాడు. ఆంగ్లదేశంలో ఈ గ్రంథాలను ప్రచురించడమే మహా పాపంగాయెంచి, "ప్రజానీతికి ప్రమాదాన్ని కల్పిస్తున్నాడు" అని, నాటి ప్రభుత్వం ఎల్లిస్ మీదను క్రిమినలు కేసు సాగించింది. దీనితో, ఆంగ్లదేశ ముద్రాపకులు యీ గ్రంథాలను అచ్చువేయడానికి భయపడిపోవడంవల్లను, ఎల్లిస్ తన గ్రంథాలను ఆనాడు అమెరికాదేశంలో అచ్చు వేయించవలసివొచ్చింది. "సైకాలజీ ఆఫ్ సెక్స్"

- Psychology of Sex- అనే యీ గ్రంథాలను ప్రమాణ గ్రంథాలుగా ప్రపంచకంలోని మేధావులు అందరూ యీనాడు ఏకగ్రీవంగా అంగీకరిస్తున్నారు. ఈ గ్రంథాలు అనేక భాషల లోకి తర్జుమాఅయి, అనేక దేశాలలో ప్రచారంలో వున్నవి.

హేవెలక్ ఎల్లిస్ కృషివల్లను ప్రజాభిప్రాయంలోనూ, ప్రభుత్వాల దృష్టిలోనూ చక్కని మార్పులు కలిగినవి. సామాన్యసంసారుల జీవయాత్ర సుఖంగా సాగవలెనంటే, యీ శాస్త్రజ్ఞానం చాలా అవసరమని నమ్మకం కలిగింది రాను రాను. సామాన్య సంసారులకు ఈ జ్ఞానాన్ని అందజేస్తూ డాక్టర్ మేరీ కార్మికేల్ స్టోప్స్, అనేకగ్రంథాలను తయారుచేసింది. ఈ పద్ధతులను ఆంగ్లదేశంలోనూ, అమెరికా లోనూ, యూరప్ ఖండంలో అనేక దేశాలలోనూ లెక్కలేనన్ని గ్రంథాలు వెలువడతూవున్నవి.

ఈ జ్ఞానికి అవసరమైన పరిశోధన లకు యీనాడు వున్న అవకాశాలు యిదివరలోలేవు. శరీర మనస్తత్వ శాస్త్రాల కృషిలో అమూల్యమైన రహస్యాలు వెల్లడిఅవుతూవున్నవి. నేటిరసాయనశాలల -Laboratories- పరికరాలవల్లనూ, శక్తివంతమైనమైక్రాస్కోప్ - Microscope- అణుదర్శని సహాయంవల్లనూ, పూర్వకాలంలో యెంతటి మేధావులకూ కూడా అవగాహనకాని రహస్యాలు అనేకం యీనాటి శాస్త్రపరిశోధకులకు అవలీలగా అవగాహన అవుతూ వున్నవి.

ప్రాచీన కాలంనుంచీ దేశదేశా లలో మేధావులు తరతరాలుగా చేసిన కృషిని క్రోడీకరించి, ఈనాడు నిర్ధారణఅవుతూవున్న విషయాలను జతపరిచి, సరియైన శాస్త్ర దృష్టితో సామాన్యులకు ఉపయుక్తమయ్యే విధంగా మన దేశభాషలలో కూడా గ్రంథాలు వెలువడడం చాలా అవసరం.

# వాదోపవాదాలు

"తిర్యగ్యోనిష్వపితు స్వయం ప్రవృత్తత్వాత్ కామస్య నిత్యత్వాచ్చ న శాస్త్రేణ కృత్య మస్తీత్యాచార్యాః" అనగా, తమ కామాన్ని తీర్చుకునే యత్నంలో ఏ శాస్త్రఉపదేశమూ లేకుండానే జంతువులకు కామప్రవృత్తి కలుగుతూన్నది. "స్వకాంతారమణోపాయే కో గురు ర్మృగపక్షిణాం" అనగా, ఆడదానిని అనుభవించడంలో పశువులకూ పక్షులకూ ఎవరు గురువులైనారు? కోర్కెలను తీర్చుకోడం ప్రకృతిసహజమూ, అవసరమూ, అయిననాడు వాటిని తీర్చుకునే విధానాలను నేర్వడం ఎంతవరకూ అవసరం, అనే ప్రశ్నలను బాగా తర్కించి, తుదకు 'కామంచ యావనే' అనీ, 'ప్రాగ్యావనా త్త్రీస' అనీ నిర్ణయించాడు వాత్స్యాయనుడు.

రెండువేల సంవత్సరాలక్రితం వాత్స్యాయనుడు, ఏ అభిప్రాయాలను వెలిబుచ్చాడో, సరిగ్గా అటువంటి అభిప్రాయాలనే నేటి పాశ్చాత్య రచయితలుకూడా బలపరుస్తున్నారు: హెలీనా వ్రైట్ రాసిన పుస్తకానికి పరిచయ వాక్యాలు రాస్తూ హెర్బర్ట్ గ్రే, ఈ విధమైన చర్చ చేశాడు: "కామాన్ని తీర్చుకోడం ప్రకృతిసిద్ధమైననాడు,

కామాన్ని తీర్చుకునేపద్ధతుల్ని ప్రకృతే నేర్పుతుంది ; వాటిని గురించి యోచించడమూ, తెలిసికోవడమూ అవసరం కాదంటారేమో ! ఈజ్ఞానం తగినంతగా లేకుండానే సంసారయాత్ర సాగుతూవున్నప్పటికీ, వేనకువేల దంపతులు, యీ జ్ఞానాన్ని ముందుగా పొందకపోవడంవల్లను వివిధ విధాల బాధలు పడుతున్నారు......భార్యాభర్తలు సంసారాలను సుఖవంతం చేసికోలేక అంతరంగాలలో అనేక బాధలను భరిస్తున్నారు. ప్రేమ ఉన్నంతమాత్రాన సంసారయాత్ర సుఖంగా సాగుతుందని భ్రమించరాదు ; సుఖాన్ని పొందడానికిసహితం మార్గాలు వున్నవి ; వీటిని భార్యాభర్తలు తెలిసికోడం అవసరం." నాడు వాత్స్యాయనుడూ, నేడు అనేకులు పాశ్చాత్య శాస్త్రజ్ఞులూ ఒకే వాదాన్ని అనుసరించారు.

పశువులూ పక్షులూ తమ కోర్కెల్ని తీర్చుకునే విధానాలను స్వభావసిద్ధంగా తెలుసుకుంటూవున్నవికదా, మనుష్య స్వభావం దీనికి విరుద్ధమా ? ఈప్రశ్న తర్కించదగినది !

పశుపక్ష్యాదులకు లేని విశేషాలు కొన్ని మనుష్యలోకానికి సహజం అయినవి : మనుష్యుడు నిర్మించుకున్న సమాజంలో అనేక కట్టుబాట్లు ఉన్నవి. కామాన్నితీర్చుకోడంలో పశుపక్ష్యాదులకు అడ్డంకులులేవు. కొన్ని అభ్యంతరాలు కలిగినా, ఆ అభ్యంతరాలను అవి లక్ష్యం చేయకుండా తెగించి తమ కోర్కెల్ని తీర్చుకుంటవి. మనుష్యు

లకు ఈ తెగింపు సాధ్యంకాదు; ఏ వ్యక్తి అయినా ఇటువంటి తెగింపునకు పూనుకుంటే ఆ వ్యక్తిని సమాజం సహించదు. అందుచేతను మనుష్యుడు బుద్ధిపూర్వకంగా తన కోర్కెల్ని అదుపుఆజ్ఞలలో ఉంచుకోక తప్పదు; కొన్నికోర్కెల్ని చంపు కోడం కూడా తప్పదు. అదీకాక, జంతులోకానికి వున్న కోర్కెలు బహుకొద్ది : ఆహార నిద్రా మైథునాలతో సంపూర్ణ తృప్తిని పొందడంకన్న వేరే ఆలోచనలు పశుపక్ష్యాదులకులేవు. మానవలోకం అంతతో తృప్తిపడడంలేదు; అశేష ఆశలతో, జీవితంలో సాధించవలెనన్న లక్ష్యాలను అనేకాన్ని కల్పించు కుని, వాటి నిమిత్తం సహజమైన కోర్కెల్ని రాహిత్యం చేసి కోడంకూడా కలుగుతూవుంది మానవజీవితంలో. ఈ విధంగా పశుపక్ష్యాదులకు సహజంకాని అడ్డంకులూ కట్టుబాట్లూ మాన వుల్ని బాధిస్తూన్నవి.

ఇంకొక సంగతి : పశుపక్ష్యాదు లకులేని విపరీతమనస్థితి మానవస్వభావంలో సహజంగా ఇమిడివున్నది. మానవులు ఊహించగలరు, అసాధారణ ప్రజ్ఞతో భావనాప్రపంచాన్ని సృష్టించుకోగలరు. తద్వారా నిర్మితమైన స్వప్నలోకంలో విచిత్రవిహారాలకు పూనుకోగలరు. ఈ వైపరీత్యాలు పశుపక్ష్యాదులకులేవు. అందుచేతను, మానవు లకు తటస్థించే పొరబాట్లను అవి చేయలేవు. ఈవిధమైన కారణాలనుబట్టి, పశుపక్ష్యాదుల సామ్యాన్ని పురస్కరించుకుని "కో గురుర్మృగపక్షిణాం" అని వాదించడానికి వీలులేదు.

"శరీరస్థితిహేతుత్వా దాహార సధర్మాణోహి కామః" అనగా, శరీరస్థితికి కారణాలు కావడం వల్లను, కామం సహితం ఆహారంతో సమానమైనది. ఆహార వాంఛనీ, కామవాంఛనీ, ఆకలిగా యెంచుకోనవచ్చును, అని పూర్వులు భావించారు. ఈ రెండు కోర్కెలూ అతిముఖ్యమూ, బలవత్తమమూ అయనవి, పశుపక్ష్యాదులకూ, మనుష్యులకూ కూడా. కాని, వీటిని తీర్చుకునేయత్నాలలో భేదాలు వున్నవి. ప్రకృతిలో లభ్యమైనపదార్థాలతో పశుపక్ష్యాదులు తృప్తి పడుతూన్నవి; కాని, జిహ్వకు అనేకరుచుల్ని కల్పించుకున్నాడు మనుష్యుడు; తత్తృప్తికి వంటలలో లక్షల విధానాలను సృష్టించాడు; ఈ యత్నం తరతరాలుగా రూపాల్ని తాల్చడంలో పాకశాస్త్రాన్ని తయారుచేశాడు. జిహ్వకు ఆనందాన్ని కల్పించడంలో తయారైన వంట, తుదకు ఒక కళగా గణనపొంది, నల భీమ పాకాల ప్రశంసవరకూ పరమాణాన్ని పొందింది. ఆహారవాంఛ అయిన ఆకలిని తీర్చడానికి, కేవలం పొట్టనింపడం చాలదు. షడ్రసోపేతమైనభోజనంతో కలిగే అధిక ఆనందాన్నీ, తద్వారా కలిగే ఆరోగ్యాన్నీకూడా కోరుతుంది మనస్సు. కామవాంఛఅయిన ఆకలిని తీర్చడానికి కేవలం శారీరకమైన తృప్తి చాలదు, మనస్సుకు కూడా సంపూర్ణమైనతృప్తి కలగవలెనని కోర్తారు మనుష్యులు. పశుపక్ష్యాదులకు ఈ బాధలేదు.

ఈ సందర్భంలో పశుస్వభావాన్నీ మనుష్యస్వభావాన్నీ పోల్చిచూపవలసివస్తే మరొక

ముఖ్యవిషయం గుర్తించడంకూడా అవసరం: జంతువులకు కామోద్రేకం ఋతుకాలంలోనే కలుగుతుంది. ఆ వాంఛను అవి, ఆ కాలంలోమాత్రమే తీర్చుకుంటవి కదా! మరి మనుష్యుడు......? ఈ ప్రశ్నకు జవాబు చెప్పనక్కరలేదు. పశువులకూ పక్షులకూ లేని అనేకసమస్యలు మనుష్యులకు తప్పనిసరి అవుతూవుండడంవల్లనూ, మనుష్యులు బుద్ధిని వినియోగించడమనే విశేషం ఉండడంవల్లనూ, మనుష్యస్వభావాన్నీ, దాని వింతప్రకృతినీ గ్రహించనివారు 'స్వకాంతారమణోపాయే కో గుణ ర్మృగపక్షిణాం?' అని వాదించవచ్చును; కాని, విజ్ఞులు యీ విధంగా ప్రశ్నించరు.

చర్చనీయాంశం మరొకటి ఉన్నది: 'ఇటువంటి రచనలూ, యిటువంటి చర్చలూ అసభ్యం కావా?' అని. సభ్యతకు నిర్వచనం యేమిటి? ఏది జుగుప్సాకారణమో, ఏది మనస్సుకి వికారాన్ని కలిగించుతుందో, దానిని 'అసభ్యం' అంటాము. ఈ సూత్రాన్ని అనుసరించి సభ్యతాసభ్యతలను నిర్ణయించడం ఎట్లాగున? ఈ సమస్యాపరిష్కారానికి ఒక తార్కాణ ఉపయుక్తమౌతుంది:

నవయౌవనంతో, అందమైన అవయవస్ఫూర్తితో సౌందర్యమూ, లావణ్యమూ తొణికిసలాడుతూవున్న నగ్నచిత్రాన్ని ఒకదానిని పలువురు చూడడం తటస్థించింది అనుకుందాం -ఈ బొమ్మను చిత్రకారుడు

చూడగానే, రంగుల సమ్మేళనా, వెలుగు నీడల కలయికా, కుంచెను ఉపయోగించిన చతురతా మొదలైన చిత్రరచనా విధానాలను గుర్తించడంలో అతడు నిమగ్నుడు కావొచ్చును- ఈ బొమ్మనే ఒక కవి చూసి, ఆ నిండు యౌవనంలోని ఆనందాన్ని, ఆ భంగిమ విలాసాన్ని, ముఖముద్రలో ప్రతిబింబితమైన లావణ్యాన్ని ఆనందిస్తూ సౌందర్యార్చకుడు కావొచ్చును - ఈ బొమ్మనే వీధిశృంగారానికి అలవాటుపడిన విటుడు చూసి, కొన్ని అవయవాలమీదనే దృష్టి నిలిపి కామోద్రేకంలో కంగారుపాలు కావొచ్చును.

ఈ నగ్నచిత్తరువును గురించి సభ్యత అసభ్యతలను నిర్ణయించవలసివొస్తే, చిత్రకారుడూ, కవీ, దృష్టినిబట్టి చిత్తరువు ప్రదర్శనీయమే; కాని విటుడి దృష్టినిబట్టి అది అసభ్యమైన చిత్తరువు అనీ, ప్రదర్శనయోగ్యం కాదనీ నిర్ణయించవలసివుంటుంది. దీనినిబట్టి 'అసభ్యత' అనేది యెక్కడవున్నదీ, అంటే, నిర్ణయించేవారి మనస్సులలో వున్నది అనక తప్పదు. ఏ వ్యక్తి మానసికవికాసం ఏ స్థాయిని పొందిందో దానినిబట్టి, ఆ వ్యక్తి నాగరికతను గుర్తిస్తాము. పైన వివరించిన సందర్భం కొంతవరకూ నాగరికతను నిర్ణయించడానికి గీటురాయిగా ఉపయుక్తపడుతుంది. సభ్యతాసభ్యతల విచారణ, నిర్ణయించేవ్యక్తి నాగరికతమీదను ఆధారపడుతుంది అనక తప్పదు. అందుచేతనేకాబోలును మన ప్రాచీన కామశాస్త్ర రచయితలను గురించి రాస్తూ, 'మనశ్చాంచల్యంకలగని

శాస్త్రదృష్టితో రహస్యవిషయాలను చర్చించగలిగారు.' అన్నాడు హేవెలక్ ఎల్లిస్.

గుర్తించవలసిన సంగతి మరొక్కటి కూడా వున్నది. తరతరాలుగా, పురాతనంనుంచీ ఆర్జించిన జ్ఞానాన్ని పదిలపరిచివుంచి, దానిని సంతానానికి అందించడం మన ధర్మంగా యెంచుతాము కదా! వంట నేర్చుకోడంలో, తిండి తినడంలో, శరీరపోషణలో, ఆరోగ్యరక్షణలో, మాటలు నేర్వడంలో, భాష పలకడంలో, ఆచార వ్యవహారాలలో, మంచీ మర్యాదలలో, విద్యావిధానాలలో....... ఈ విధంగా, తరతరాలనుంచీ అనుభవజ్ఞులు కూడబెట్టిన జ్ఞానాన్ని మన బిడ్డలకు పసితనంనుంచీ, జీవితం అడుగడుగునా అందజేస్తూ, వాళ్ళని విజ్ఞానవంతుల్ని చేసి వారి జీవితాలు సుఖతరం చేయడానికి యత్నిస్తున్నాము. ఈ విధానాన్ని నాగరికతగా యెంచి, ఈ నాగరికవిధానాలకు గర్వపడుతున్నాము. అయితే, అన్నివాంఛలకన్నా అతిముఖ్యమూ, జీవితం సుఖవంతంకావడానికి అత్యంతఆవశ్యకమూ అయిన, కామకార్యానికి చెందిన జ్ఞానాన్ని, యెందుచేతను గుప్తంచేస్తున్నాము, ఆ సమాచారాన్నిసహితం యెత్తకుండా దానిని పరమరహస్యంగా కూడా యెందుచేతను యెంచుతున్నాము ?

కామకార్యాన్ని సిగ్గుతో జతపరిచి, దీనిని చీకటి ముసుగులో దాచి, తరతరాలుగా దీనిని రహస్యంచేస్తూవుండడంవల్లనూ, దీనికిసంబంధించిన ఉద్రేకాలను

అణుచుకున్నట్టు నటించి, వీటిని దొంగతనంగా అన్నట్టు అనుభ వించడానికి అలవాటు పడడంవల్లనూ, ఆలోచనలేకుండా యీ కార్యాన్ని అనవసరపు సిగ్గుతో జతపరచడం మనకు అలవాటైపోయింది. అంతేకాదు, ఏ ఉద్రేకానికీలేని తీవ్రత కామంలో ఇమిడివుండడంవల్లను, ఈ సంగతులకు భయపడడం సహజమైపోయింది. భయమూ సిగ్గూ కల్పించే కార్యాన్ని రహస్యంగా యెంచడం మానవస్వభావంగదా ! అందుచేతను ఈ రహస్యకార్యానికిచెందిన జ్ఞానాన్ని గుప్తంగావుంచడం ఆచారంకావడం ఆశ్చర్యంకాదు.

సంఘంలోవున్న ఆచారాలకు సామాన్యంగా దాసులుకావడమూ, తరతరాలుగా వీటికి లొంగడంలో, అవి చాలా ఉత్తమమైనవని విశ్వసించడమూ మామూలు. ఈవిధంగా కామకార్యానికి సంబంధించిన జ్ఞానం 'గప్‌చిప్' అనే నిర్ణయం సంఘంలో అమలుకావడం వల్లను, ప్రతీతరంలోనూ ఎవరికివారు తడుముకుని, తప్పులుచేసి, అనేక విధాలబాధలను లోలోపల అనుభవిస్తూ, ఈ అనుభవాలవల్లనూ, పడిన బాధలవల్లనూ, తాము కొంత జ్ఞానాన్ని పొంది, తరువాతి తరాలవారికి మళ్లీ 'గప్‌చిప్' చేస్తున్నారు, యీ ప్రశంసని.

ఇది, నాగరికతకు లక్షణంకాదని గ్రహించిన బుద్ధిమంతులు ఈ దాపరికాన్ని అవసరమైనంత వరకూ తొలగించివేసి, ఈ జ్ఞానాన్ని వెల్లడిచేసేమార్గాలను అనుసరిస్తున్నారు. ప్రపంచదేశంలో, స్కూలు చదువు పూర్తి

చేసిన యువతీ యువకులకు కామశాస్త్రజ్ఞానాన్ని గురించి శాస్త్ర ప్రణేతలచేత ఉపన్యాసాలు ఇప్పించే యేర్పాటుల్ని చేశాడు, ఆదేశ విద్యాశాఖమంత్రి, చాలా సంవత్సరాల క్రితం. ఈ పద్ధతిని పాశ్చాత్య దేశాలలో అనేకులు అనుసరిస్తున్నారు.

అమెరికా దేశంలో అనేక వస్తు ప్రదర్శనశాలలలో మట్టిబొమ్మల -clay models- ప్రదర్శనాల ద్వారా ప్రజలకు ఈ జ్ఞానాన్ని తెలియబరుస్తున్నారు. స్త్రీ పురుష అవయవాలూ, వాటిలోపలి రహస్యాలూ, శోణకోశం నుంచి శోణితఅణువు బయలుదేరడమూ, గర్భకోశంలోనికి దాని ప్రయాణమూ, శుక్లఅణువు దానిలో చొరబడగానే గర్భం ప్రారంభం కావడమూ, పిండోత్పత్తీ, పిండం వివిధ దశలలో పెరుగుతూ శిశువు తయారు కావడమూ, పిల్లనొప్పులు ప్రారంభించింది మొదలు ప్రసవం పూర్తిఅయి శిశువు భూపతనం అయ్యేవరకూ వివిధదశలూ - ఈ విధంగా సృష్టికథ అంతా విశదంగా తెలిసేటట్టు మట్టిబొమ్మలూ, లాంతరు బొమ్మలూ -lantern slides-ఫిల్ములూ తయారుచేసి, యీ రహస్యాలను అర్థంచేసుకుని దంపతులు తమ బాధ్యతలను గ్రహించేటట్టూ, తల్లులుకాబోయే బాలికలు, నిజపరిస్థితులను తెలుసుకుని అందుకు జాగ్రత్తపడేటట్టూ, అనేకవిధాల ప్రదర్శనాలూ, ఉపన్యాసాలూ మొదలైన యేర్పాటులు వున్నవి. అమెరికా దేశంలో ఈ యేర్పాటులు ప్రదర్శనశాలలలోనేకాదు, విద్యాలయాలలోకూడా ఉన్నవి: ఆల్బామా, కేలిఫోర్నియా,

మిచిగాన్, మిసిసిపీ మొదలైన విశ్వవిద్యాలయాలలోనూ, అనేక పాఠశాలలలోనూ యీ మట్టిబొమ్మల ప్రదర్శనాలు యేర్పాటు చేశారు.

కలకత్తాలో కొందరు ప్రాజ్ఞులు ఏడు సంవత్సరాలనుంచి ప్రబోధించగా, ఈ శాస్త్రజ్ఞానాన్ని గురించి విజ్ఞులచేత ఉపన్యాసాలు ఏర్పాటుచేయడానికి విశ్వవిద్యాలయఅధికారులు అంగీకరించినట్టు ఈ మధ్యను తెలిసింది. మన దేశంలోకూడ విశ్వవిద్యాలయాలూ, పాఠశాలలూ ఇటువంటి యేర్పాటుల్ని చేయడం మంచిది. ఈ సందర్భంలో ప్రభుత్వంకూడా ఈ క్రింది యేర్పాటుల్ని చేయడం వారి విధి అని నా మనవి: అమెరికాలో అమ్మకానికి వున్న మట్టిబొమ్మల్నీ, లాంతరు బొమ్మల్నీ తెప్పించి, వాటి ప్రదర్శనాలతో సమర్థులైన డాక్టర్ల చేతను ఉపన్యాసాలు యేర్పాటుచేసి, ప్రతీఊరిలోనూ ప్రసూతిగృహాలను నిర్మించి, పురపాలకసంఘాలద్వారా వీటిని నిర్వహించి, ప్రజలకు సరియైన జ్ఞానాభివృద్ధికి తోడ్పడవలెను.

కామశాస్త్ర ప్రసంగాలు ఉచితమా; బహిరంగంగా ఈ ప్రసంగాలు చేయడమూ, దీనికి సంబంధించిన రచనల్ని చదవడమూ, ఈ సందర్భాలలో కొందరైనా ఉద్రేకంలో పడిపోడానికి అవకాశం వుంటుందికనుక, ఈ యత్నాలు మానరాదా; అనే ఆక్షేపణను గుర్తించి, దానికి జవాబుగా: 'బోద్ధవ్యంతు దోషేష్వేవ, నహి భిక్షుకా స్సంతీతి స్థాల్యో నాఽధి శ్రీయంతే; నహి మృగాస్సంతీతి

యవా నోప్యంతే?' అనగా, దోషభయంతో పరిత్యజించ మనడం బుద్ధిమంతుల లక్షణం కాదు. భిక్ష అని, బాధించే బిచ్చగాళ్ళు వున్నారు కదా అని, వంటలు మానుకుంటారా? భక్షించివేసే జంతువులు ఉన్నవి కదా అని, పంటలు మాను కుంటారా?' అని వాత్స్యాయనుడు వాదించాడు.

ప్రయోజనాలను గుర్తించ కుండా, ప్రమాదాల అవకాశం వున్నంతమాత్రాన భయపడి పోయేవారు ప్రపంచకంలో ప్రయోజకులు కాలేరు. ప్రయో జనకారి అయిన జ్ఞానం ప్రమాదకరం కూడా కావొచ్చును. మానవజీవితానికి నిప్పు చాలా అవసరం. నిప్పుని నియమా లలో వుంచి జాగ్రత్తగా ఉపయోగించిననాడు, అది అనేక విధాల ఉపయుక్తపడి మానవసుఖానికి ముఖ్యమైన వస్తువు అవుతుంది. కాని, నిప్పుని, నియమాలలో వుంచనినాడు, అంత కన్న ప్రమాదమైనది మరొకటి లేదు; సమస్తాన్నీ దగ్ధంచేసి వేస్తుంది.

జ్ఞానం నిప్పువంటిది !

జాగ్రత్త !

# మిథునం

ఆడ – మగ, ఈ రెండింటి మధ్యనూ ఉన్నంతటి ఆకర్షణశక్తి ప్రపంచంలో మరియెక్కడా కానరాదు.

స్త్రీకోసం పురుషుడు, పురుషుడి కోసం స్త్రీ –

ఈ ఆకర్షణవల్ల కలిగినవే, ప్రపంచచరిత్రలోని గణనీయమైన అనేక ఘట్టాలు! ఈ వస్తువు లేనిదే ప్రపంచవాఙ్మయంలోని మహాకావ్యాలుకొన్ని ఉద్భవ మయ్యేవికావు.

సీతసౌందర్యం అయస్కాంతం వంటి ఆకర్షణకాకపోతే రావణుడు, తన కీర్తినీ, తన రాజ్యాన్నీ, తన ప్రాణాన్నీ దగ్ధంచేసుకునేవాడుకాడు; రామాయణ మహాకావ్యం సృష్టిఅయ్యేదికాదు –

దుర్మదంతో దుశ్శాసనుడు, ద్రౌపదిని నిండుసభలో జుట్టుపట్టి లాగివుండకపోతే, భారత యుద్ధానికి అంతటి ప్రబలపౌరుషాలు చెలరేగజేయడానికి అవ కాశాలు ఉండేవికావు; భారత ఇతిహాసరచన జరిగేదికాదు –

ఆప్రాంత దేశాలలో అంతటి సౌందర్యవతిలేదు అనేపేరు మారుమోగిన 'హెలెన్' ను

తస్కరించడమే జరిగివుండకపోతే, ట్రాయ్ యుద్ధం తటస్థించేది కాదు, 'ఇలియడ్' అనే మహాకావ్యం - గ్రీకుభాషలో - తయారయ్యేదికాదు —

ఈజిప్టురాణి, 'క్లియోపాత్రా' సౌందర్యానికి సీజర్, ఆంథోనీలు ముగ్ధులుఅయి వుండకపోతే, రోము సామ్రాజ్యచరిత్ర అంత హాఠాత్తుగా మార్పుచెందేదికాదు. షేక్స్పియర్, బెర్నార్డుషాల ఉజ్వల నాటకాలు వెలిసేవికావు.

'సింప్సన్' సతిని ప్రేమించడం అనే చిక్కు తటస్థించివుండకపోతే, అష్టమయెడ్వర్డు, సూర్యుడు అస్తమించని ఆంగ్లేయమహాసామ్రాజ్యాన్ని అంత అవలీలగా, కాలిగోరితో నెట్టిపారవేసేవాడు కాడు.

ఆడ - మగ, ఈ గారడీలోనే ఇమిడివున్నది సృష్టిరహస్యం అంతా! స్త్రీకోసం పురుషుడు, పురుషుడికోసం స్త్రీ, యెంతటి సాహసాలకైనా పూను కున్నారు; స్త్రీ గౌరవాన్ని కాపాడడానికి పురుషుడు వొళ్లు ఝల్లుమనే పౌరుషకార్యాలకు చొరబడి, నిర్విక్రమపరాక్రమంతో అనేక యుద్ధాలు చేశాడు. స్త్రీ, తన మానానికి భంగం కలుగుతుంది అన్ననాడు, కత్తిదూసి కలియబడి యుద్ధం చేసింది; అసహాయి అయిననాడు, జంకూ గొంకూ లేకుండా ఆత్మహత్యకు సహితం పూనుకున్నది.

ఈవృత్తాంతాలనుబట్టి యోచిస్తే పురుషుడి ఘనతతోపాటు స్త్రీ శక్తినికూడా అంగీకరించాలి. కాని, యెందుచేతనో, ఎక్కడచూసినా, పురుషుడు తనలో ఒక ఆధిక్యత వున్నట్టుగానూ, తన మీదనే సమస్తమూ ఆధారపడినట్టుగానూ భావిస్తున్నాడు. ఈ భావంతోనే 'ఆడ' 'మగ' శబ్దాలలో విశేషమైన అర్థాన్ని యిమిడ్చి వాడడం మామూలు అయింది. 'మగ' శబ్దంలో, పౌరుషమూ, పొగరూ, బలమూ, యిమిడివున్నట్టుగానూ; 'ఆడ' శబ్దంలో, పిరికితనమూ, అణకువా, అబలత్వమూ, యిమిడివున్నట్టుగానూ భావించడం పరిపాటి అయ్యింది. అయితే స్త్రీ - పురుషుల మధ్యను యీ అంచనాలు సమంజసమా, న్యాయమా, అని యోచించవలసివొస్తే, ప్రకృతిని పరిశీలించాలి:

ప్రకృతిలో యెక్కడచూసినా, మిథునాలలో మగదానికి బలం హెచ్చు, పౌరుషం హెచ్చు, పొగరు హెచ్చు. అంతే కాదు, విగ్రహాన్నీ, గాంభీర్యాన్నీ, అందాన్నీ గుర్తించినా, మగజాతిది పైచేయి అనిపిస్తుంది. నిజమే! మగసింహానికివున్న గంభీరమైన జూలు ఆడసింహానికి లేదు; కణుసు, దుప్పి మొదలైన జంతువులలో, మగజాతికి వున్న అందమైన కొమ్ములు ఆడదానికి లేవు; పక్షులలోకూడ, సాధారణంగా మగపిట్టకువున్న రంగులూ, ఠీవీ, ఆడదానికి లేవు. కోళ్లలో పుంజుకువున్న యెర్రనిజుట్టూ, రంగులూ పెట్టకు లేవు; మగనెమిలికి వున్న అద్భుతమైన పింఛం ఆడదానికి

లేదు; మగకోకిలకు వున్న స్వరమాధుర్యం ఆడకోకిలకు లేదు. విగ్రహమూ, గాంభీర్యమూ, సంగతిని అటువుంచి, బలమూ, పౌరుషమూ, సంగతిని ఆలోచించినా, జంతువులలోనూ పక్షులలోనూ కూడా, మగది పోట్లాడడంలో పేరుపొందింది; ఆడదాని రక్షణకు సాధారణంగా మగది అన్నివిధాలా సంసిద్ధమౌతుంది.

ఇక, సృష్టికి కారణభూతమైన శుక్ల శోణిత అణువుల స్వభావంలోకూడ, యీ భేదం కనిపిస్తుంది; స్త్రీనుంచి వెలువడే శోణితఅణువు గుండ్రంగా బంతివలె వుంటుంది; యిది ఇతర శక్తులవల్లను దొర్లుకుని రాగలదుకాని, స్వశక్తి వల్లను కదలలేదు. పురుషుడినుంచి వెలువడే శుక్ల అణువు అలాకాదు; యిది తలా, శరీరం, తోకా కలిగివుండి, స్వశక్తివల్లను, తోక విసురులతో, యీదుకునిపోగలదు; అలా ఎదురు ఈదుకునివెళ్లి శోణితఅణువు దానికి తగలగానే, శోణిత అణువు పైవలయాన్ని చీల్చి, దానిలో ప్రవేశిస్తుంది. సృష్టి ప్రారంభంలోనే, బీజాణువుల ప్రవర్తనలలో సహితం, స్త్రీ శోణితఅణువులో స్తబ్దతా, పురుషుడి శుక్లఅణువులో కదిలేశక్తి యేర్పాటయివున్నవి. ఈ వృత్తాంతాన్నిబట్టి కూడా పురుషుడు తానే యెక్కువ శక్తిగలవాడననీ, సృష్టికూడా తనమీదనే ఆధారపడినదనీ గర్వించడం సహజం అనిపిస్తుంది.

అయితే, మగజాతి గర్వాన్ని అంగీకరించకతప్పదా, సృష్టిఅంతా మగజాతిమీదనే ఆధార

వడివున్నదా, అంటే. కాదు, మగజాతిని ఈసడించి పార వేసిన ప్రాణులు లోకంలో లేకపోలేదు, అని చెప్పడానికి అవ కాశాలు వున్నవి. ప్రకృతిలో, ఏకకణాలు - unicellular - అనే ప్రాణులు ఉన్నవి. వీటి శరీరనిర్మాణం అంతా ఒకటే కణం. ఇతర ప్రాణులశరీరాలలోవలె, అనేక కణాలకూడి కతో వివిధ అవయవాలూ, అనేక అవయవాలతో శరీరమూ, ఏ అవయవాలు వాటి పనులను నిర్వర్తిస్తూ శరీరపోషణ జరగ డమూ, ఈ యేకకణాలలో లేదు. ఏకకణాల జీవనానికి అవ సరమైన విధులన్నిటినీ కూడా, ఆ ఒక్క కణమే నిర్వర్తిస్తుంది. ఈ ఏకకణాలు కూడా ప్రాణులే. యివికూడా స్పర్శకు స్పందిం చుతవి. సృష్టికథ వీటిలో ఒక చిత్రరూపాన్ని జరుగుతుంది: ఈ ఏకకణం, ఒక దశలో రెండు భాగాలుగా విడిపోతుంది; అంతతో, విడివడిన రెండు కణాలూ, రెండు జీవులు అవుతవి. వీటి పరిణామం యింతే.

కొన్ని జాతుల మొక్కలలో కూడ ఆడ - మగ భేదాలు వేరు వేరు రూపాలను పొందవు. ఒకే పువ్వులో అండకోశం -Pistils-, కేసరాలు -Stamens యిమిడివుంటవి. వీటి కలయిక ఆపువ్వులోనే తటస్థించి, తద్వారా కొత్తమొక్కసృష్టికి ఆధారం యేర్పాటవుతుంది. మట్టిలోవుండే 'యెర్రలు' - Earth-worms- అనే పురుగు లలో సృష్టికూడ, ఆడ - మగ భేదాలతో నిమిత్తంలేకుండా

జరుగుతుంది. ఒకజాతి ఆకుపచ్చ ఈగలలోనూ - Green flies -, నీటిగోమారులలోనూ - Water-fleas - మగ దానితో ఏ నిమిత్తమూ లేకుండానే, ఆడది పెట్టినగుడ్లు తమంతటతామే పిల్లలు అవుతవి.

చేపలలోకూడ ఒక చిత్రమైన విధానం వున్నది. ఆడచేపలు ఈదుకుంటూపోయి, ఏదోవొక చోట తమ గుడ్లను విసర్జించుతవి. మగచేపలు కూడా అదే విధంగా యీదుకుపోతూ, ఆ గుడ్లు వున్నచోటికి రాంగానే, తమ ద్రవాన్ని ఆ గుడ్లమీదను విసర్జించుతవి. ఈ రెండింటి కలయిక కలగగానే, చిరుమీను పుట్టుకకు ఆధారం యేర్పాటవుతుంది.

ఈ విధంగా, ప్రకృతిలో అనేక ప్రాణులలో 'కనీన సంతానం' కలగడం సహజంగా వున్నది. 'కనీన సంతానం' అంటే, తల్లి కన్యగానే వుండికూడా సంతానాన్ని కనడం. కనీనసంతానం రహస్యాన్ని గ్రహించి కాబోలును, లోబ్, అనే పరిశోధకుడు ఒకవిచిత్రసృష్టిని చేశాడు: సముద్రంలోవుండే ఒక జాతిచేపల - Sea-urchins - గుడ్లకు కొన్ని రసాయనాలను పట్టించి, పిల్లలను తయారుచేశాడు. లోబ్ పరిశోధనలను అనుసరించి, మరికొందరు పరిశోధకులు మరికొన్ని జాతుల చేపల గుడ్లనూ, కప్పగుడ్లనూ కూడా, అదేపద్ధతిని పిల్లల్ని చేయించారు.

సృష్టి, యీవిధంగా కనీసనంతా
నానికి అవకాశంవున్న ప్రాణులలోమాత్రమే కల్పనఅయివుంటే, ఆడజాతి మగజాతికి సలాముపెట్టి, 'నీ నిమిత్తం యెవరికి ?' అని అనగలిగేది. కాని, సృష్టి ఏక కణాలలోనూ, మొక్కల లోనూ, కీటకాలలోనూ, చేపలలోనూ ఆగిపోలేదు ; ఒకదానికి వొకటి తప్పనిసరి అయిన మిథునాలను కూడా కల్పించింది. ఈ మిథునాలలో ఆడ మగ భేదాలను కల్పించి, ఈ యిరువురికీ ఒకరితోవొకరికి సహవాసం తప్పనిసరిచేసి, జాతి అభివృద్ధి నిమిత్తం వీరిలో వేరువేరు శక్తులను యిమిడ్చింది. ఈ శక్తులలో భేదాలు వుండడంవల్లను స్త్రీలోని శోణితఅణువు స్వశక్తితో కదలలేనిదిగానూ, పురుషుడిలోని శుక్లఅణువు యెక్కువ శక్తి గలదై తనంతటనుతాను కదిలి, శోణిత అణువునిచీల్చి, దానిలో ప్రవేశించగలిగినదిగానూ సృష్టిఅయినవి. అంతలో నా సామర్థ్యం యెక్కువ అని మగవాడు గర్వించడానికి అవకాశం కలిగింది. ఇంతతోకూడ ఆగలేదు, మరొక్క అడుగు ముందుకువేస్తే పుట్టబోయే శిశువు ఆడపిల్లఅయ్యేదీ, మగపిల్లవాడు అయ్యేదీ, నిర్ణయంకూడా పురుషుడి శుక్లఅణువుమీదనే ఆధారపడింది. పుట్టబోయే శిశువు ఆడ-మగ నిర్ణయానికి సంబంధించిన రహస్యం యిది.

శుక్ల - శోణిత అణువుల కల
యికతో పిండం యేర్పాటు ప్రారంభమౌతుంది. ఈశుక్లశోణిత అణువులలో సూక్ష్మాతిసూక్ష్మమైన ఈనెలు వున్నవి. వీటిని క్రోమోజోంలు -chromosomes- అంటారు. క్రోమోజోంలు

రెండు విధాలుగావున్నవి. వీటిని ' ఎక్స్ క్రోమోజోంలు ' _X chromosomes_అనీ, "వై క్రోమోజోంలు"_Y chromosomes_అనీ, శిశువు ఆడ-మగ నిర్ణయంలో వీటికి వున్న శక్తులనుబట్టి, వీటిని భేదించారు. ఎక్స్, వై రహస్యం యిది: స్త్రీ శోణిత అణువులలో అన్నీ ఎక్స్ క్రోమోజోంలే వుంటవి; కాని పురుషుడి శుక్లఅణువులలో ఎక్స్ క్రోమోజోంలూ, వై క్రోమోజోంలూ కూడా వుంటవి. ఇక, వీటి కలయికలో,ఎక్స్‌తో ఎక్స్ కలిస్తే, ఆడపిల్ల; ఎక్స్‌తో వై కలిస్తే, మగపిల్లవాడు. స్త్రీ శోణిత అణువులో అన్నీ ఎక్స్ క్రోమోజోంలే వుండడంవల్లనూ పురుషుడి శుక్లఅణువులలో ఎక్స్ క్రోమోజోంలూ, వై క్రోమోజోంలూకూడా వుండడంవల్లనూ, తనలోని ఎక్స్ వై లే ఆడ-మగ నిర్ణయానికి కారణమౌతూ వుండడంవల్లనూ, మగగర్వానికి మరొక కొత్త అవకాశంకూడా యేర్పాటయ్యింది.

అయితే, ఇంతవరకూ విశదమైన విషయాలనుబట్టి పురుషుడి ఘనతకు తలవొంచి, పురుషఅహంకారానికి లొంగి 'మగ' శబ్దానికి అన్వయించే ఆధిక్యతను కిమ్మనకుండా అంగీకరించవలసినదేనా అంటే ; కాదు, తొందరపడి నిర్ణయానికిరావడం ధర్మంకాదు, స్త్రీ పక్షాన్నివున్న విశేషాలనుకూడా విచారించి మరీ తీర్పుకురావాలి అనడం న్యాయంకదా !

పుట్టబోయే శిశువు ఆడ - మగ నిర్ణయం పురుషుడి ఎక్స్ వై క్రోమోజోంల మీదను ఆధార

పడినమాట నిజమే ; కాని, పిండం పరిణామంలో ఒక రహస్యం వున్నది. పిండం ఎదుగుదలలో ఏడవవారంనాటికిగాని అవయవాల యేర్పాటులో ఆడ - మగ నిర్ణయం తేలదు. అంటే, ఏడవవారంనాటికి అన్ని అవయవాలూ తమ ఆకారాన్ని పొందుతూవుంటవి. ఆ దశలో అంతరింద్రియాల యేర్పాటులో ఒక మర్మంవున్నది. పిండం పొత్తికడుపుభాగంలో శోణ కోశాలు తయారయి, అవి, పొత్తికడుపులోనే నిలిచిపోతే, ఆ పిండం ఆడరూపాన్ని తాలుస్తుంది; లేక, శోణకోశాలు కాకుండా, అవి దిగజారి, తొడల సందుకుచేరి, వృషణాలుగా మారినట్టయితే, ఆ పిండం మగరూపాన్ని తాలుస్తుంది. అంటే, పిండం ఏడవవారంలో శోణకోశాలు తయారు కావడమా, లేక అవి దిగజారి వృషణాలు కావడమా అనేది సమస్య. ఈ సమస్య యెలా పరిష్కారమౌతుంది, అంటే, హార్మోన్లు -Harmones- అనే విచిత్ర రసాయనాలవల్లను, అని గర్భ శాస్త్ర పరిశోధకులు ఈనాడు కనుక్కున్నారు. పిండం, ఆడ-మగ సందిగ్ధస్థితిలోవుండగా, మగ నిర్ణయానికి సంబంధించిన హార్మోన్ కలిస్తే మగపిల్లవాడు, లేదా ఆడపిల్ల, అని ఇటీవల పరిశోధకులు నిర్ణయించారు. నేటి గర్భశాస్త్రపరిశోధకులు కనుక్కున్న యీ రహస్యాన్ని బట్టి యోచిస్తే, ప్రతీపిండమూ ఆడ దనంతోనే ప్రారంభమై, ఏడవవారంలో హార్మోన్ల కలయికతో ఆడ - మగ నిర్ణయాన్ని పొందుతూవున్నది అనీ; ప్రతీపిండమూ ఆరంభంలో ఆడదనంతో నిమిత్తంలేకుండా మగతనాన్ని పొందడంలేదనీ అంగీకరించకతప్పదు.

ఈ విధంగా, ప్రతీప్రాణీ స్త్రీత్వంతో ప్రారంభమౌతూవున్నది అని యీనాడు నిర్ణయంగా తేలడంవల్లను, స్త్రీ-పురుష భేదాలను గురించి మనకున్న పాత అభిప్రాయాలను మార్చుకోడం అవసరమని డాక్టర్ కెన్నెత్ వాకర్ నిష్కర్షగా చెబుతున్నాడు. అంతేకాదు, యీ సిద్ధాంతాన్ని బట్టి, సంపూర్ణంగా మగ, సంపూర్ణంగా ఆడ, అని చెప్పదగిన వ్యక్తులు కేవలం ఊహ అనీ, ప్రతీవ్యక్తిలోనూ ఆడ - మగ పాళ్లు కలిసివుండడం తప్పదనీ, కెన్నెత్ వాకర్ సూచిస్తున్నాడు.

జాగ్రత్తగా పరిశీలిస్తే, ప్రతీ వ్యక్తిలోనూ యీ మిశ్రమలక్షణాలు వున్నట్టు తెలియకపోదు. ఈ పాళ్లు మరీ హెచ్చుగావున్న వ్యక్తులు త్వరగానే తెలిసిపోతారు: ఒక్కొక్క స్త్రీ నడకా, గొంతుకూ, పోంకమూ, తీరూ అంతా మగతనాన్ని సూచిస్తూ వుంటుంది. అటువంటి స్త్రీని వేళాకోళంగా 'మగరాయడు' అంటారు. ఈవిధంగానే, ఒక్కొక్క పురుషుడి నడకా, స్వరమూ పోంకమూ, తీరూ అంతా ఆడదనాన్ని సూచిస్తూ వుంటుంది; అటువంటి పురుషుణ్ణి వేళాకోళంగా 'ఆడంగి' అంటారు. పాళ్లు హెచ్చుగా వడడంలో విపరీతం అయి, ఇటువంటి వ్యక్తులు బహిరంగంగా తెలిసిపోతున్నారు. కాని, అంత విపరీతంగా వ్యక్తం కాకపోయినా, ప్రతీవ్యక్తిలోనూ, ఆడ - మగ పాళ్లు కలిసివుంటూ వున్నవి, అని నిర్ధారణ అవుతూవున్నది. కనుక డాక్టర్ కెన్నెత్

వాకర్ చెప్పినట్టు, స్త్రీని గురించి మనలో అమలులోవున్న పాతఅభిప్రాయాలను మార్చుకోడం తప్పదుకదా !

ఇక, 'మగ' శబ్దంలో యేదో బలాన్ని సూచిస్తూ, స్త్రీని 'అబల' అని నిరసనగా పలకడం గురించి యోచిస్తే, కొన్ని సందర్భాలలో ఈ దృష్టి కూడా తబ్బిబ్బుకాక తప్పదు. జనాభా లెక్కలలో పుట్టుకల సంఖ్యను బట్టి చూస్తే, ప్రతీ నూరుగురు ఆడపిల్లలకూ నూటయెనమండుగురు మగపిల్లలు పుడుతున్నారు అని విశదమౌతూవుంది; కాని, ఏ దేశం జనాభా లెక్కలను చూసినా పురుషులకన్న స్త్రీల సంఖ్య యెక్కువగా వుంటూవున్నది. దీనినిబట్టి, శాస్త్ర రీత్యా తెలుస్తూవున్న కొన్ని యితరవిషయాలనుబట్టీ, ఆయుక్షీణంచేసే దుశ్శక్తులను స్త్రీ తట్టుకున్నట్టుగా పురుషుడు తట్టుకోలేకుండా వున్నాడు, అని పరిశోధకులు తెలియజేస్తున్నారు. మృత్యువుని తట్టుకోడంలో పురుషుడికన్న స్త్రీ యెక్కువ శక్తివంతురాలు అన్ననాడు, ఆమెను 'అబల' అని నిరసనగా పలకడం భావ్యమా, యోచించాలికదా !

మరొక్క సంగతికూడా గుర్తించవలసివున్నది: ఇది, ఆనువంశికలక్షణాలను గురించినది — ఆనువంశికలక్షణాలు అంటే, వంశంలో పూర్వులైనవారి పోలికలూ, లక్షణాలూ మొదలైనవి సంతానానికి సంక్రమించడం — ఆనువంశిక లక్షణాలు సంక్రమించడంలో పురుషుడి పూర్వుల లక్షణాలు మాత్రమే సంక్రమించడంలేదు; స్త్రీ వంశంలోని

ఆమె పూర్వుల లక్షణాలుకూడా సంతానానికి సంక్రమిస్తూ వున్నవి. మేనమామ పోలికలు మామూలుకదా!

ఇంతవరకూ విశదమైన అన్ని విషయాలనూ గుర్తించి యోచిస్తే, ప్రాజ్ఞులు ఒక నిర్ణయానికి రాకతప్పదు: హెచ్చు - తగ్గు భావం సమంజసం కాదు; కొన్ని శక్తులు పురుషుడిలోనూ, కొన్ని శక్తులు స్త్రీలోనూ అధికంగా వున్నా, యిరువురిలోనూ వున్న శక్తులన్నీ ఏకమైతేనే తప్ప సృష్టి ప్రయోజనం నెరవేరదు; అందుచేతనే, ఈ యిరువురి మధ్యా ప్రేమ అనే మహత్తరశక్తి ఏర్పాటయినది.

ప్రేమలో యింతటి మహత్తర శక్తి యిమిడివుండకపోతే, మిథునాలకు నిమిత్తం వుండేదికాదు; మిథునాలకు నిమిత్తమే లేనినాడు మానవచరిత్ర మరి యే విచిత్రవిధిని అనుసరించేదో!

35

# దాంపత్యం

సతీపతుల జీవితాలను అన్యోన్య ప్రేమ పెనవేయగలిగితే, జీవయాత్ర శ్రుతికుదిరిన పాటగా, కసు గందుల ఆటగా, రోజులు ఘడియలుగా, ఘడియలు లిప్తలుగా, సంసారయాత్ర సుఖస్వప్నంగా గడుస్తూ, ఆ అదృష్టవంతుల దృష్టికి భూతలం స్వర్గసీమగా వికసిస్తుంది. అన్యోన్యప్రేమతో దాంపత్యం అనుకూలం కానినాడు, సంసారం ఈదరాని సముద్రంగా, జీవితం దాటరాని అరణ్యంగా, ప్రపంచం ప్రత్యక్ష నరకంగా మారి, కన్నీటికెరటాలలో తేలలేక మునగలేక, కఠిన నరకాన్ని అనుభవిస్తారు; ఆ దురదృష్టవంతులు.

దాంపత్యాన్నీ, దంపతుల్ని యావజ్జీవమూ, దంపతులదృష్టిలో ప్రపంచకాన్నంతనీ, యింత విపరీతంగా తబ్బిబ్బుచేసి, జీవితాన్ని స్వర్గంగాకాని, నరకంగా కాని మార్చగలిగినంతటిశక్తి, యీ ప్రేమలో ఇమిడివున్నది. అందుచేతను, ఈ ప్రేమ యేమిటో, దీనిని పొందడం యెలాగు ననో గ్రహించడానికి యత్నించాలి.

"ప్రేమ ఏమిటి?" అనే ప్రశ్నకు "గాలి ఏమిటి?" అనే ప్రశ్నే జవాబు. ప్రేమ, గాలి, ఉన్న వని నిర్ణయించడానికి నిమిత్తాలే నిదర్శనాలు. గాలివలె ప్రేమ

కూడ మలయమారుతమై సుఖప్రదం కావొచ్చును; లేదా, ప్రళయరూపాన్ని తాల్చి, ఝంఝూమారుతమై ప్రమాద కరం కావొచ్చును. ఇంతటి ప్రబలశక్తిని తనలో యిముడ్చు కున్న ప్రేమను గ్రహించడం అసాధ్యం కావడంవల్లనే మానవ జాతికి మహాకష్టం యేర్పాటయ్యింది. కష్టమనిజంకి, ఊరక వుండలేరు మనుష్యులు; ఎంతటి ప్రమాదాన్ని యెదుర్కొని అయినా, ప్రేమను పొందనిదే జీవితం వ్యర్థమన్నట్టుగా బాధ పడతారు. అయితే, ఈ ప్రేమను పొందడం యెలాగున?

నీటిలో దిగడానికి భయపడి గాభరాతో గట్టుమీదనే చదికిలబడినవారు యేనాటికీ ఈత నేర్వలేరు; సాహసించి నీటిలోకి దూకి, తల ముంచి, కరచర ణాలు విదిల్చి కొట్టుకుని తంటాలు పడినవారే ఈత నేర్వ గలరు. దాంపత్యం ఈతవంటిది. తలమున్కలై మునిగినాసరే, అని సాహసించి దీనిలో దిగినవారే సాధించి తరించగలుగుతారు. వివాహాన్ని గురించి వేళాకోళంగాచెప్పే సామెత ఉన్నది: "దీనిలో పడినవారు, తప్పుకొగలిగితే బాగుండునని బాధపడ తారు; దీనిలో పడనివారు, యెప్పుడు పడదామా అని ఆత్రుత పడతారు" అని. నిజమైనప్రేమను పొందడానికీ, ఆ ఆనం దాన్ని అనుభవించడానికీ, దాంపత్యాన్ని ప్రతీవారూ కోర్తారు; ఈ సుఖాన్ని సాధించలేనినాడు, జీవితం వ్యర్థంగానూ, బ్రతుకు బాంధవ్యం శూన్యంగానూ భావించుతారు; అందుచేతను దాంపత్యాన్ని అభిలషించనివారు అరుదు.

దాంపత్యం యేర్పాటు కావడం అంత కష్టంకాదు. వధువునో, వరుణ్ణో యేవిధంగానైనా సంపాదించవొచ్చును; యితర విధాలను సాధ్యపడకపోతే, డబ్బిచ్చికొనుక్కోవొచ్చును; కాని, ప్రేమను సంపాదించడం యెలాగ? ఇది గడ్డుసమస్యకావడంవల్లనే అనేక జీవితాలు అర్ధాన్నంపాలు అవుతూవున్నవి.

అయితే, ప్రేమ యెలా కలుగుతుంది? ప్రేమ వున్నట్టుగాగాని, ప్రేమ కలగగలదనిగాని ముందుగా తెలిసికోగలమా? ప్రేమ కలిగేటట్టుచేసే విధానాలు ఏమైనా ఉన్నవా?

ఈ ప్రశ్నలకు జవాబులేదు. ప్రేమ దానంతటఅది లభించవలసిందేకాని, దీనిని సాధించే మార్గాలులేవు. దాంపత్యంలో ప్రేమను పొందగలిగినవారు అదృష్టవంతులు, తదితరులు దురదృష్టవంతులు. అంతే! ఇటువంటి సమస్యలకు పరిష్కారం దొరకకపోవడంవల్లనే వేదాంతానికి తావు యేర్పడింది; ఇటువంటి ప్రశ్నలకు సబబైన సమాధానం లభించకపోవడంవల్లనే, కర్మసిద్ధాంతాన్నీ, పూర్వజన్మసుకృతాన్నీ, అదృష్టాన్నీ శరణ్యంచేశారు వేదాంతులు.

అన్యోన్య ప్రేమతో ఆనందప్రదంగా జీవిస్తూవున్న దంపతులను కనిపెట్టి, వారి జీవితాలనూ స్వభావాలనూ తరిచి, ఈ ప్రేమకలగడానికి కారణాలు యేమిటని, తర్కిస్తే, నిర్ణయానికి ఆధారంఅనేది యెక్కడా దొరకదు.

రూపమా, గుణమా, తెలివా, శీలమా...... యీ విధంగా లక్ష ప్రశ్నలు వేసినాకూడా, దేనికీ సరియైన జవాబు ఉండదు. "నీవు యెందుకు ప్రేమిస్తున్నావు" అనే ప్రశ్నకు ఒక్కటే జవాబు: "నా కళ్లతో చూడు" అని.

తర్కానికి దొరకని యేవో ఆకర్షణలు ప్రేమకు కారణభూతాలని తృప్తిపడుచుకోడంకన్న వేరే నిర్ధారణ వీలులేదు. అందుచేతనే, "ప్రేమ గుడ్డిది" అనీ, "తా వలచింది రంభ" అనీ అన్నారు విజ్ఞులు. సాధించి సంపాదించలేని యీ ప్రేమను గురించి తర్కించి ప్రయోజనం లేదు; అందుచేత, ఆ ప్రశ్నల్ని విడిచి, అన్యోన్యప్రేమ వున్నంత మాత్రాన దాంపత్యం సుఖవంతం అవుతూవున్నదా; ప్రేమ పూరితులైనంతమాత్రాన దంపతులు ఆనందం ఆవలితీరాన్ని చేరగలుగుతున్నారా; ఆదంపతులకు భూతలం స్వర్గసీమ అవుతూ వున్నదా; ఈప్రేమ ప్రసక్తి అటువుంచి, దాంపత్యాన్ని సుఖవంతం చేసుకునే మార్గాలు ఉన్నవా? ఈ ప్రశ్నలు చర్చించదగినవి.

ప్రేమ ఉన్నంతమాత్రాన దాంపత్యం సుఖంగానే వున్నదని నమ్మడంకూడా భ్రమకావొచ్చును. సకలైశ్వర్యాలూ కలిగి, చక్కని సంతానాన్ని కంటూ, అన్ని విధాలా ఆదర్శదంపతులవలె కనబడుతూ; చూసేవారు "ఎంత అదృష్టం, ఏమి అన్యోన్యత, ఏమి దాంపత్యం!" అని ఆనందించే టట్టుగా వుండికూడా, ఆ కాపురం కేవలం మేడిపండు వంటిది అయివుండవొచ్చును.

పడకటింటి గడప యివతలను ఆదర్శదంపతులవలె కనపడే యిటువంటి సతీపతులు, 'జీవితంలో పొందవలసిన సుఖాన్ని దేనినో పొందలేక పోతున్నాము' అని లోలోపల బాధలుపడుతూ, ఒకరిని వొకరు కోరవలసినంతగా కోరరు. అల్పవిషయాలలో కూడా అనవసరంగా చీకాకులు కల్పించుకుంటారు, మానసికంగా సుఖాన్నీ, శాంతినీ పొంద లేక, యిసుర్రుపుతూ, రానురాను నరాలసత్తువ సహితం పోగొట్టు కుని, జీవితం దుర్భరం చేసుకుంటారు. దంపతులు యిటువంటి విషమస్థితిలో పడిపోయినప్పుడు, ఆమె హృదయంలో యేదో అసంతృప్తిని పెంచుకుని, జీవితంలో యేదో లోపం వున్నట్టు బాధపడుతుంది; అతడు, జాగ్రత్తను అలవాటుపడనివాడైతే, తనభార్యవల్ల లభించనిసుఖాన్ని ఇతర స్త్రీలవల్ల పొందడానికి యత్నాలు ప్రారంభిస్తాడు. ఈ విధంగా, చూడడానికి అన్ని విధాలా సుఖవంతంగానూ, సొగసుగానూ పైకి కనబడుతూ, అంతర్గతంగా బాధలుపడుతూవున్న సంసారాలు అనేకం ఉన్నవి" అని హెర్బర్ట్ గ్రే, మేరీ స్టోప్స్ మొదలైన విజ్ఞులు తెలియ బరిచారు.

భర్త, వ్యభిచారంపాలుకావడానికి తాను కారణమా అనే సంగతిని భార్య గ్రహించడం చాలా ముఖ్యం. భర్తకు సంపూర్ణతృప్తి కలుగుతూవున్నదా లేదా అనే సంగతిని భార్య గ్రహించాలి. కేవలం తనశరీరాన్ని అర్పించడంమాత్రం చాలదు. తన వ్యసనాన్ని తీర్చుకోడానికి

మాత్రం ఉపయోగపడుతుంది అనేస్త్రీని పురుషుడు విస్తారం కోరడు. దీనిలో యిమిడిన పరమరహస్యం యేమిటంటే: స్త్రీ యెంతటి ఉద్రేకంతో యెంత ఆనందాన్ని తాను పొందగలుగుతుందో, పురుషుణ్ణి అంతగా ఉద్రేకపరిచి, అతనికి అంతటి ఆనందాన్ని కల్పించగలుగుతుంది. అయితే, సిగ్గు అనే తెర చాటును స్త్రీ తొలగించడం మంచిదా అంటారు కొందరు.

స్త్రీలకు సిగ్గే సింగారమనీ, లజ్జలేనిస్త్రీని పురుషులు ఏవగింపుతో చూస్తారనీ, తన మనస్సును పూర్తిగా వెల్లడించివేసేస్త్రీ మగవాడికి ఆకర్షణీయంగావుండదనీ వాదించడానికి అవకాశాలు ఉన్నవి. ఈ వాదనలకు తావులేదనడం పొరబాటే; కాని, యీ వాదనలను మితిమీరజేసి విపరీతం చేయడం అంతకన్నా పొరబాటు. 'ఎంతవరకూ వీటిని పాటించడము' అనే ప్రశ్నకు 'మితిమీరకుండా చూసుకోగల తెలివి అవసరము' అని జవాబుచెప్పాలి. సిగ్గు సింగారం కావడమూ, లజ్జ లాయక్ కావడమూ, బిగువుగలమనస్సే ఉబలాటాన్నికల్పించగలగడమూ......ఇవన్నీ పడకటింటిగడప యివతలిమాటలు; ఏసమయంలో వీటిని యెంతవరకూ విడనాడడం అనేది, యెవరికి వారు తరుణాన్నిబట్టి నిర్ణయించాలి.

సంసారస్త్రీలకు యీరీతులు తగునా, అనే ఛాందసులకు మనపూర్వులే జవాబు చెప్పారు: సంసారాన్ని దిద్దుకోడంలోనూ, దాంపత్యాన్ని సుఖవంతంచేసుకోడంలోనూ, భార్య విధులను తెలియజేస్తూ "శయనేషు

రంభా" అన్నారు. దేవేంద్రలోకంలోని స్త్రీలలో అందరినీ మించిన అందగత్తెగానూ, అతి ప్రౌఢగానూ రంభను సృష్టించారు మన పౌరాణికులు. భర్తకు భార్య రంభవలె కనవడవలెను అనడంలో, చూపులకుమాత్రం రంభగా వుండడం చాలదు అని చెప్పడానికె కాబోలును, "శయనేషు" అని అనుమానంలేకుండా నిర్ణయంగా చెప్పారు.

దాంపత్యం సుంఖవంతంగా ఉండేటట్టు చేసికోడానికి భర్తకూడ కొన్ని రహస్యాలను గ్రహించడం అవసరం: తనసుఖానికి స్త్రీ కేవలం నిమిత్తమాత్రం అని భావించే స్వార్థపరుడైన పురుషుడు చాలా దురదృష్టవంతుడు. అటువంటివాడు పొందదగినంత సుఖాన్ని పొందలేడు; కేవలం తనవ్యసనాన్నిమాత్రం తీర్చుకోగలుగుతాడు; అంతే. పురుషుడు స్త్రీని దరిజేరినప్పుడు, 'నీవు నాదాసివి!' అనే ధీమా పనికిరాదు; 'నేను నీ ప్రియుణ్ణి, నీవు నా ప్రేయసివి!' అనేభావం ప్రతీకలయికలోనూ ప్రధానం కావాలి. అంతే కాదు, ఒకొ్కక స్త్రీలో యేవో కారణాలవల్లను, లోపలి శక్తులు నిద్రాణంగా వుండడం కద్దు; అటువంటప్పుడు పురుషుడు ఆమెలో అంతర్గతంగావున్న శక్తుల్ని, ప్రేరేపించి, శృంగార భావాన్ని రేకెత్తించి, పారవశ్యసుఖాన్ని కల్పించాలి; అటు కానినాడు, ఆమె లోపలిశక్తులు నిద్రావస్థలోనే వుండిపోయి, ఆమె కొంత విరాగిగావుండి, సంయోగాన్ని సంతోషంగా కోరదు.

దాంపత్యం ఆనందదాయకం కావలెనంటే భార్యాభర్తలు యిరువురూ సమమైత్రితో అన్యోన్య ఆకర్షణలను కల్పించుకుని, జీవితం గడిచినకొలదీ ఒకరి యెడలవొకరికి అనురాగం హెచ్చి, రెండు జీవితాలూ ఒక దానితోవొకటి పెనవేసుకునేటట్లు చేసుకోవాలి. దాంపత్య జీవనం గడుస్తూవున్నకొలదీ, ఒకరికి వొకరు అభ్యాసపడిపోవడం వల్లనుకలిగే నిరాదరణసహితం ప్రమాదకరమని దంపతులు గ్రహించాలి. అటువంటి నిరాదరణ, హృదయాలలోని సౌకుమార్యాన్ని తుంచివేస్తుంది; అది, యౌవనాన్ని త్వరలో నాశనంచేసి, వృద్ధాప్యాన్ని దగ్గరకు రప్పిస్తుంది. దాంపత్య ప్రారంభంలో భార్యాభర్తలు ఒకరికి వొకరు ఆకర్షణఅయిన శృంగార రహస్యాలను గుర్తించుకుని, జాగ్రత్తగా వాటిని ప్రయోగిస్తూ వుండాలి. ఈ రహస్యాన్ని గ్రహించే వాత్స్యాయనుడు, "యస్యాం మనశ్చక్షుషోర్నిబంధ స్తస్యాం మృద్ధిర్నేతరామిత్యేకే", అనగా, చూడగానే కంటికీ మనస్సుకీ ఆనందాన్ని కలిగించే టట్టుగా వుండడం చాలాముఖ్యం అన్నాడు. అంటే, ప్రేయసీప్రియుల దర్శనం యిరువురూ నిరంతరం కోరదగినట్టుగానూ, అది కంటికీ మనస్సుకీ కూడా ఆనందాన్ని కల్పించేదిగానూ ఉండవలెను అని భావం.

ముఖ్యంగా పురుషుడు గ్రహించదగిన మరొక్క విషయం వున్నది: ఇదివరలో విశదం అయినట్టు, సృష్టియేర్పాటులోనే స్త్రీ-పురుష ప్రకృతులు ఒకదానికి వొకటి

అనువుగానూ, అవసరంగానూ యేర్పాటయినప్పటికీ, సమాజ పరిస్థితులలో, భార్య భర్తమీద ఆధారపడివుండడం ముఖ్యమైన కారణాలవల్ల, పురుషుడు అహంకారికావడానికి అవకాశాలు ఉన్నవి. కాని, దాంపత్యంలో ఈ అహంకారం అంతగా తగదు అని చెప్పడానికికాబోలును మన పూర్వులు భార్యను 'అర్థాంగి' అనీ శివుడిశరీరంలో పార్వతిని, అర్థభాగంచేసి అర్థనారీశ్వర రూపాన్ని సృష్టించడంలో ఒక పెద్ద రహస్యాన్ని యిమిడ్చారు. శరీరంలోఅర్థభాగం భార్య అయిననాడు, ఒకభాగం అయినభర్త ఆనందపారవశ్యాన్ని అనుభవించవలెనంటే, రెండవభాగానికి కూడ ఆ ఆనందపారవశ్యాన్ని సమంగా లభించేటట్టు చేయక తప్పదు. అటు కానినాడు, తన ఆనందం పూర్తికానేరదు. ఒక కన్ను ఏడుపుతో నీరు కారుతూవుంటే, రెండవకన్ను చిరునవ్వుతూ ఆనందించ లేదుకదా !

ఏ యితర లౌకికవిషయాలలో యేవిధమైనభేదాలను కల్పించినా, కామసుఖాన్ని అనుభవించడంలోమాత్రం సగబాలుగా ఆనందాన్ని పంచుకున్ననాడే దాంపత్యం సుఖవంతమౌతుందని చెప్పడానికి అర్థనారీశ్వరత్వాన్ని చిత్రించడమేకాక, స్త్రీలోని మృదుత్వాన్ని సూచిస్తే, స్త్రీని 'కోమలి' అనీ, స్త్రీ శరీరం సుకుమారమైనదని చెప్పడానికి 'పూబోడి' – పువ్వువంటి శరీరం కలది – అనీ, అర్థయుక్తమైన

పదాలను సృష్టించారు. ఈ సంగతినే స్పష్టంచేస్తూ "కుసుమ సధర్మాణోహి యోషితః" అనగా, స్త్రీలు పువ్వులవలె సుకుమారమైనవారు, అన్నాడు వాత్స్యాయనుడు.

స్త్రీ శరీరంలోని సౌకుమార్యాన్ని గ్రహించగలిగిన పురుషుడు ధన్యుడు. సంగీత వాయిద్యాలలో వీణ చాలా సుకుమారమైనది.వీ ణను శ్రుతిచేసి మీటడం మహోన్నతమైన విద్య. వీణను మీటి అద్భుతగానాన్ని పలికించవలెనంటే, వైణికుడికి, చక్కని చతురతా, నిజమైన నిపుణతా, సరియైన సమర్థతా అవసరం.

స్త్రీ వీణవంటిది !

# క్షేత్రం

ఏ యంత్రాన్ని మనం ఉపయోగించవలెనన్నా, ఆ యంత్రనిర్మాణం యేమిటో, దాని నిర్వహణ యెట్లాంటిదో, దానిలో సున్నితమైన మరల యేర్పాటు యెలావున్నదో తెలుసుకుంటే, ఆ యంత్రాన్ని తెలివిగా నడపడానికీ, దానిని జాగరూకతతో వాడడానికీ, చిక్కు కలిగినప్పుడు దానిని సులువుగా సరిచేయడానికీ వీలుకలుగుతుంది.

మానవశరీరమంత క్లిష్టమైన యంత్రం సృష్టిలో మరొకటి కానరాదు. అందులో స్త్రీ శరీర నిర్మాణమూ, ఆమె అంతరింద్రియాల యేర్పాటూ మరీక్లిష్టం. వంశవృక్షాన్ని వృద్ధిపరచడంలో మొట్టమొదటి బాధ్యతా, భారమూ, స్త్రీ భరించవలసి వుండడంవల్లను యిది సహజం.

స్త్రీ రహస్య అవయవాల యేర్పాటు :

బొడ్డుకు సూటిగా పొత్తికడుపు కిందను, ఉబ్బెత్తుగా ముక్కోణాకారంగావుండి, తొడలసందులోనికి కిందికోణం దిగజారిపోయినట్టుగావున్న యింద్రియం కనబడుతుంది. దీనిని ఉపస్థు - Mons veneris - అంటారు. ఇది కేవలం కొవ్వుతో నిండివున్నభాగం. సరిగ్గా దీని అడుగున శమ్యశల్య - Symphisis - అనే చిన్నయెముక వుంటుంది.

శష్పశల్యాను ఉపస్థు కప్పివుంటుంది; అందువల్లను ఉపస్థుకు అడుగున ఘట్టి ఆధారంవున్నట్టు కనిపిస్తుంది. యౌవనానికి పూర్వమే ఉపస్థుమీదను రోమాంకురాలు ప్రారంభించుతవి. యుక్త వయస్సుకు, యిది రోమరాసితో నిండుతుంది.




1 ఉపస్థు 2 పై పెదవులు 3 భగలింగం 4 భగలింగం పైని చర్మం 5 లో పెదవులు 6 దోనె 7 మూత్రిక 8 స్కీన్ గ్రంథులు 9 భగద్వారం 10 కన్నెతెర 11 బార్థొలిన్ గ్రంథులు 12 మలద్వారం.

స్త్రీ నిలిచి వున్నప్పుడు ఉపస్థులోని యీ పైభాగమూ, దీని కిందికోణం తొడలసందులోనికి దిగజారినచోటను మధ్యగావున్న ఒకచీలిక మాత్రం కనబడుతూవుంటవి. స్త్రీ పడుకునివున్నప్పుడు గాని ఉపస్థు లోపలినిర్మాణం కనపడదు.

ఉపస్థు తొడలసందులోనికి దిగజారి చీలడంలో, తొడలమధ్యను చీలికకు రెండుపక్కలా రెండు మెత్తని కండరాలుగా యేర్పాటవుతుంది. తొడలసందున ఇరు పార్శ్వాలనూవున్న యీ కండరాలను పై పెదవులు - Labia Majora - అంటారు. పై పెదవుల మీదను కూడా కొంతవరకూ రోమాలు ఉంటవి. పై పెదవులను విడదీసి చీలికలోపలికి చూస్తేగాని మిగతా ఉపస్థు నిర్మాణం సరిగా కనపడదు.

పై పెదవుల్ని విడదీయగానే, చీలిక పై భాగంలో, చిన్నశిఖరంవలె పైకి చొరుచుకునివున్న మాంసకండరం వొకటికనిపిస్తుంది. దీనిని భగలింగం - Clitoris - అంటారు. పురుషుడి లింగానికీ దీనికీ చాలాపోలికలు వున్నవి. పురుషుడి లింగానికి యెదరను గుండుగావుండే మణివలెనే, భగలింగం ముఖం కూడా మణివంటి యేర్పాటును కలిగివుంటుంది; మణిని కప్పివుండే చర్మంవలెనే, దీనిని లోపెదవులపొర కప్పివుంటుంది. మణి పైచర్మంవలె, భగలింగాన్ని కప్పివున్న చర్మం కూడా, కదిలి కొంతవరకూ వెనకకుతొలగగలదు. లింగం మణి మీదనువలెనే, దీని మణిమీదను కూడా, దుర్గంధంగల పాసు

పొరవలె యేర్పాటౌతూవుంటుంది. పురుష అవయవంవలెనే, భగలింగం రాగకాలంలో లేపనాన్ని పొంది, అసలు స్వరూపానికి ఒకటిన్నర రెట్లు పెరిగి, నిలవగలదు. సున్నితమైన నరాల చివరలు భగలింగంలో కూడివుండడంవల్లను, యిది స్పర్శకు సులువుగా స్పందించి, స్త్రీకి ఉద్రేకాన్నీ సుఖాన్నీ కలిగిస్తుంది.

భగలింగం నుంచి ప్రారంభించి, రెండువైపులకూ, దిగజారుతూ లేతయెరుపురంగుగలిగి ముక్కోణాకారంగావున్న రెండు మెత్తని కండరాలు కుడియెడమ భాగాలను పై పెదవులను ఆనుకుని వుంటవి. వీటిని లోపెదవులు -Labia Minora- అంటారు. లోపెదవులమెత్తనికండరాలలో నరాలచివరలు వుండడంవల్లను, రాగకాలంలో యివి ద్రవించి సులభంగా స్పర్శసుఖాన్ని కల్పించగలవు. కన్యదశలో యీ లోపెదవులూ, పైపెదవుల అంచులూ విడదీసిచూస్తేనే కాని కనిపించవు. కాని, ఒకటి రెండు ప్రసవాలు అయిన తరువాతనూ, బాగా వయసుమీరిన తరువాతనూ, యివి వెల్లడిగా కనపడడమేకాక, మృదుత్వం తగ్గి, యీ కండరాలు యెండినట్టుగా కనుపించుతవి.

పై పెదవుల లోపలి అంచులూ, లోపెదవుల లోపలి అంచులూ కొంతదూరంలో కలిసిపోయి, మరికొంతదూరం కిందకు వలయాకారంగా దిగజారి, అక్కడ - మలద్వారానికి కొంచెంపైన - మామూలు చర్మంతో కలిసిపోతవి. భగలింగం కిందనుంచి, యీ రెండు పెదవులూ

చర్మంలో కలిసిపోయేవరకూ వలయంగా యేర్పాటైన దానిని దోనె అనీ, లోయ అనీ - Vestibule - అంటారు. ఈ దోనెలో ఒకదానికిందను వొకటిగా, రెండు రంధ్రాలు కనుపించుతవి.

ఈ రెండు రంధ్రాలలోనూ పై భాగంలో కనీకనబడని చిన్న చీలికవలెవున్న రంధ్రాన్ని మూత్రిక అనీ, మూత్రద్వారం అనీ - Urethra - అంటారు. మూత్రం దీనిద్వారా బహిర్గతమౌతుంది. ఈ మూత్రికచుట్టూ సన్నని కండరం వొకటి కనీకనిపించని గట్టువలె వుంటుంది. ఈ గట్టు యిరుపక్కలా సూక్ష్మమైన గ్రంధులు రెండు వుంటవి; వీటిని మూత్రిక ఉపగ్రంధులు - Para-urethra ducts - అంటారు. ఈ చిన్నగ్రంధులకు ఏ ప్రయోజనంవున్నా వుండకపోయినా, సెగ తగిలినప్పుడు మూత్రాన్ని నిరోధించడానికి - Gonorrhea urethrits - యివి కారణాలు అవుతవి.

మూత్రికకు కొద్దిగా కిందను కనీకనిపించని రెండు చిన్న రంధ్రాలువుంటవి. వీటిని స్కీన్ గ్రంధులు - Skeen's Glands - అంటారు. స్త్రీకి కామోద్రేకం కలిగినప్పుడు, వీటినుంచి జిగటద్రవం ప్రవహిస్తుంది.

మూత్రద్వారానికి సరిగా కిందను లోపలికి దారి చూపుతూవున్న మరొక పెద్దరంధ్రం వుంటుంది. ఇది కంటికి విశదంగా కనిపిస్తుంది. దీనిని భగద్వారం అనీ, యోని ముఖం అనీ, - Vaginal Orifice - అంటారు.

ఈ ద్వారంనుంచి ప్రారంభించి శరీరం లోపలికి లోతుగా పోతుంది రంధ్రం.

భగద్వారం కిందను కొద్ది దూరంలో, పై పెదవుల అంచులు కలుసుకుని, చర్మంతో లీనమై పోవడంవల్లను ఇంతతో దోనె ఆగిపోతుంది. దోనె ఆగిపోయిన తావుకు కొద్దిగా కిందను మలద్వారం వుంటుంది.




1 పైపెదవి 2 మూత్రిక 3 భగద్వారం 4 బార్థోలిన్ గ్రంథి
5 భగలింగం 6 కన్యాకల్య 7 మూత్రకోశం 8 మూత్రనాళం
9 యోని 10 గర్భకంఠం 11 గర్భకోశం 12 శోణితనాళం
13 చలన అంగుళాలు 14 శోణకోశం

స్త్రీ రహస్య అవయవాలలో పైభాగానికి సంబంధించి, కంటికి కనబడే భాగాలు కాక, వీటికి సంబంధించి కంటికి కనబడకుండా లోపలను యిమిడివున్న అవయవాలను గురించి కూడా తెలుసుకోడం చాలా అవసరం.

భగద్వారాన్ని దాటగానే, కొద్దిదూరంలో, కన్నెతెర ముందరను, కుడి యెడమ భాగాలను రెండువేపులా, రెండు చిన్నగ్రంథులు వున్నవి. వీటిని బార్థొలిన్ గ్రంథులు -Bartholin's glands- అంటారు. కామోద్రేకం కలిగినప్పుడు యీ బార్థొలిన్ గ్రంథులనుంచి జిగటద్రవం స్రవించి, యోనిని తడిచేసి, రతికి సుఖువు యేర్పడేటట్టు చేస్తుంది.

ఈ గ్రంథులకు కొద్దిదూరంలో, భగరంధ్రాన్ని చాలావరకూ మూసివేస్తూవున్న బిగువైన తెరవొకటి, రజస్వలకాని కన్యల యోనిలో విశదంగా కనిపిస్తుంది. దీనిని కన్నెతెర - Hymen - అంటారు. ఒకదానిని వొకటి అంటుకునివున్న రేకలుగల పువ్వువలె ఆకారంకలిగి వుంటుంది, కన్నెతెర. కన్యగావున్న కాలంలోకూడ యీ తెర మధ్యను చిటికెనవేలు దూరేటంతటి కన్నం వుంటుంది. అరుదుగా, కొందరిలో, ఒకేరంధ్రానికి బదులు, అనేక చిన్న రంధ్రాలు వుండడంకూడా కద్దు. ఒకేరంధ్రం వున్నవారిలో, ఆ రంధ్రం మధ్యలోవున్నట్టయితే, కన్నెతెర వలయాకారంగానూ; ఈ రంధ్రం పైభాగంలో వున్నట్టయితే, కన్నెతెర

అర్ధచంద్రాకారంగానూ కనిపిస్తుంది. ప్రథమసమావేశంలో, పురుషఅవయవం యోనిలోపలికి చొరుచుకుని వెళ్ళినప్పుడు, కన్నెతెర చాలావరకూ చిరిగిపోతుంది; లేదా, దారినిచ్చి వొదులుగా విడివడుతుంది. కన్నెతెర అభ్యంతరంగా వుండడమూ, అది చిరిగివుండడమూ బట్టి, బాలిక కన్యగావున్నదీలేనిదీ నిర్ణయించడం పొరబాటు; కొందరు కన్యలలో యిది తనంతటను తానే విడివడడంకూడా తటస్థించవొచ్చును. మొదటి ప్రసవంలో కన్నెతెర పూర్తిగా చిరిగిపోయి, కనీకనబడని ముక్కలుగా పక్కలను వేలాడుతూవుంటుంది.

భగద్వారంనుంచి లోపలకు దిగజారివుండే రంధ్రాన్ని, భగమనీ, యోని అనీ, రేతోవాహిని అనీ – Vagina – అంటారు. దీని లోతు, సాధారణంగా మూడున్నర అంగుళాలు ఉంటుంది; కాని, వ్యక్తులనుబట్టీ జాతులను బట్టీ హెచ్చుతగ్గులుకూడా ఉండవచ్చును. యోని, మూత్రికకు కిందుగాఉన్న ద్వారంతో ప్రారంభించి, శరీరంలోపలికి ఏటవాలుగా దిగజారి, గర్భకంఠం కిందకు వొంగి, దానికి కొంచెం వెనకను ఆగిపోతుంది. కన్నెగాఉన్నప్పుడుకన్న, రజస్వలానంతరం యోని లోపలిభాగం విపులం అవుతుంది; కొందరిలో యీ మార్పు కలగకుండా, ద్వారంనుంచి అంతంవరకూ ఒకేవిధంగా ఉండడమూ, కొందరిలో ద్వారం బిగుతుగాఉండి లోపల వొదులుగా ఉండడమూ కద్దు. యోని, మృదువైన పొరలతో కూడివుండడంవల్లను యెంతటి వొత్తిడికైనా తావిచ్చి, వెడల్పు కాగలదు. ఈ పొరలకు స్పర్శజ్ఞానం లేదు; కాని రతిలో వీటి

నుంచి ద్రవం ఊరుతుంది. తమ మధ్యను విసర్జన అయిన ద్రవాన్ని యివి జీర్ణించుకోగలవుకూడా. సంయోగాలతో కొంత కొంత వొదులు అవుతూ, పిల్లలు పుట్టినకొలదీ విపులం అవుతూ, కొన్ని కాన్పులు అయి వయసు మీారేనాటికి, భగ ద్వారం బాగా తెరుచుకుని ఉండి, లోపలిభాగం కనబడుతూ ఉంటుంది.

యోని చివరిభాగం కిందకు వొంగి ఆగిపోయినచోటను, ఆ వొంగిన భాగానికి పైనను గర్భ కంఠం - Cervix - ఉంటుంది. గర్భకోశం కిందిభాగాన్ని గర్భ కంఠం అంటారు. గర్భకంఠంలో చిన్నిచిన్ని గ్రంథులు అనేకం ఉండడం వల్లను, యీా గ్రంథులనుంచి ఒకవిధమైన ద్రవం స్రవిస్తూ ఉంటుంది. గర్భకంఠం చాలా సున్నితమైనది కావడం వల్లను స్పర్శకు సులభంగా స్పందిస్తుంది. అందుచేతనే పురుష అవయవం ఇంతవరకూ అంది, సురతంలో, మరి దీనిని బాగా తాకగలిగిననాడు, స్త్రీ, పారవశ్యాన్ని పొందుతుంది. గర్భ కంఠం మధ్యనుఉన్న చిన్న రంధ్రం గర్భకోశానికి దారిగా ఏర్పాటయివున్నది. అందుచేత, సురతంలో పురుషఅవయవం నుంచి విసురుగాపడే శుక్లం, దీని రంధ్రసమీాపంలో పడి, శుక్లాణువులు యీా రంధ్రం గుండా గర్భకోశంలోనికి యీాదు కుని పోగలిగితే, గర్భం కలిగే అవకాశం ఏర్పాటవుతుంది.

గర్భకంఠం కిందికోణంగా, యోని తుదినుంచి పైకివ్యాపించి, ముక్కోణాకారంగావున్న కండరాల తిత్తిని గర్భకోశం - Uterus- అంటారు. ఇది, మూాడు అంగు

శాల పొడుగూ, రెండు అంగుళాల వెడల్పూ, ఒక అంగుళం మందమూ కలిగి, మధ్యభాగం ఖాళీగావుంటుంది. గర్భకోశం పైభాగం కటిప్రదేశం యెముకలనుదాటి కొంచెంపైకి వ్యాపించి వుంటుంది; దీని యెదరిభాగం మూత్రకోశాన్ని ఆనుకుని వుంటుంది. తొమ్మిదిమాసాలవరకూ పెరిగిన శిశువును భరించడానికి తగినంతగా సాగవలసిన అవసరం వుండడంవల్లను, గర్భకోశం చాలా బలమైన కండరాలు కలిగివున్నది. గుండెకాయా, గర్భకోశమూ, వీటి కండరాలకువున్నంతటి బలమూ, శక్తీ, మానవశరీరంలో మరి ఏ కండరాలకూ లేదు. కాని, బాలికకు పద్దెనిమిదిసంవత్సరాల వయసు దాటేవరకూ గర్భకోశకండరాలు పూర్తిబలాన్ని పొందవు; ఆవయస్సునాటికిగాని గర్భకోశం నిండుశక్తిని కలిగి గర్భధారణకు సిద్ధంకాదు.




1 శోణకోశం 2 శోణితనాళాలు 3 గర్భకోశం 4 గర్భకంఠం 5 యోని

గర్భకోశం యోనిలోనికి దిగజారినకోణం కాక – దీనినే గర్భకంఠం అన్నారు. – పైభాగం

లోని రెండు కోణాలనుంచీ రెండు గొట్టాలు బయలుదేరి, కుడి యెడమ భాగాలకు, రెండువైపులా ప్రసరించివుంటవి. వీటిని శోణితనాళాలు - Fallopian tubes - అంటారు. ఈ నాళాలు ఒక్కొక్కటీ మూడున్నర అంగుళాలదూరం వ్యాపించి, అక్కడ చేతివేళ్ల ఆకారంగా విడిపోతవి. చేతివేళ్లను పోలివుండడం వల్లను వీటిని, చలనఅంగుళాలు - Waving fingers - అంటారు. చలన అంగుళాలు అనడంలో అర్థంవున్నది: చేతివేళ్లవలె యివి కదలిక కలిగి, శోణకోశంనుంచి బైటపడిన శోణితఅణువు తమ అందు బాటులోనికి రాగానే, దానిని గ్రహించి, తమనాళంలో ప్రవే శింపజేసి, దానిని గర్భకోశంలోనికి దిగజారేటట్టు చేస్తవి.

శోణితనాళాలు వేళ్లుగా విడిన తావునకు కొంచం కిందుగా, గర్భకోశానికి కుడి యెడమ భాగా లను, కొద్ది దూరంలో చిన్నకోశాలు ఉన్నవి. వీటిని శోణ కోశాలు - Ovaries - అంటారు. ఇవి బాదంకాయ ఆకారంగా ఉండి, ఒక్కొక్కటీ అంగుళం ముప్పాతికకు కొంచెం యెక్కు వగా పొడుగూ, అంగుళం వెడల్పూ, అంగుళానికి కొంచెం యెక్కువగా మందమూ ఉండి, కొంచైె ధాన్యపుగింజల బరువు మాత్రం ఉంటవి. ఈ చిన్నకోశాలు రెండింటిలోనూ ప్రకృతి పెద్ద రహస్యాన్ని దాచి ఉంచింది. బాలిక పుట్టేనాటికే యీ రెండు కోశాలలోనూ మొత్తం ముప్పైవేల శోణితఅణువులు

ఉంటవి. రజస్వలకావడం మొదలు, ఈ కోశాలలోని శోణిత అణువు ఒక్కొక్కటీ, ఇరవై యెనిమిది రోజులకు ఒకటిచొప్పున బయటకు వొచ్చి, స్త్రీని మాతృత్వానికి సిద్ధంచేస్తూ ఉంటవి.

స్త్రీలోని రహస్య అవయవాల యేర్పాటును బట్టీ, వాటి కార్యక్రమాన్నిబట్టీ, యోచిస్తే, స్త్రీని, పొలంతో పోల్చ వొచ్చుననిపించక తప్పదు. బీజం తనలో నిక్షిప్తమైనది మొదలు, దానిని కాపాడి, పెంచి, అది నిండు జీవాన్ని తాల్చేటట్టు చేయడం స్త్రీకార్యం. అందుచేతనే మనపూర్వులు స్త్రీని 'క్షేత్రం' అన్నారు.

# బీజం

నిగూఢమైన ప్రకృతి రహస్యాలను గురించి తెలుసుకుంటే, సూక్ష్మాతిసూక్ష్మమైన నిర్మాణాలలో, యెంత తెలివైన విధానం వున్నదా అని ఆశ్చర్యం కలగక మానదు. స్త్రీ - పురుష ప్రకృతులూ, రహస్య అవయవాల నిర్మాణమూ ఒకదానికి వొకటి భిన్నంగావున్నట్టు కనబడుతూ వున్నప్పటికీ, యీ రెండూ ఒకదానికివొకటి జత అయ్యేటట్టుగా, అనుకూలంగానూ, అనువుగానూ యేర్పాటయినవని అవగాహన అవుతుంది.

స్త్రీ శరీరంలోవలెనే, పురుష శరీరంలోకూడా, రహస్యఅవయవాలు, అదేప్రదేశంలో, పొత్తికడుపుకిందనుంచి, తొడల సందులోనికి దిగజారినట్టు వుంటవి. స్త్రీకి ఉపస్థ పైభాగం యేర్పాటైనచోటను, పురుషుడికికూడ కొవ్వుతోకూడిన మెత్తని ప్రదేశం ఉంటుంది. ఈ ప్రదేశానికి సరిగ్గాకిందను శష్పశల్య -Symphisis- అనే యెముక వుంటుంది. బాలుడుకి పధ్నాలుగుసంవత్సరాల వయస్సునాటికి, యీ మెత్తనిప్రదేశంపైన రోమాలు పెరుగుతవి. ఈ ప్రదేశం తొడల సందుకు దిగజారేచోటనుంచి, ఒక పొడుగుపాటి గుండ్రని అవయవమూ, దాని వెనకను, రెండు గచ్చకాయలవంటి బంతులూ కలిసి ఒక గుత్తిగా వేలాడుతూవుంటవి.

ఈ గుత్తి పైభాగంలోనుంచి గుండ్రంగా, పొడగుగా, వేలాడే అవయవాన్ని లింగం -Penis- అంటారు. ఇది కేవలం మాంసకండరాలతో కూడిన మెత్తని అవయవం. ఇది సామాన్యస్థితిలో మెత్తగా వేలాడుతూ, సాధారణంగా నాలుగు అంగుళాల పొడుగువుంటుంది. రాగ కాలంలో, లేపనం కలిగినప్పుడు, స్థబ్దతనుపొంది, నిలిచి ఆరు అంగుళాల పరిమితిని పొందుతుంది.




1 మూత్రద్వారం 2 మణి 3 మణికట్టు 4 ఘనకండరం 5 మృదుకండరం 6 కూపర్ గ్రంథులు 7 మూత్రకోశం

లింగం పైభాగాన్ని కప్పివున్న చర్మం పల్చగావుండి కొద్దిగా కదలిక కలిగివుంటుంది. ఈచర్మం కిందనువున్న మాంసకండరాన్ని ఘనకండరం - Corpus cavernosium - అంటారు. ఈ ఘనకండరానికి లోపలను మరొక మాంసకండరంవుంటుంది; ఈ లోపలికండరాన్ని మృదు కండరం - Corpus spongiosum - అంటారు. మృదుకండ రంలో అరలవలె చాలా ఖాళీప్రదేశాలు వుంటవి. రాగకా లంలో ఈఖాళీ అరలలో రక్తం నిండుతుంది. మృదుకండరాలలో అంతగా కాకపోయినా, ఘనకండరాలలో కూడా ఖాళీలువున్న అరలు వుంటవి. రాగకాలంలో, లింగంలోనికి రక్తం జోరుగా ప్రవహించి, మృదుకండరంలోనూ, ఘనకండరంలోనూవున్న అరలలో నిండుతుంది; అందువల్లను అవయవం స్తబ్ధతను పొంది, పెద్దదై నిలవగలుగుతుంది. ఈ విధంగా నిలవడాన్ని 'లేపనం' అంటారు. చుట్టూవున్న మృదుకండరానికి మధ్యలో, లింగం నిలువునా ఖాళీప్రదేశం వుంటుంది; మూత్రమూ, శుక్లమూ కూడా, దీనిద్వారా ప్రవహించి బహిర్గతమౌతవి; - స్త్రీకి మూత్రవిసర్జన దోనెమధ్యలోవున్న రంధ్రంద్వారా జరుగు తుంది; తతిమ్మాపనులు యోనిద్వారా జరుగుతవి - ఈ భేదం గమనించదగినది. వ్యక్తులనుబట్టీ, జాతులనుబట్టీ, లింగం, పొట్టిపొడుగులలో హెచ్చుతగ్గులు వుంటవి.

లింగం చివరిభాగంలో గుండు వలెవుండి, దాని పైచర్మాన్ని వెనకకు నెట్టినప్పుడు, యెర్రగా, వచ్చిపోకకాయ అంతగా, పోకకాయ ఆకారంగా ఉన్న భాగాన్ని, మణి అనీ, పోక అనీ -Glans penis- అంటారు. ఈ మణి యెదరను - ముఖభాగంలో - చిన్న చీలికవలె రంధ్రం వుంటుంది; దీనిని మూత్రిక అనీ, మూత్రద్వారం అనీ - Maetus - అంటారు. మణిభాగాన్నిమాత్రం కప్పివున్న చర్మాన్ని మణిచర్మం - Prepuce - అంటారు. ఒక యీానె, మణి కిందిభాగాన్నీ, అక్కడి మణిచర్మాన్నీ బంధించివుంటుంది. అందువల్లను మణిచర్మాన్ని వెనకకు నెట్టినప్పుడు, మణిమీాద నుంచి చర్మం దొర్లి మణిగట్టునుదాటి కొంతదూరం లింగం మీాదకు విడుతుంది. ఈ విధంగా మణిచర్మాన్ని వెనకకు నెట్టి నప్పుడు, కిందనువున్న యీానె పట్టువల్లను, మణి కొంచెం కిందకు వొంగినట్టు అవుతుంది. జాడ్యాలకు సంబంధించిన క్రిములు ఈ యీానె పక్కభాగాలలో అంటుకోడంజరుగుతుంది. సాధార ణంగా పోకకాయవలెనే, మణికూడ, యెదర భాగంనుంచి వెనకకుపోయినకొద్దీ యెత్తుఅవుతూ, వెనకభాగంలో గట్టువలె యేర్పాటై, అక్కడ వెనకకు వొంగి దిగజారి, లింగం మిగతా భాగంతో కలిసిపోతుంది. ఈ విధంగా యేర్పాటైన గట్టును - మణిగట్టు - Corona - అంటారు. మణిని కప్పివుండేచర్మం రెండు పొరలుగా వుంటుంది. లోపలిపొర, మణిగట్టు లోతులో నుంచి ప్రారంభమై, మణిని కప్పుకునివొచ్చి, లింగంపై చర్మంతో కలిసిపోతుంది. ఇందువల్లను, వెనకకు లాగినప్పుడు, మణిచర్మం

మణిగట్టునుకూడ దాటి, వెనకకు సాగుతుంది. మణిచర్మం లోపలిపొర, చాలా సున్నితంగానూ చాలా మృదువుగానూ వుండి, దీనిపై వల్చనిపొరవలె దుర్గంధంగల పాసు -Smegma- కప్పతూవుంటుంది. దీనిని రోజూ శుభ్రపరచడం చాలాఅవసరం. మణిచర్మంలో నరాలకొసలు ఉండడంవల్లను, ఈ చర్మం లోని చివరిభాగం స్పర్శసుఖాన్ని అమితంగా కలిగించి, యీ వార్తను వెంటనే మెదడుకు తెలియబరుస్తుంది. మణిచర్మమంత సున్నితం కాకపోయినా, మణికూడా స్పర్శసుఖాన్ని బాగా కలి గిస్తుంది. మణిగట్టువున్న భాగంకన్న, మణి యెదరిభాగం యెక్కువ నిశితంగా వుండి స్పర్శకు స్పందిస్తుంది. స్త్రీ భగలింగానికీ, పురుషుడి లింగానికీ పోలికలువున్నవని గుర్తించదగును.

లింగం మొదలులో, దాని వెనకను కిందిభాగంలో, గుత్తిగా, గచ్చకాయలవంటి రెండు గుండ్రని అవయవాలు వేలాడుతూవుంటవి. లోపల గచ్చకాయలవలె వున్న బీజాలను చర్మం కప్పివుంటుంది. ఈ చర్మానికీ బీజాలకూ మధ్యను, కొంచెం ఖాళీ వుండడం వల్లను, లోపలి బీజాలు కదలడానికి వీలు యేర్పాటయినది. లోపలిబీజాలు వేరువేరుగా వున్నా, వీటిని రెండింటినీ కప్పిన చర్మం మధ్యభాగంలో కుట్టినట్టువుండి, రెండు బీజాలూ ఒకేసంచిలో వున్నట్టు కనిపిస్తుంది. ఈ కుట్టు, లింగం అడుగు భాగంనుంచి మలద్వారం వరకూ వ్యాపించివుంటుంది. ఈ రెండు అవయవాలనీ వృషణాలు - Testes - అంటారు. వయసువొచ్చిన ప్రతి పురుషుడి వృషణమూ ఒక్కొక్కటీ, సాధారణంగా, అంగుళంనర పొడుగూ,

అంగుళం వెడల్పూ, అంగుళం మందమూ కలిగి; ఒక్కొక్కటీ ఒక ఔన్సు బరువు కలిగివుంటుంది. రెండు వృషణాలలోనూ యెడమవైపుది కొద్దిగా కిందకు దిగజారివుంటుంది.




1 సూక్ష్మనాళాలు 2 ఎపిడిడిమిస్ 3 శుక్లనాళం

స్త్రీ శోణకోశాలలోవలె, పురుషుడిలో యీ చిన్నబీజాలలో, సృష్టి, తన ప్రధానయంత్రశాలను నిర్మించుకున్నది. ఈ బీజాల నిర్మాణం చాలా విచిత్రం! ఈ బీజాలలో ఒక్కొక్కదానిలోనూ యెనిమిదేసివందల చొప్పున అతిసూక్ష్మనాళాలు చుట్టలు చుట్టలుగా యేర్పాటై ఉంటవి. ఈ నాళాలను ఒకదాని వెనక వొకటిగా వరసగా

పెట్టి కొలిచినట్టయితే, వీటి మొత్తం పొడుగు, మూడు వేల అడుగులు ఉంటుంది. ఈ గొట్టాల లోపలను ఉన్న ఖాళీ, తల వెంట్రుక దూరేటంత మాత్రమే ఉంటుంది. ఈ ఖాళీలో తయారవుతుంది, శుక్లబీజఅణువు. ఈ సూక్ష్మనాళాలలో వున్న శుక్ల అణువులు, తయారీలో అనేక తరగతులలో వుంటవి. వీటి తయారీ పూర్తికాగానే, యీ నాళాలను వొదిలి 'ఎపిడిడిమిస్' నాళాలలో చేరి, యీ శుక్లఅణువులు అక్కడ నిలవవుంటవి. కెరటాల కదలికతో సముద్రంవలె వృషణాల లోని బీజాలు రెండూ యెల్లప్పుడూ లోలోపల కదులుతూ, ఒక్కొక్కప్పుడు కిందికి దిగజారుతూ, మళ్లీ పైకి జరుగుతూ నిరంతరభ్రమణంలో వుంటవి. ఈ నిరంతరభ్రమణంలో ఈ విచిత్రయంత్రశాలలో యే కార్యం యెలా జరుగుతుందో కాని, మానవజాతి నిశ్శేషం కాకుండావుండే భద్రత యిక్కడను యిమిడి వున్నది. ఈ సందర్భంలో స్త్రీ - పురుష ప్రకృతులలోవున్న భేదాన్ని గుర్తించాలి: బాలిక శోణకోశాలలో శోణిత అణువులమొత్తమంతా ఆమె పుట్టిననాడే ఆ కోశాలలో వుంటుంది. బాలుడిస్థితి అలాకాదు; బాలుడికి పధ్నాలుగు సంవత్సరాల వయస్సు దాటేవరకూ అతని బీజాలలో శుక్లజీవఅణువులు ఉండవు.

వృషణంలో గచ్చకాయవలె వున్న బీజాన్ని వెనకభాగంలో అంటిపెట్టుకుని, బీజం పైభాగం నుంచి దాని కిందిభాగం వరకూ వ్యాపించి, ముడతలు ముడతలుగా వున్న నాళాలతో కూడివున్న దానిని, ఎపిడిడిమిస్

- Epididymis- అంటారు. ఏ బీజంలో తయారైన శుక్ల అణువులు, దానికి చెందిన ఎపిడిడిమిస్ లో నిలవ ఉంటవి. బీజాలలోని సూక్ష్మనాళాలు ఎపిడిడిమిస్‌లోని నాళాలతో కలియడంవల్లనూ, ఎపిడిడిమిస్ బీజాన్ని అంటిపెట్టుకుని వుండడం వల్లనూ, దీనిని బీజంలోని భాగంగా యెంచవలెను.




1 పైచర్మంతో కూడివున్న వృషణం 2 వృషణంలోని బీజం 3 ఎపిడిడిమిస్ 4 శుక్లనాళం 5 శవ్యశల్య 6 శుక్లనాళం వెడల్పు అయినభాగం 7 శుక్లకోశం 8 ప్రోస్టేట్ గ్రంథి 9 మూత్రకోశం 10 కూపర్ గ్రంథి 11 స్ఖలనకండరం 12 మూత్రనాళం 13 మృదుకండరం 14 ఘనకండరం 15 మణికట్టు 16 మణి 17 మణిచర్మం 18 మూత్రిక

ఎపిడిడిమిస్‌నుంచి అందుకుని, దాని పక్కనుంచి పైకి యెగబాకి, పొత్తికడుపులోనికి ఊర్ధ్వ ముఖంగా ప్రవహించిపోయే గొట్టాన్ని, శుక్లనాళం -Vas deferens- అంటారు. ఈ శుక్లనాళం, ఎపిడిడిమిస్‌నుంచి అందుకుని, బీజం వెనకభాగంనుంచి యెగబాకి, ఊర్ధ్వముఖంగా పొత్తికడుపులోనికి ప్రసరించి, శష్పశల్య యెదరనుంచి పైకి వెళ్ళి, శష్పశల్య పైభాగంనుంచి శరీరంలోపలికి తిరిగి, మూత్రకోశం పక్కనుంచి పోయి, మూత్రకోశం వెనకను వొంగి, అక్కడినుంచి అధోముఖంగా దిగుతుంది. ఇక్కడ, శుక్లనాళం రెండు అంగుళాల దూరంవరకూ-యించుమించు అరఅంగుళం, - వెడల్పు అయి, మళ్లీ అక్కడనుంచి మామూలుదళాన్ని పొందుతుంది. బీజంనుంచి వెలువడి, యింతవరకూ వొచ్చిన శుక్లఅణువులు, యీ వెడల్పు అయిన భాగంలో నిలవవుంటవి - ప్రతీ స్ఖలనంలోనూ బయటపడే శుక్లఅణువులు బీజంనుంచి బయలుదేరిరావు, అవి యీ శుక్లనాళభాగంనుంచి బయటపడుతవి. శుక్లనాళం యీవిధంగా వెడల్పుఅయిన తావుకు కొద్ది దూరంలో ప్రోస్టేట్‌గ్రంథి వున్నది. ప్రోస్టేట్‌గ్రంథిలో శుక్లనాళం చేరేలోపుగా, దీనిలో మరొకనాళం కలుస్తుంది. ఈనాళం శుక్లకోశంనుంచి వెలువడి వొస్తుంది.

శుక్లకోశం - Seminal vesicle - ప్రోస్టేట్‌గ్రంథికి కొంచెం పైభాగంలో వుంటుంది. ఇది రెండు అంగుళాల పొడుగూ, అంగుళంకన్నా తక్కువ వెడల్పూ, అంగుళంలో పాతికవొంతు మందమూ కలిగివుంటుంది. దీనిలో

శుక్లద్రవం తయారవుతుంది. ఈ ద్రవం లేతపసుపురంగు కలిగి, జిగటగావుంటుంది. ఈ శుక్లకోశంలో శుక్లఅణువులు వుండవు. దీనినుంచి ప్రవహించిన ద్రవం శుక్లనాళంలో పడుతుంది.

ఈ మజిలీ దాటగానే, శుక్ల నాళం ప్రోస్టేట్ గ్రంథిలో ప్రవేశిస్తుంది. ఇది ప్రోస్టేట్ గ్రంథిలో ప్రవేశించి కొద్దిదూరం వెళ్ళగానే, అక్కడ, ఒక కూడలి యేర్పాటవుతుంది : ప్రోస్టేట్ గ్రంథికి పై భాగంలోవున్న మూత్రకోశంనుంచి దిగజారివొచ్చి, ప్రోస్టేట్ గ్రంథిలోనికి ప్రవేశించన మూత్రనాళమూ, రెండవభాగంనుంచి వొచ్చిన శుక్ల నాళమూ, ఈ మూడు నాళాలూ యిక్కడ ఏకమౌతవి. రెండు వైపులనుంచీ వొచ్చిన శుక్లనాళాలనుంచి వెలువడే శుక్లమైనా, మూత్రకోశంనుంచి వొచ్చే మూత్రమైనా, యీ కూడలిద్వారా ప్రవహించాలి. కూడలిలో మూడింట యేకత్వంతో యేర్పాటయిన యీ నాళం, మరికొంతదూరం ప్రోస్టేట్ గ్రంథిలోనుంచి ప్రసరించి, ప్రోస్టేట్ గ్రంథినుంచి వెలువడి, లింగంలో ప్రవేశిస్తుంది.

ప్రోస్టేట్ గ్రంథి – Prostate gland – ముప్ఫై చిన్నగ్రంథుల కూడికతో యేర్పాటైన ముఖ్య గ్రంథి. ఇది ముక్కోణాకారంగా, అంగుళం పొడుగూ, అంగుళంనర వెడల్పూ, ముప్పాతికఅంగుళం మందమూ వుంటుంది. ఇది మూత్రకోశానికి కొంచం కిందగా ప్రారంభమై లింగం మొదలుదగ్గరవరకూ వ్యాపించి వుంటుంది. ఈ గ్రంథి

నుంచి స్రవించే జిగటద్రవం శుక్లంలో కలుస్తుంది. శుక్ల అణువులు సులభంగా కదిలి యీదుకుపోడానికి యీ ద్రవం చాలా అవసరం; ఈ ద్రవం లేకపోతే శుక్ల అణువులు కదలలేవు.

రెండువైపులనుంచీ వొచ్చిన శుక్లనాళాలు కూడలిలో, మూత్రనాళంతో కలిసిన తావునుంచి యీ నాళాన్ని మూత్రనాళం - Urethra - అంటారు. ఈ నాళం, ప్రోస్టేట్‌గ్రంథి నుంచి బైటకు వొచ్చి, లింగం మొదటలో ప్రవేశిస్తుంది. లింగంలో ప్రవేశించిన తావులో యీ నాళం కొద్ది దూరంవరకూ విపులం అయి, ఆ తరువాతను మళ్ళీ సన్నబడుతుంది.

ఈ విపులం అయిన భాగానికి సరిగ్గా కిందను స్ఖలనకండరం - Musculus Bulbocavernosus - వుంటుంది. స్ఖలనకండరం నొక్కులవల్లనూ, నాళం విపులం అయిన భాగంనుంచి మళ్ళీ సన్నబడినభాగం లోనికి రావలసి వుండడంవల్లనూ, శుక్లం చిమ్మిన గొట్టంనుంచి నీరువలె విసురుగా బైటపడుతుంది. స్ఖలనకండరం చాలా ముఖ్యమైనది. రతి, ఉద్రేకశిఖరాన్ని అందినప్పుడు, దీని కొట్లాటవల్లను శుక్లం విసురుగా బైటపడుతుంది. ఈయత్నంలో యీ కండరంలో కలిగే పోటూ - పాటులు, పరవశత్వాన్ని కల్పించుతవి. ఈ పోటూ - పాటులు కలుగుతూవున్నప్పుడు, లింగం మొదలులో కిందిభాగంలో వేలువుంచి చూస్తే, దీనికొట్లాట స్పర్శకు తెలుస్తుంది.

స్ఖలనకండరం వెనకభాగంలో, దానిని ఆనుకుని, యిరుపక్కలా, బఠాణీగింజలంత పరిమాణం గల గ్రంథులు రెండు వున్నవి. వీటిని కూపర్ గ్రంథులు _Cowper's glands_ అంటారు. కామవాంఛ కలిగినప్పుడూ, రాగకాలంలోనూ, యీ గ్రంథులనుంచి జిగటద్రవం వూరుతుంది. మూత్రనాళం విపులం అయి సన్నబడేభాగంలో, కూపర్ గ్రంథులనుంచి వెలువడిననాళాలు, ఆ నాళంతో కలియుడంవల్లను, యీ జిగటద్రవం మూత్రనాళంగుండా ప్రవహించి బైటపడుతుంది; ఈ జిగటద్రవం మణిని తడిచేసి, సురతంలో అవయవం కదలికకు సుళువును కల్పిస్తుంది. స్త్రీలోని బార్థొలిన్ గ్రంథులవంటివే, ఈ కూపర్ గ్రంథులు.

కూడలినుంచి మణిచివరనువున్న మూత్రద్వారంవరకూవున్న నాళాన్ని మూత్రనాళం_Urethra_ అంటారు. వివిధమజిలీలలో వివిధనామాలతోవున్నా, బీజంలోనుంచి మూత్రద్వారంవరకూ ఏకవాహిని వున్నది. బీజం నుంచి మూత్రద్వారంవరకూ, ఈ వాహిని, మొత్తంఇరవై అడుగులు వుంటుంది. ఎక్కడనో కొండలలో పుట్టి, అనేకప్రదేశాలగుండా ప్రవహించి, అనేక ఉపనదులు తెచ్చేజలాలను తనలో కలుపుకుంటూ, కల్లోలినివరకూ ప్రవహించే నదితో దీనిని పోల్చవొచ్చును.

సృష్టికథకు బీజంనుంచి వెలువడే శుక్లఅణువు ప్రధానవొస్తువు కనుక, దీనికి కారణభూతుడైన పురుషుణ్ణి, మనపూర్వులు 'బీజం' అన్నారు.

# అజ్ఞానం

అజ్ఞానాన్ని అంధకారంతోనూ, జ్ఞానాన్ని వెలుతురుతోనూ పోల్చుతారు. చీకటి అనుమానాన్నీ, జంకునీ, భయాన్నీ కూడా కల్పిస్తుంది; అజ్ఞానం కూడా. పసిపిల్లలు, కొత్తఅయిన దానిని ప్రతీదాన్నీ అనుమానంతో చూస్తారు; అయినా దానిసంగతి తెలుకోవలెననే ఆత్రుతతో ఆందోళనపడతారు. అందుచేతనే, పసిపిల్లలు అనేకలక్షలప్రశ్నలు వేస్తారు. ప్రతీదాన్నిగురించీ వివరంగా తెలిసికోవలెననే ఆత్రుత, వాళ్ళని బాధిస్తుంది. పెద్దవాళ్ళు సాధారణంగా, పిల్లలప్రశ్నలకు సరియైన సమాధానాలు యిచ్చి, వాళ్ళకి జ్ఞానాన్ని కలిగించడానికి తోడ్పడరు; కాని, పిల్లలు తమఅన్వేషణను మానరు; ఏదోవిధంగా తమప్రశ్నలకు సమాధానాలను సంపాదించి, తమ ధోరణిని జ్ఞానార్జనచేస్తూ యెదుగుతారు. ఒకవయస్సు వొచ్చే వరకూ వాళ్లు వేసేప్రశ్నలన్నీ బాహ్యప్రపంచకాన్నిగురించినవే; కాని, ఒక వయస్సుప్రారంభంకాగానే, వారి దృష్టి అంతర్ముఖమై, తమర్ని గురించితాము ఆలోచించడంకూడా ప్రారంభమౌతుంది. వయస్సుతోపాటు అవయవాలలో కలిగేమార్పులు యిందులకు కారణం

రహస్యఅవయవాలలో భేదాలు వెల్లడిగా కవబడుతూవున్నప్పటికీ, పసితనంలో బాలబాలి

కలు ఏభేదాన్నీ గుర్తించరు. వాళ్ళ దృష్టి అటువైపు పోదు. కాని, యుక్తవయస్సు దరికివొస్తూవున్నకొలదీ, యిరువురికీ ఒకజ్ఞానం కలగడం ప్రారంభిస్తుంది. ఇదివరలోయెరగని కొత్త వెలుగులో కొన్నిసంగతులను బాలుడూ-బాలికా గుర్తించడం జరుగుతుంది. అంతతో, యిరువురికీ మధ్యను, వొకగుంభన యేర్పాటౌతుంది; దానితో, యిరువురికీ మధ్యను, సిగ్గుతెరలు తయారవుతవి; ఆ తరువాతను యిరువురి మనస్సులలోనూ ఏవో తెలిసీతెలియని గుసగుసలతో కూడిన రహస్యాలు బయలుదేరుతవి; ఆ పిమ్మట యిరువురి హృదయాలలోనూ ఇదివరలో ఎరగని రెపరెపలు ప్రారంభమౌతవి; అక్కడినుంచి యిదివరలో అనుభవంలోలేని ఒక నూతనఆకర్షణ యిరువురినీ భయపెడుతుంది; ఈ ఆకర్షణ ఫలితంగా, యిరువురూ అతిదగ్గరగా చేరవలెననే ఉబలాటంతో, వొకరికి వొకరు మరింతదూరం కావడం తటస్థిస్తుంది. ఎందుచేతను ఈ విధమైన వైపరీత్యం అంటే, దీని కంతటికీ కారణం వొక్కటే :

పడుచుదనపు చిహ్నాలు శరీరాలలో పొడచూపడం ప్రారంభంకాగానే, యీ చిహ్నాలను గుర్తించడంతో, మానసికంగా మార్పు కలుగుతుంది. దీనితో బాలిక స్త్రీత్వాన్నీ, బాలుడు పురుషత్వాన్నీ,లీలగా అవగాహన చేసుకునే అవకాశాన్ని కల్పిస్తుంది, అవయవాలలోని మార్పు. ఇక, పదమూడు సంవత్సరాల వయస్సు పైబడగానే బాలుడికీ బాలికకూ, గొంతుకలు మారడందగ్గరనుంచి అనేకమార్పులు

కలుగుతవి. బాలుడికి మూతిమీాదను నూనూగు మీాసాలు అంకురించడమూ, చనుబిళ్లలు తయారై, చిళ్లపెంకుల కాపుతో అవి కరిగిపోవడమూ జరుగుతుంది. బాలికకు వక్షస్థలం మీాదను స్తనసౌభాగ్యం ప్రస్ఫుటంకావడం ప్రారంభించి, పైటఅవసరమూ, మాటిమాటికీ అనవసరంగాకూడా పైట సర్దుకోడమనే ఆదుర్దాలు కలగడమూ, సహజమౌతవి. పై అవయవాలలో కలిగే మార్పులతో పాటు, యిదేసమయంలో రహస్యఅవయవాలలో పెద్దమార్పులు జరుగుతవి.

కంటికి కనబడకుండా, శరీరం లోపలనువున్న అవయవాల్ని అస్వాధీన అవయవాలు _Involuntary organs_అంటారు. ఇవి నిరంతరమూ అనగా పుట్టుకకు పూర్వంనుంచి సహితం ప్రారంభించి, ప్రాణంపోయే వరకూ, నిద్రలోసహితం, పనిచేస్తూవుంటవి. కరచరణాది అవయవాలవలె తాత్కాలిక శాంతినికూడ యివి యెరగవు : గుండె కాయ కొట్టుకోడం ఎప్పుడూ ఆగదు; ఊపిరితిత్తులు ఉచ్ఛ్వాస నిశ్వాసాలను ఎప్పుడూ మానవు; జీర్ణకోశం తనపనిని యెప్పుడూ ఆపదు; ఈ విధంగానే పైత్యకోశమూ క్లోమం, వృక్కలూ, పేగులూ, మొదలైన అస్వాధీనఅవయవాలు అన్నీకూడ. ఆఖరికి, మెదడు నిద్రలోసహితం, కలలతో ఆడుకుంటూఅయినా పనిచేస్తూనే వుంటుంది. రహస్యఅవయవాలలోని కొన్నిభాగాలు కూడా యీావిధినే అనుసరిస్తూవున్నవి.

వృషణాలు యెప్పుడూ కదలిక లేకుండా వుండవు. కెరటాల ఆందోళనతో నిరంతరమూ కదిలే సముద్రంవలె, వీటిలో యెప్పుడూ యేదోవిధమైన కదలిక ఉంటూనే వుంటుంది. వృషణాలు లోలోపలను తిరుగుతూ, కొద్దిగా కిందికి జారుతూ, మళ్లీ పైకిపోతూ, నిరంతరభ్రమణంలో ఉంటవి. శరీరంలోని ఇతర అవయవాలలోకివలెనే, బీజాలలోకి కూడా, రక్తమూ, లింఫ్ - Lymph - అనే పదార్థమూ ప్రవహిస్తూ వుంటవి. కాని, బాలుడికి పద్నాలుగుసంవత్సరాల ప్రాంతం వయసు రాగానే, యీ బీజాలు కొత్తయత్నానికి పూనుకుని, తమలోకిప్రవహించే రక్తమూ లింఫులను ఉపయోగించి, సజీవమైన శుక్లఅణువుల్ని తమలో తయారుచేసి, యీ జీవాణువుల్ని ఎపిడిడిమిస్‌లలో నింపడం ప్రారంభించుతవి. అంతతో రహస్య ఇంద్రియాల యితరభాగాలలో ఏ మేల్కొలుపు జరుగుతుందోమరి, బాలుడిదృష్టి మార్పుచెందుతుంది. ఇదివరలో అమాయికంగా ఆటపాటలలో యెరమరిక యెరగని స్నేహితురాళ్ళవైపు కొత్తచూపులు ప్రసరించడమూ, కలలలో, అవ్యక్తమైన అనుభవాలు కలగడమూ తటస్థిస్తూ, ఎప్పుడో ఒకప్పుడు స్ఖలనమై, శుక్లం బయటపడుతుంది. ఆ క్షణంనుంచి కొత్తప్రశ్న వొకటి మనస్సును వేధిస్తుంది. మగతనం లీలగా అర్థమౌతూవుంటుంది; నిర్ణయంగా సమాధానం లేకపోయినా, యీ మార్పు ప్రయోజనం పూర్తిగా తెలియకపోయినా; ఆలోచనలు అనేకవిధాల పరుగుపెడుతూ ; వెలుగు - చీకటుల మధ్యను, మనస్సు వ్యాకులపాటు పడుతూ వుంటుంది.

భాలుడికివలెనే బాలికకుకూడ బాహ్యాఇంద్రియాలలో కలిగే మార్పులతోపాటు రహస్య అవయవాలలో కూడా మార్పులు, యుక్తవయస్సు రాగానే ప్రారంభమౌతవి: బాలిక పుట్టిననాటికే, ఆమె శోణకోశాలలో ముప్ఫైవేలవరకూ శోణితఅణువులు వుంటవి. బాలికకు యుక్తవయస్సు రాగానే, యీశోణకోశాలు, తమపనిని తాము ప్రారంభించుతవి. ఒక్కొక్క-గుడ్డులో యిమిడి, తమలో నిక్షిప్త మయివున్న శోణితఅణువుని, ఒక్క దానిని పక్వం చేసి, బైటికి గెంటివేయడం ప్రారంభించుతవి, శోణకోశాలు. బైటపడ డంలో, యీ గుడ్డు పగిలి, ఆ ద్రవంలో కదులుతూ, శోణిత అణువు, శోణితనాళాల వేళ్లకు చిక్కి, ఆ నాళాల నొక్కులవల్ల దిగజారుతూ, గర్భకోశాన్ని చేరుతుంది. ఈ విధంగా శోణిత అణువు తనలోనికి దిగజారి వొచ్చేవేళకు, గర్భకోశంలో కూడ ఒకమార్పు జరుగుతుంది: తనచుట్టూవున్న కండరాల వొత్తిడివల్లను, గర్భకోశం లోపలిపొర వొకటి, కండరాల నుంచి విడివడి, ఈయత్నంలో కండరాలనుంచి ద్రవించే రక్తంతో కలిసి, ఒక స్రావంగా యోని ద్వారా ప్రవహించుకు వొచ్చి, కన్నెతెరను తోసుకుని బయట పడుతుంది. ఈ విధంగా స్రావం మొదటిసారి బయట పడడాన్ని 'సమర్త' అనీ 'రజస్వల కావడం' అనీ, 'పెద్దమనిషికావడం' అనీ – Menarchie – అంటారు. ఈ విధంగా బాలికకు మొదటిసారి రజోదర్శనం కలిగినప్పుడు, యీ విచిత్రమేమో ఆమెకు తెలియకపోయినా, ఆమెమనస్సు వ్యాకులపాటు పొందడమూ, ఆమె దృష్టి, రహస్య

అవయవాలవైపు మరలడమూ తటస్థిస్తుంది. ఇంతలో బాలికకు స్త్రీత్వం కొంత అవగాహన అయినా, దీని అర్థం పూర్తిగా తెలియదు. ఆమె మనస్సు, అవ్యక్తమైన కోర్కెలతో కదులుతూ, అర్థంకాని స్వప్నాల పాలౌతూ, అయోమయంగా వున్న భావనాప్రపంచంలో పడిపోతుంది.

మన దేశంలోనే కాదు, స్త్రీలకు స్వేచ్ఛ యెక్కువగావున్న పాశ్చాత్యదేశాలలోకూడ, యుక్త వయస్సుకు వొచ్చిన కన్యలకు, ఈ అయోమయస్థితి తప్పడం లేదు. అమెరికా దేశంలో, డాక్టర్ హెలెన్ కెన్నెడీ, నూటయిరవై అయిదుగురు బాలికలను ప్రశ్నించి తెలుసుకున్న వివరాలుయివి : ముప్ఫైఆరుగురు, సమర్తఅయ్యేవరకూ, దాని సంగతియేమిటోకూడ యెరగరు; ముప్ఫైతొమ్మండుగురు తమకన్న వయస్సుమీరిన స్నేహితురాళ్ళతో యీ సంగతిని ముచ్చటించడం తటస్థించినా, దీని పూర్తివివరాలు అవగాహన కాలేదు; తమ తల్లులవల్ల యీసంగతిని తెలుసుకున్నవారు, యీ నూటయిరవైఅయిదుగురిలోనూ, సఖ్యమైనాలేరు. 1905 వ సంవత్సరంలో జర్మనీదేశంలో, టోబ్లర్, వెయ్యిమందిస్త్రీలను ప్రశ్నించి, యీ సందర్భంలో వారి అనుభవాలను తెలుసుకుని, "వీరిలో చాలామంది సమర్తసమయంలో మానసికంగా విపరీత పరిస్థితులలో పడ్డారు" అన్నాడు.

ఇదిగాక, తొలికలయికలో బ్రహ్మచారికీ, కన్యకూ కూడా, శారీరికంగానూ మానసికం

గానూ బాధా, ఖంగారూ, కలగడానికి అవకాశాలు ఉన్నవి. బాలుడికి మణిచర్మం సుళువుగా జారే అవకాశం వున్ననాడు అంత యిబ్బంది వుండదు; కాని, సాధారణంగా మణి కిందిభాగం లోని యీనె, కొంత బిగువుగా వుండడంవల్లను, మణిచర్మం సుళువుగా జరగక, చాలామంది, తొలికలయికలో యిబ్బంది పడతారు. ఈ విధమైన బ్రహ్మచారి అనుభవాన్ని 'ఈనె తెగడం' అని వేళాకోళంగా అంటారు. ఈ పని జరిగిన నాడు, సురతానికి కష్టం కలుగుతుంది. ఈనె తెగిన భాగం నయమయ్యే వరకూ, కామకార్యాన్ని ఆపుజేయవలసి వొస్తుంది. దురదృష్టవంతులైన కొందరు బ్రహ్మచారులకు యీనెతెగడం చాలాకష్టాన్ని కలిగిస్తుంది. మణిచర్మం అవయవం మొదరకు బాగా ముడుచుకునివుండి, యీనె బిగువు మరీఘట్టిగావుండి, ప్రథమసమాగమంలో ఉత్సాహమూ, ఆత్రుతా, తొందరపాటూ వల్లను, విజృంభించడంలో, ఘట్టిగా వున్న యీనె తెగడంలో, రక్తం స్రవించి, ఒక్కొక్కప్పుడు మణిచర్మంలో పొర నలిగి, కామకార్యానికి విఘాతం యేర్పా టవుతుంది. ఈ స్థితి కలిగిననాడు వెనకకుపోయిన చర్మాన్ని వెంటనే ముందుకు లాగి సరిచేయడం చాలా అవసరం. మణి చర్మం, అంతగట్టిగాముందుకు ముడుచుకుని వున్నవారు, ప్రథమ సమావేశంలో యీవిధమైన ఆఘాతంపాలయి మర్నాటికి అవయం వాచిపోయి, చర్మం కదలక, శస్త్రచికిత్సకూడా - Phimosis - పొందవలసిన స్థితిలో పడిపోతారు.

బ్రహ్మచారి అనుభవం వంటిదే కన్యకకూడా, తొలిసమావేశ అనుభవం ఒకటి తప్పదు. అందరు బాలికలకూ కన్నె తెర ఒకేవిధంగా వుండదు. కన్నె తెర ఘట్టితనమూ, మందమూ, పలచనా దాని మధ్యనువుండే రంధ్ర పరిమాణమూ శరీరస్థితినిబట్టీ, వంశలక్షణాలను బట్టీ, వేరువేరు విధాలుగా వుంటుంది. కొందరు బాలికలకు సమర్తసమయంలోనే కన్నె తెర తావిచ్చి, బిగువు సడలిపోతుంది; అందుచేతనే కన్నె తెర చీలివుండడమూ చీలిపోక వుండడమూ బట్టి, కన్నె అయినదీ కానిదీ నిర్ణయించను వీలులేదు. కొందరు కన్యకలకు కన్నె తెర మృదువుగానూ, పలచగానూవుండి, తొలిసమావేశాలలో కొద్దిగా బాధనూ, కొంచెం యిబ్బందినీ కలిగిస్తూ, నెమ్మదిగా సర్దుకుంటుంది. కాని, కొందరు దురదృష్టవంతులైన కన్యలలో, కన్నె తెర బాగా దళసరిగానూ, బాగా బలంగానూ వుండి, పురుషఅవయవాన్ని సులువుగా చొరనీయదు; యిటువంటిస్థితిలో పురుషుడి బలాత్కారమూ, తొందరపాటూ తటస్థిస్తే, కన్నె తెర చిరగడంలో పట్టరానిబాధ కలగడమూ, అపారంగా రక్తం కారడమూ, ఒక్కొక్కప్పుడు కన్యక మూర్ఛపోడం కూడా జరుగుతుంది. ఈ ఆఘాతానికి గురియై, భయవిహ్వలలైనవారు కొందరు, ఆతరువాతను చాలా కాలంవరకూ అపస్మారంతో – అనగా హిస్టీరియా, ఒకజాతి మూర్ఛతో – బాధపడతారు. ఈ విధమైన అనుభవంతో భయభ్రాంతులయినవారు కొందరు, మరల భర్తదరిచేరడానికిభయపడిపోతారు. కన్నె తెర, మరీ బిగువుగావుండి పురుషఅవయవాన్ని

చూరనీయకపోతే, కన్య భయపడిపోయి, సంగమానికి యిచ్ఛగించకపోవొచ్చును. అటువంటి కన్యను, మాచకమ్మ అని భర్త నిరాకరించడంకూడా తటస్థించవొచ్చును. ఇటువంటి కన్యను డాక్టరుచే పరీక్షచేయించి, కన్నెతెర అభ్యంతరాన్ని తొలగించివేస్తే, ఆమె సుఖంగా సంసారం చేయగలుగుతుంది.

బ్రహ్మచారీ కన్యా, ప్రథమ సమావేశంలో, స్వర్గంలో ప్రవేశిస్తున్నామని ఉబలాటపడే సమయంలో, మానసికంగా, తాత్కాలికమైనా, అంతవరకూ ఊహించిన బ్రహ్మానందం హఠాత్తుగా భగ్నమై, అన్యోన్యంగా వున్న ఆకర్షణను అధికం చేసుకోవలసిన సమయంలో, వొకరిని చూసి వొకరు, సిగ్గుపడవలసిన పరిస్థితులు యేర్పడంకన్న అన్యాయం మరొకటి వుండదు. సంసారసౌధాన్ని నిర్మించుకునే యత్నంలో, మొదటి మెట్టులోనే, యింతటి రసాభాసపాలు కాకుండా, దంపతులకు అవసరమైన సలహానీ సహాయాన్నీ యిప్పించడం, పెద్దల విధి. కన్యకూ బ్రహ్మచారికీ యిటువంటి ఆఘాతం కలగకుండావుండవలెనంటే, కన్య వైద్యురాలివల్ల - లేడీడాక్టర్ - సహాయ్యాన్ని పొందితే మంచిది. మణిచర్మం మరీఘట్టిగా యెదరకు ముడుచుకునివున్ననాడు, బ్రహ్మచారి, డాక్టరు సహాయ్యాన్ని పొందడం తెలివైన పని. మణిచర్మం, మరీ యింత బిగుతుగావున్ననాడు, పసితనంలోనే పెద్దలు చికిత్సచేయించడం మంచిది. యూదులూ, ఆఫ్రికాలోకొన్నిజాతులవాళ్ళూ, ముసల్మానులూ, పసితనంలోనే మణిచర్మాన్ని కత్తిరించివేస్తారు.

ఈ కార్యాన్ని ముసల్మానులు 'సుంతీ,' - Circumcision - అంటారు. బాలుడి విషయంలో యూదులూ, ముసల్మానులూ ఈ జాగ్రత్తను కల్పించారు; కాని బాలిక విషయంలో, వీరూ తతిమ్మాజాతుల పద్ధతినే, అజాగ్రత్తకు అలవాటు పడ్డారు. ఈ సందర్భంలో అడివిజాతులనీ, అనాగరికులనీ ప్రతీతిగల కొన్ని ఆటవికజాతుల ఆచారాలు గమనించదగినవి.

ఆఫ్రికాఖండంలో ఉన్న 'అజింబా' దేశంలో, ఆదిమవాసుల ఆచారాలనుగురించి, హెచ్. క్రాఫర్డ్ ఏంగన్, ఈ విధంగా తెలియజేశాడు: కన్య సమర్తసమయం తెలియగానే, పల్లెకు దూరంగా ఏకాంతంగావున్న గుడిసె లోనికి, కుమార్తెను తీసుకుని వెళుతుంది, తల్లి. అక్కడ జరిగే కార్యకలాపాలలో, యితర స్త్రీలు పాల్గొంటారు; కాని, పురుషులు ఆ ప్రాంతాలకు వెళ్ళరు. కన్నెతెర పూర్తిగా విడిపోవడమియ్యడానికీ, యోని విపులంకావడానికీ, చేతుల్ని ఉపయోగించడమే కాక; అందునిమిత్తం ఉపయోగించే కొమ్ముని యోనిలో ప్రవేశపెట్టి, వల్కలంతో దానిని ఆ స్థితిలో కట్టి వుంచుతారు. తరువాతను సంసారం చేయడానికి తెలుసుకోవలసిన సంగతులనన్నీ, దాపరికం లేకుండా తెలియబర్చుతారు; ఆపైన, అనేక విధాలైన బంధనాలు వేయించి వాటి సుళువుల్ని తెలియజేస్తారు; తదనంతరం, వయస్సువొచ్చిన స్త్రీలు కొందరు, రహస్యఅవయవాలను గురించీ, రతిక్రీడను గురించీ తెలియబరిచే పాటల్ని పాడుతూ, నృత్యం చేస్తారు; అనుభవజ్ఞు

లైన స్త్రీలు కన్యకు రతి విధానాన్ని నేర్పుతారు; ప్రతీ మాసమూ, రజోదర్శనం కలిగినప్పుడు, శుభ్రతకోసం తీసికోవలసిన జాగ్రత్తను గురించీ, తాను భార్యగా నిర్వహించవలసిన విధులను గురించీ తెలియజెప్పుతారు. ఇది శుభకార్యంగా యెంచుతారు. ఈ శుభకార్యాన్ని వాళ్ళ భాషలో "ఛెంసంవాలీ" అంటారు.

ఆఫ్రికాఖండంలోనే, 'బావాండా' అనే జాతివారు కూడ, యిటువంటి పాఠాలను కన్యకు సమర్త సమయంలో నేర్పడమే కాక, యుద్ధం చేయడమూ, ఆత్మరక్షణా, నేర్పుతారనీ, ఆ తరువాతను, స్త్రీలూ పురుషులూ కలిసి నృత్యం చేస్తారనీ, ఒక పాశ్చాత్య ఫాదిరీ వర్ణించాడు. తూర్పు ఆఫ్రికా దేశంలో, స్పెన్సర్, గిల్లిన్ అనేవారు యిరువురు, పర్యటనం చేసి, 'మాసై' అనే ఆఫ్రికాజాతివారు సమర్తను శుభకార్యంగా యెంచి, నెలల తరబడీ కూడా, కన్యకు ఉపదేశాలు చేస్తారని వర్ణించారు. 1905 వ సంవత్సరంలో ఆస్ట్రేలియా ఖండంలో, ఆదిమవాసుల ఆచారాలను వివరంగా తెలుసుకుని ఆర్. హెచ్. మేథ్యూస్: విక్టోరియా దేశంలోని ప్రజలలో, ఆఫ్రికాజాతులలో వున్న ఆచారాలవంటి విధానాలు, యీ సందర్భంలో అమలులో వున్నవని తెలియబరిచాడు. ఈనాడు నాగరికులము అనుకునేవారికన్న, అనాగరికులు అనిపించుకునే అడవిజాతులవారు, యీ సందర్భాలలో అనుసరించే విధా

నాలు కొన్ని, తెలివైనవని శాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతున్నారు.

"తమ పిల్లలకు యుక్తవయస్సు వొస్తూవున్నదనగానే, వాళ్ళకు అవసరమైన రహస్యాలను వెల్లడిచేసే గ్రంథాలను, తల్లిదండ్రులు, తమకుమార్తెలకూ కుమారులకూ అందజేయడంమంచిది" అంటాడు హేవెలక్ ఎల్లిస్. ఆఫ్రికా ఆస్ట్రేలియా ఖండాలలో వివిధజాతులవారు అనుసరిస్తూవున్న ఆచారాలను గురించి పరిశోధనలుచేసి తెలిసికోలేకపోయినా; ఈనాటి పాశ్చాత్యపరిశోధకులకువున్న పరిక్షావకాశాలు తనకు ఆనాడు లేకపోయినా, "వైశాసికజనా ద్రహసి ప్రయోగాన్ శాస్త్ర మేకదేశంవా స్త్రీ గృహ్ణీయాత్" అనగా, నమ్మకంగల వారివద్దనుంచి, స్త్రీ, ప్రయోగగ్రహణాన్ని, శాస్త్రగ్రహణాన్ని నేర్చుకోవలెను, అని వాత్స్యాయనుడు, రెండువేల సంవత్సరాలక్రితం తెలియబరిచాడు.

ప్రతీవ్యక్తికీ అవసరమైనంత జ్ఞానం వుండాలి. ఆ జ్ఞానాన్ని వినియోగపరచడంలో తగు జాగ్రత్తలుకూడా అలవడాలి. వ్యక్తులందరూ యీ విధంగా విజ్ఞానవంతులైననాడు, సంసారాలూ, సమాజమూ, సరియైన సంస్కారాన్ని, చక్కని నాగరికతనూ, కలిగివున్నట్టు గణన అవుతుంది. ప్రజలందరూ నాగరికతను కలిగివున్ననాడు ఆ దేశాన్ని ప్రపంచకం గౌరవిస్తుంది.




1 కామ గ్రంథులు 2 సుప్రారీనల్ గ్రంథులు 3 థైమస్ గ్రంథి 4 థైరాయిడ్ గ్రంథి 5 పేరా - థైరాయిడ్ గ్రంథులు 6 పిట్యూటరీ గ్రంథి

# హార్మోన్

ప్రపంచకంలోని ఆకర్షణల నన్నింటినీ ఊసడించిపారవేసి, పంచేంద్రియాలను బంధించివేసి పరివ్రాజకచక్రవర్తులై, షట్చక్రాల స్వరూపాల్ని సమగ్రంగా గ్రహించి, యమ నియ మాసన ధ్యాన ధారణ సమాధుల నిరంతరసాధనలో నిశ్చలమనస్కులై, ఊర్ధ్వరేతస్కతను సాధించి, నిద్రాణంగావున్న కుండలినీ శక్తిని ప్రేరేపించి మహోజ్వలం చేసి, 'తమసో మా జ్యోతి ర్గమయ!' అనే తీక్ష్ణదీక్షతో చీకటితెరలను చీల్చి చెండాడి, కదలికయెరగని దీపకళికగా నిశ్చలతేజస్సును నిండుమనస్సులో నిలిపి, 'ఆనందో బ్రహ్మ' అనే ఆగమసత్యాన్ని అనుభవయోగ్యం చేసుకుని, 'అహం బ్రహ్మ' అయిన మహర్షిపుంగవుడు, ఒక్కొక్కడు, ఒక్కొక్క క్షణం, కామినీకటాక్షానికి కంగారుపాలై, భామినీబాహువల్లరులలో బందీకావడం యెందుకు తటస్థించింది?

మానవశరీర నిర్మాణంలో, ప్రకృతి, కొన్ని మాయశక్తుల్ని ఇమిడ్చివుంచింది. ఈ శక్తులు చెలరేగనంతసేపూ నిగ్రహదీక్షలు నిరాఘాటంగా సాగుతవి; కాని, యీ లోపలి శక్తులు విజృంభణ ప్రారంభిస్తే, మనస్సూ శరీరమూకూడా, తట్టుకోలేని తుఫానులో తబ్బిబ్బులై పోతవి.

బాహ్యప్రపంచంలో చెలరేగే తుఫానుల్ని తప్పించుకోడానికి యెక్కడనో వొకచోటను తల దాచుకునేటందుకు ఆశ్రయం చిక్కుతుంది; కాని, ప్రతీ రోమకూపంలోనుంచీ వేడి విర జిమ్ముతూ, పంచేంద్రియాలూ సంచలించిపోతూ, హృదయం రావిఆకువలె రెపరెపలాడిపోతూ, మనస్సు మహాకల్లోలిని అయి, వెయ్యి తుఫానులు లోలోపల చెలరేగడం ప్రారంభిస్తే, ఎంతటి దీక్షాపరుడైనా ఏమిచేయగలడు? తన ఇంద్రియాలే తనపై తిరుగుబాటు సాగించిననాడు, తన లోపలి శక్తులే తన దీక్షకు శత్రువులైననాడు, తన నరాలబిగింపే తనకు కంపనమైన నాడు ; పంచేంద్రియాలనూ బంధించిన యెంతటి బ్రహ్మచర్య దీక్షాపరుడయినా, నిగ్రహసమగ్రతను సాధించిన యెంతటి నియమపరుడయినా, మనశ్చాంచల్యాన్ని అరికట్టిన యెంతటి మహామహుడయినా ఒక్కక్షణంలో లొంగిపోతున్నాడు. ఎంతటి వాడినైనా, యింతగా తబ్బిబ్బుచేయగలిగిన శక్తి యేమిటి, ఈ శక్తి యెక్కడ దాగివున్నది, ఈ శక్తి యేవిధంగా తన విజృంభణను సాధించగలుగుతూ వున్నది?

హార్మోన్ - Harmone -

ఈ అంతర్నాటకానికి అంతకూ కర్త. సూత్రధారుడివలె తెర వెనకనువుండి, ఈ హార్మోన్ మాయనాటకాన్ని నడిపిస్తుంది. నాయికానాయకులు, ఈ హార్మోన్ ఆడించే ఆటలో, దాని వశమైన కీలుబొమ్మలు. హార్మోన్, అనేకశక్తుల్ని కల్పిస్తుంది, అనేకశక్తుల్ని నాశనం చేస్తుంది. శరీరం పుష్టిపొందడం దీని దయ,

శరీరం నష్టపడడం దీని యిచ్ఛ; అవయవాలు సరిగా పని చేయడం దీని అనుగ్రహం, ప్రకోపంవల్లను కలిగే దీని ఉధృతం అవయవాలకు మహాప్రమాదం. ఈ హార్మోన్ ప్రభుత్వాన్ని, ధిక్కరించే శక్తి ఏ అవయవానికీలేదు. ఈ హార్మోన్ నిర్ణయాన్ని కాదని పై తీర్పుచెప్పేదిక్కు యెక్కడా కానరాదు. ఈ హార్మోన్ ఫర్మానాలను మంజూర్ చేయను అని మెదడు సహితం యెదురు తిరగలేదు. ఇంతటి నియంతృత్వప్రజ్ఞగల ఈ హార్మోన్ యేమిటి ?

శరీరంలోపలను, అనేక ప్రదేశాలలో, గుప్తంగా, చిన్నచిన్న నిర్మాణాలు వున్నవి. వీటిని గ్రంథులు - Glands - అంటారు. ఈగ్రంథులలో తయారయ్యే పదార్థాన్ని హార్మోన్ అంటారు. ఈ గ్రంథులలో కొన్ని నాళాలద్వారా - Ducts - తమ హార్మోన్లను పంపుతవి. కాని, కొన్ని ముఖ్యగ్రంథులకు నాళాలతో నిమిత్తంలేదు; ఈ గ్రంథుల హార్మోన్లు సరాసరి రక్తంలోనికి ప్రవహిస్తూ వుంటవి; అందు చేతను, ఈనిర్నాళగ్రంథుల-Endocrine Glands- హార్మోన్ల ప్రయోగం, ప్రత్యేక అవయవాలకేకాక, శరీరానికి అంతకీ కూడా తగులుతుంది. నిర్నాళగ్రంథులు ఏడు. ఈ సప్త గ్రంథులూ చాలా ముఖ్యమైనవి. వీటి వివరాలు :

1. పురుషుడి బీజాలలోనూ, స్త్రీ శోణకోశాలలోనూ నిర్మాణమయ్యే జీవఅణువుల్ని గురించి యిదివరలో తెలుసుకున్నాం. ఈ జీవఅణువుల్ని తయారుచేసే

వాటిని కామగ్రంథులు * -Sex glands- అంటారు. ఈ కామ గ్రంథులలో తయారయ్యే హార్మోన్, సృష్టి ప్రధానకార్యాన్ని నెరవేరుస్తుంది. పిండకోశంలో శిశువు ఆడ - మగ నిర్ణయాన్ని ఈ హార్మోన్ శాసిస్తుంది. ఈ హార్మోన్ శరీరంలో లీనమై అమోఘమైన శక్తుల్ని కలిగిస్తుంది ; యుక్తవయస్సుకి పూర్వం సహితం యిది శరీరాభివృద్ధికి తోడ్పడుతుంది; ఇక, యుక్త వయస్సు వొచ్చిన తరువాత నుంచీ, శక్తి వుడిగిన వృద్ధాప్యం వరకూ, దీని ప్రయోజనంమీదనే జీవితసుఖమంతా ఆధార పడింది; అంతేకాదు, రాబోయేతరాలను ఈ హార్మోన్ నిర్ణ యిస్తూవుంది, వెనకటి ఏడు తరతరాల వారి మంచిచెడ్డలను పదిలపరిచివుంచి, రాబోయేతరాలకు దానిని అందిస్తూవుంది. దీని ప్రాధాన్యం ఏమిటో, శరీరంలోని మిగతా ముఖ్య గ్రంథులు అన్నింటికీ దీనితో సంబంధం వున్నది.

ఎంత తరిచినా ఈ కామగ్రంథల హార్మోన్ వృత్తాంతం అతి నిగూఢం, దీని కార్యక్రమం అతః పుర రహస్యం.

2. జీర్ణకోశానికి వెనకను, వెన్నెముకకు దగ్గరగా, దాని యిరుపక్కలనూ జీడిమామిడి గింజల ఆకారం కలిగి, నాలుగేసి అంగుళాల పొడుగు వున్న అవయవాల్ని వృక్కలు అనీ, మూత్ర పిండాలు అనీ,

* కామగ్రంథులు అంటే, స్త్రీలో శోణకోశాన్నీ, పురుషుడిలో బీజాల్నీ సూచించే ఏకపదంగా గ్రహించాలి.

- Kidneys - అంటారు. శరీరంలోపలినుంచి బయటికి పోవలసిన ద్రవం కొంత, యీ వృక్కలలోనికి ప్రవహించి వీటిలో వడపోత అయి, వీటినుంచి మూత్రకోశంలోనికి దిగజారి, ఆ కోశంనుంచి మూత్రనాళంద్వారా బైటికిపోతుంది. వృక్కలు చాలాముఖ్యమైన అవయవాలు; వీటిశక్తి క్షీణించిపోతే ప్రాణానికి అపాయం తప్పదు.




1 సుప్రారీనల్ గ్రంథి 2 వృక్క
కిందిబొమ్మ: సుప్రారీనల్ 1 అంతర్భాగం 2 ఉపరిభాగం

ఈ వృక్కలకు ఒక్కొక్క దానికీ పైభాగంలో, నెత్తిమీది టోపీలవలె వున్నవాటిని, సుప్రారీనల్ గ్రంథులు అనీ, ఎడ్రినల్ గ్రంథులు అనీ - Suprarenal or Adrenal glands - అంటారు. ఈ సుప్రారీనల్ గ్రంథులు, అనేక శక్తుల్ని తమలో యిముడ్చు

కున్నవి. శరీర ఆరోగ్యం సుఖంగా ఉండవలెనన్నా మెదడూ, నరాలూ, సరిగ్గా పనిచేయవలెనన్నా యీ సుప్రారీనల్ గ్రంథులూ మంచిస్థితిలో ఉండాలి.

ఈ సుప్రారీనల్ గ్రంథులలో తయారయ్యే హార్మోన్లు అనేకవిధాలుగా అవయవాలను ఆడించ గలవు; ఇవి రక్తం ప్రవహింపుని తబ్బిబ్బుచేస్తూ, దానిలో అతివేగాన్నీ అతిమందాన్నీ కల్పించగలవు; కడుపు కండరాల లోని రక్తకూపాల్ని ముడుచుకునేటట్టుచేసి, రక్తం పోటుని - Blood - pressure - తప్పించి కల్పించి కంగారు కలిగించ గలవు; చిన్నపేగులలో లోపలిపొరలకువున్న జీర్ణశక్తిని మంద గింపజేసి, శరీరానికి నిస్సారత్వాన్ని కల్పించగలవు.

ఈ విధమైన బాధల్ని కల్పించ డమేకాక, ఈ సుప్రారీలన్ల హార్మోన్లు మరొక ముఖ్యకార్యా నికి ఉపయోగపడతవి; ఉద్రేకమూ, కోపమూ, ఆత్రుతా మొదలైన వొడిదుడుకులు కలిగినప్పుడు, రక్తంప్రవహింపు అతి జోరు అవుతుంది; రక్తం పొంగి ప్రవహించే యీస్థితిలో రక్త కూపాలు రక్తనాళాలూ ఉబుకుతవి; ఈ ఉబకడం వాటిశక్తిని మించినట్లయితే అవి పగిలి మెదడకీ అవయవాలకీ ఆఘాతం కలు గుతుంది; ఈప్రమాదం కలగకుండా, రక్తంజోరు హెచ్చగానే రక్తకూపాలు ముడుచుకునేటట్టు చేసి, రక్తంపోటు మితిమీరక కుండా ఆపుదలచేసి ఆయాసమూ అలసటా, ప్రమాదకరం కాకుండా రక్షణను కల్పించుతవి, సుప్రారీనల్ హార్మోన్లు.

కామాతురతలోనూ, కామోద్రేకంలోనూ, రక్తం ప్రవహింపు మరీజోరుకావడం సహజం గనుక, ఆస్థితిలో సుప్రారీనల్ గ్రంథుల సహాకారం యెంత అవసరమో చెప్పనక్కరలేదు.

సుప్రారీనల్ హార్మోన్లకు కామగ్రంథులతో ప్రత్యేక సంబంధంవున్నది; ఇవి కామగ్రంథుల్ని తమ అదుపు ఆజ్ఞలలోవుంచి, వాటికి జాగ్రత్తనుకూడా కల్పిస్తూవుంటవి.

ఈ సుప్రారీనల్ గ్రంథి ఒక్కటొక్కటీ రెండుభాగాలుగా వుంటుంది: ఈ రెండుభాగాలూ, దేని హార్మోన్‌ను అది తయారుచేస్తుంది. లోపలిది అయిన అంతర్భాగం - Medulla - తయారుచేసే హార్మోన్‌కు, నరాలతో సంబంధం యెక్కువ. ఉద్రేకం కలిగినప్పుడూ, వొడిదుడుకులలోపడి ఆందోళనలపాలైనప్పుడూ, ఈ హార్మోన్ నరాల ఉధృతాన్ని తన స్వాధీనంలో ఉంచుకుని, నాడీమండలానికి రక్షణను కల్పిస్తుంది. ఈ అంతర్భాగంకన్న, పైనది అయిన, ఉపరిభాగం - Cortex - చాలా ముఖ్యమైనది. బాల్యావస్థలో యీ పైభాగం, చెడుపదార్థంతోనిండి, దీనిని ప్రకోపింపజేస్తే, పిల్లల రహస్యఅవయవాలు, పెద్దవారి అవయవాలవలె వొడిదుడుకులో పడడమూ, అయిదుసంవత్సరాల వయస్సుగల పిల్లలుకూడ, పడుచుదనపుబుద్ధుల్ని కలిగివుండడమూ తటస్థిస్తుంది. ఈ ప్రకోపించడం ఆడపిల్లలకు సంప్రాప్తిస్తే, మగ

లక్షణాలు పొడచూపడమూ, స్వరం గంభీరం కావడమూ, గడ్డంమీదనూ పై పెదవి మీదనూ నూనూగుగా వెంట్రుకలు మొలవడమూ, చివరకు నడకలోసహితం మగతీరు యేర్పాటు కావడమూ ప్రారంభమౌతుంది.

ఈ సుప్రారీనల్ గ్రంథుల కు యింకా యేవో శక్తులు వున్నవనీ, వాటి రహస్యాలను కనుక్కునే యత్నాలు యింకా జయప్రదం కాలేదనీ, పరిశోధకులు అభిప్రాయ పడుతున్నారు.

3. ఛాతీలో, గుండెకాయ పైభాగంలో, సరిగ్గా ఛాతీయెముకకు వెనకను ఉంటుంది, థైమస్ గ్రంథి - Thymus -. పిల్లలకు ఏడుసంవత్సరాల వయస్సు వొచ్చేవరకూ యీ గ్రంథి పెరుగుతూ ఉండి, అక్కడి నుండి పదకొండు సంవత్సరాల వయస్సువరకూ అలా ఉండి, పధ్నాలుగు సంవత్సరాల వయస్సు రాగానే - అంటేయుక్తవయస్సు ప్రాంతాన - సంకుచితమై, జీర్ణించిపోయి, నిష్ప్రయోజనం అవుతుంది. యుక్తవయస్సు వొచ్చేనాటికి థైమస్‌గ్రంథి జీర్ణించిపోకపోతే, కొవ్వు పెరగడమూ, మందకొడి కావడమూ, పాలిపోవడమూ, చివరకు హఠాత్తుగా గుండె ఆగి చనిపోవడమూ తటస్థిస్తుంది. యుక్తవయస్సు వొచ్చేలోపుగా శరీరంలోని యెముకలూ, కండరాలూ, పెరిగి పెద్దవి కావడానికీ, అంతవరకూ రహస్యఅవయవాలు, తమ కార్యాలకు తొందరపడకుండా, అధీనంలో వుండడానికీ, థైమస్‌గ్రంథి ఉపయోగపడు

తుంది. పసితనంలో, దీని ప్రయోజనం హెచ్చు కనుక, దీనిని బాలగ్రంథి అంటారు.




1 థైరాయిడ్ గ్రంథి 2 ఊపిరిగొట్టం

4. గొంతుకులో, ఊపిరిగొట్టానికి మొదరను, రెండు పక్కలకూ కొంత వ్యాపిస్తూవుంటుంది. థైరాయిడ్ గ్రంధి -Thyroid gland- . దీనిలో తయారయ్యే హార్మోన్లవల్లను అవయవాలు సరిగ్గా పెరగడమూ, మెదడు చక్కగా పనిచేయడమూ, ఆరోగ్యం సుఖంగా వుండడమూ తటస్థిస్తుంది. ఈ థైరాయిడ్, వాడిలిపోయి - Atrophy - సరిగ్గా పనిచేయనినాడు, శరీరంలో కొవ్వు పెరుగుతుంది, చిన్న వయస్సులోనే బట్టతల ప్రారంభమౌతుంది, మెదడు శ్రమకు ఓర్వలేకపోతుంది, చివరకు ఊపిరిపీల్చడంకూడా కష్టమౌతుంది.

థైరాయిడ్, వాడిలిపోయి, శక్తి హీనంకావడం పుట్టుకలోనే జరిగితే, అటువంటి పిల్లలు ఆరు మాసాలవరకూ మామూలుగా యెదిగి, ఆ తరువాతనుంచీ యెదగడంమాని, మరుగుజ్జలు అవుతారు; వాళ్ళ మెదడుకూడా వికాసాన్ని పొందదు. అంటే, మెదడూ, శరీరమూ, సజావుగా యెదిగి, పూర్తిబలాన్ని పొందడానికీ, ధారణశక్తులు తగ్గిపోయి ముసలిలక్షణాలురాకుండా వుండడానికీ, థైరాయిడ్ శక్తులు సరిగ్గావుండాలి.

కామగ్రంథులలో, ముఖ్యంగా, స్త్రీలోని శోణకోశాలలో థైరాయిడ్‌గ్రంథికి సంబంధం యెక్కువ.




2 ఊపిరిగొట్టం 3 పేరా - థైరాయిడ్ గ్రంథులు.

5. థైరాయిడ్ గ్రంథిని పక్క నుంచిచూస్తే, దానికి కిందిభాగంలోనూ, పై భాగంలోనూ, థైరాయిడ్‌లో ఇమిడివున్న చిన్నగ్రంథులు రెండు కనిపించు తవి. వీటిని పేరా - థైరాయిడ్ గ్రంథులు- Para-thyroid glands - అంటారు. ఈ గ్రంథులలో హార్మోన్ తయారు సరిగ్గా వుంటే, రక్తంలో శక్తి బాగావుండి, అంటువ్యాధులు త్వరలో అంటకుండా రక్షణవుంటుంది. ఈ పేరా-థైరాయిడ్ గ్రంథులు వాడిలిపోయి శక్తిహీనమైతే, శరీరంలో వేడి యెక్కువ కావ డమూ, నాడి దుడుకుగా కొట్టుకోడమూ, ఎగఊర్పులు రావ డమూ, చివరకు స్పృహతప్పి మూర్ఛపోవడమూకూడా తట స్థిస్తుంది.

6. మెదడుకు అడుగుభాగం లోనూ, పిట్యూటరీ గ్రంథికి కొంచెంవెనకగానూ వుంటుంది పినియల్‌గ్రంథి -Pineal gland-. థైమన్ గ్రంథివలెనే యిదీ పిల్లల ఏడేళ్ల వయస్సునాటికి సంపూర్ణమైన వృద్ధినిపొంది, తరు వాతనుంచీ యుక్త వయస్సునాటికి క్షీణించిపోతుంది. థైమన్ గ్రంథివలెనే, పినియల్ గ్రంథికూడా, పిల్లలకు యుక్తవయస్సు వొచ్చేవరకూ వారి రహస్యఅవయవాలను అదుపు ఆజ్ఞలలో వుంచుతుంది. ఈ పినియల్ గ్రంథిలో, చెడుపదార్థంచేరి, దీనిని ప్రకోపింపజేస్తే, యెముకలు విపరీతంగా పెరగడమూ, పసితనం లోనే కామవికారం కలగడమూ, మొదలైన వికృతులు కలుగు తవి. బాల్యదశలోనే దీని ప్రయోజనాలు వుండడంవల్లను, థైమన్ గ్రంథివలెనే, దీనినికూడా బాలగ్రంథి అంటారు.




1 పిట్యూటరీ గ్రంథి 2 పినియల్ గ్రంథి

7. ఇంతవరకూ వివరించిన కామగ్రంథులూ, సుప్రారీనల్, థైమస్, థైరాయిడ్, పేరా-థైరాయిడ్, పినియల్ గ్రంథులు, ఏ గ్రంథికి ఆగ్రంథి, ప్రత్యేక కార్యాలను నెరవేరుస్తూ, తమలో తాము, ఒకదానితో వొకటి బంధుత్వాలను యేర్పాటుచేసుకుని, వేటికి అవి కామగ్రంథులతో నిమిత్తాలను కల్పించుకుని వున్నవి.

దేనికి అది బలిష్ఠమైన, శరీరాన్నీ, అవయవాల్నీ, అనేక విధాలను శాసిస్తూ వున్న యీ సప్త గ్రంథుల్నీ కూడా, తన అధీనంలో వుంచుకుని, తనలో యిమిడి వున్న అనేక శక్తుల్ని అనేక విధాలుగా ఉపయోగిస్తూ, యీ సప్తగ్రంథుల్నీ, తన పరిపాలనకు లొంగుబాటు చేసి, వాటిని దిద్ది తీర్చి నడిపించే, ప్రధాని పిట్యూటరీ గ్రంథి - Pituitory Gland -. ఈ పిట్యూటరీ వుండే స్థానం కూడ దాని ప్రాధాన్యతకు తగినదే. ఇది సరిగ్గా, మెదడు కిందిభాగంలో, మధ్య ప్రదేశంలో, చుట్టూ కోటవలె రక్షణను యేర్పాటుచేసి వున్న ఒక యెముకలో, తన ఆస్థానాన్ని యేర్పాటు చేసుకున్నది. ఈ ఆస్థానం నుంచి, యీ ప్రధాని, అన్ని గ్రంథులకూ తన ఆజ్ఞలను జారీచేస్తూ వుంటుంది. ఈ ప్రధాని ఆస్థానంలో అనేక హార్మోన్లు తయారవుతూ వుంటవి: ఈ హార్మోన్లలో వొక దానిని థైరాయిడ్ కూ, మరొక హార్మోన్‌ను పేరా - థైరాయిడ్ లకూ, ఇంకొక హార్మోన్‌ను సుప్రారీనల్ పైవరిభాగానికి, మరిరెండు హార్మోన్లను కామగ్రంథులకూ సరఫరాచేస్తూ, ఈ హార్మోన్లద్వారా, ఆ గ్రంథుల నన్నింటినీ, తన చెప్పు చేతలలో వుంచుకుని, నడిపిస్తూ, ప్రధాని పదవిని నిర్వహిస్తూ వున్నది పిట్యూటరీ గ్రంథి. ఈ గ్రంథినుంచి వెలువడే ఒక హార్మోన్ తల్లి, పాలిండ్లలో పాలను సృష్టిస్తుంది. పిట్యూటరీ శక్తులు చాలా విచిత్రమైనవి, అపారమైనవి. ఇన్ని శక్తుల్ని తనలో ఇముడ్చుకున్న యీ పిట్యూటరీ మొత్తం పరిమాణం అంతా వేరుశనగకాయ అంత. వేరుశనగకాయవలెనే

పిట్యూటరీ రెండు భాగాలుగా వుంటుంది. ఈ రెండు భాగాలూ – పురోభాగం, పృష్ఠభాగం – తమ వ్యక్తిత్వాన్ని నిలుపుకుంటూ వేరు వేరు పనులను నిర్వహిస్తూ వుంటవి.




1 పిట్యూటరీగ్రంథి - ఆకారం 2 పిట్యూటరీగ్రంథి - లోపలినిర్మాణం

పిట్యూటరీ పురోభాగం ప్రకోపిస్తే – Hypertrophy – అంటే ఉధృతంగా పనిచేస్తే – అనేక ప్రమాదాలు తటస్థించుతవి. ఈ ప్రకోపించడం పసితనంలో జరిగితే, యెముకలు విపరీతంగా పెరిగి, ఆ వ్యక్తి ఏడుఅడుగులు దాటి యెదిగి, భేతాళస్వరూపంగా తయారుకావడం తప్పదు. ఈ ప్రకోపించడం పసితనంలో కాక, కొంతవయస్సు దాటిన తరువాతను జరిగితే, ఆ వ్యక్తికి కాళ్ళూ, చేతులూ, బుగ్గయెముకలూ, దవడలూ విపరీతమైన వెడల్పుపొంది, వికృతఆకారం తయారవుతుంది. ఈ ప్రకోపించడం ఏ వయస్సులో జరిగినా కామవాంఛ విపరీతమౌతుంది. ఈ పురోభాగం వాడిలి నీరసపడితే – Atrophy –, కొన్ని ప్రమాదాలు కలుగుతవి.

ఈ వాడలడం పసితనంలో జరిగితే, యెముకలు సరిగా యెదగవు; మెదడూ, శరీరమూ కూడా, యెదుగుదల ఆగిపోయి పూర్తి వికాసాన్ని పొందవు; ఎనిమిదిసంవత్సరాల వయస్సుగల పసితనంలోనే, జ్ఞాపకశక్తిపోయి, తలవెంట్రుకలు వల్చబడి, చర్మం ముడతలుపడి, ముసలిరూపం తయారవుతుంది. ఈ వాడిలిపోవడం కొంత వయసుమీరినతరువాతను జరిగితే, శరీరంలో కొవ్వు విపరీతంగా పెరుగుతుంది; ఇంకా అనేక అనర్థకాలు కలుగుతవి.

పిట్యూటరీ పురోభాగంకన్న పృష్ఠభాగం మరీ శక్తివంతమైనది. రక్తంపోటునీ, అతిమూత్రాన్నీ కలిగించడంలో దీనికి సంబంధంవున్నది; యెముకలూ, అవయవాలూ వయస్సుకు తగినట్టుగా పెరగడంలో యీ భాగంకూడా సహాయపడుతుంది. యుక్తవయస్సు నాటికి బాలికకు సమర్తా, బాలుడుకి స్ఖలనమూ కలగడానికి యీ భాగం బాధ్యత వహిస్తుంది. యీ భాగం శక్తిహీనమైతే, బాలికకు సమర్తా, బాలుడికి స్ఖలనశక్తీ ఆపుదలఅయి, యుక్తవయస్సు ప్రయోజనాలు వాయిదాపడిపోతవి. వీటి అన్నింటికన్నా ముఖ్యమైన రెండు కార్యాలు యీ పృష్ఠభాగం అధీనంలో వున్నవి: ఒకటి, కామగ్రంథులు దీని అదుపుఆజ్ఞలకు లోబడివుంటవి; రెండు, ప్రసవసమయంలో, గర్భకోశ కండరాలకు వొత్తిడి కల్పించి, శిశువును బయటికి తోసివేయడానికి, దీనిలో తయారయ్యే ఒక హార్మోను చాలా సహాయపడుతుంది.

ఈ విధంగా శరీరమనే విచిత్ర నిర్మాణంలో నిగూఢంగా ముఖ్యస్థానాలలో నిక్షిప్తమైవుండి, సప్తగ్రంథులూ శరీరాన్ని అనేకవిధాలను శాసిస్తూ, కామగ్రంథుల కథావిధానానికి సహాయభూతమౌతూవున్నవి.

యౌవనారంభంనుంచి వృద్ధాప్యంవరకూ, ప్రతీవ్యక్తి చరిత్రా, చాలావరకూ కామగ్రంథులు నడిపించే నాటకంమీాదను ఆధారపడివుంటూవున్నది ; అందుచేతను, యెవరితోనైనా ఒకమాట ధీమాగా చెప్పవొచ్చును : "నీ కామం చరిత్ర యేమిటో చెప్పు, నీ చరిత్ర చెప్తాను" అని.

# కామవాంఛ

ఏ వాంఛకూ లేని తీవ్రతా, ఏ వాంఛా కల్పించలేని వొడిదుడుకూ, ఏ వాంఛా కప్పలేనంతగా కల్గుకప్పేశక్తీ, కామవాంఛలో యిమిడివుండడం వల్లనూ, ఈ కామవాంఛను తోసిపుచ్చి జీవించగలగడం సాధారణంగా దుస్సాధ్యంకావడం వల్లనూ; ఈ వాంఛ నిజస్వరూపాన్ని గ్రహించవలెననే యత్నంతో, అనాదికాలంనుంచీ నేటివరకూ, అనేక దేశాలలో ధీమంతులు కామవాంఛను గురించి అనేక విధాలుగా చర్చించారు. వీటిలో ముఖ్యమైన వాటిని కొన్నింటిని దిఙ్మాత్రంగా సూచించి తర్కించడం అవసరం.

1. "మురికి కాలవ మీదను నిర్మాణమైన దేవాలయం వంటిది స్త్రీ" అనీ; నీచమైన కామ వాంఛను ఆపుకోలేకనూ, స్త్రీ సంపర్కానికి లొంగిపోవడం వల్లనూ, కామానికి బానిసలుకావడం తటస్థిస్తుందనీ – పూర్వ కాలపువాదం ఒకటి వున్నది.

పురుషుడిలో కామాన్ని చెలరేగజేయుడానికి స్త్రీ యెంతకారణమో, స్త్రీలో కామాన్ని చెలరేగజేయుడానికి పురుషుడుకూడా అంత కారకుడే; కనుక, యీ సందర్భంలో, స్త్రీని ఏకైక కారణంగా నిర్ణయించడం

న్యాయంకాదు. అదీకాక, సుఖాలను త్యజించవలెను అనే దృష్టితో, భౌతికమైన సమస్తాన్నీ అసహ్యించుకునే విపరీత బైరాగివాదం యిది.

2. చూచుకం – అనగా చను మొన– పురుష అవయవం చివరను వుండే మణి వంటిది; చూచుకాన్ని ఆశించి, దానిని అందుకునే శిశువు పెదవులూ నోరూ, భగద్వారమూ యోనీ వంటివి; చనుగుడుపునకు పూర్వం స్తనాలలో కలిగే బిగువూ, పాలచేపుబాధా, రాగ కాలంలో రహస్య అవయవాలలో కలిగే స్తబ్ధతవంటివి, చను గుడుపు తదనంతరం స్త్రీకికలిగే సుఖమూ శాంతీ, రతి అంతరము కలిగే సుఖమూ, శాంతీ వంటివి; అని మరొకవాదం వున్నది.

ఈ వాదాన్నిగురించి తర్కిస్తూ, పోలికలుయుక్తియుక్తంగానూ, తర్కానికి తెలివిగానూ వున్నవి; కాని, రతిక్రీడలోనూ, భావప్రాప్తిలోనూ కలిగే ఆనందాన్నీ తన్మయత్వాన్నీ, చనుగుడుపుతో పోల్చడం సమంజసంకాదు; పారవశ్యసుఖంలో రెంటిమధ్యా చాలాభేదంవున్నది, అని ఖండిం చాడు హేవెలక్ ఎల్లిస్.

3. మిథునం, ప్రకృతి కల్పన, మిథునం, సృష్టికార్యాన్ని నిర్వహించి, సృష్టిని సాగించడానికే సంకల్పమైనది; అందుచేతను, మిథునం నిర్వహించే కార్యమైన మైథునం సంతానం నిమిత్తమే – ఇది కూడ ఒక పూర్వపువాదం.

సంతానం నిమిత్తం మైథునాన్ని ప్రకృతి కల్పించినది అన్ననాడు తగాదా లేదు; కాని, సంతాన వాంఛ మైథునవాంఛలో యిమిడివున్నదనిగాని, యిమిడివుండ వలెననిగాని, పై వాదానికి అర్థం చెప్పిననాడు, యీవాదం సబబు తప్పుతుంది. రతిచక్రం కదలిక ప్రారంభించి, ఉద్రేకంలోపడి, భావప్రాప్తి, తన్మయత, తాత్వికదశ,అనే వొళ్లు తెలియనితనంలో పారవశ్యం కలిగినప్పుడు, నాయికానాయకులు, మైకంలో పడి పోయే వేళలలో, అంతకుపూర్వం వున్న ఊహ, ఆ సమయంలో సహితం ఉన్నట్టు భావించడం పొరబాటు. కామవాంఛ కల్పించే శారీరకమైన వేగిరపాటుకు యితర వాంఛలతో నిమిత్తంలేదు. మరొక్కసంగతి : ఆడ - మగ కలయిక అక్కరలేకుండా సంతా నాన్ని కలిగించే అవకాశాలను యీనాడు శాస్త్రజ్ఞులు కల్పించారు : గాజుగొట్టంలో జాగ్రత్తపరిచిన పురుషబీజాన్ని యోనిలో ప్రవేశింపజేసి గర్భం కలిగించగలుగుతున్నారు, శాస్త్రజ్ఞులు. ఈ సంతానాన్ని 'టెస్ట్‌ట్యూబ్ బేబీస్' - Test - tube babies - అంటున్నారు. * కాని, ఇంత మాత్రాన దాంపత్యాలతో నిమిత్తంలేకుండాపోయి, మానవ చరిత్ర అంతా మారిపోతుంది అని నిర్ణయించడం సబబుకాదు.

---

* పశు సంపదను పెంచడంలో అనేకమైన యెద్దులతో నిమిత్తంలేకుండా; ఒక్కచోట ఎద్దు వీర్యాన్ని జాగ్రత్తపరిచి, యెదవొచ్చిన కాలంలో అనేక ఆవులకు వాటియోనిలో దానిని ప్రవేశింపజేసి, మందలను వృద్ధి పరుస్తున్నారు పాశ్చాత్యదేశాలలో. ఈ విధానాన్ని బాగా విరివిగా ఉపయోగిస్తూవున్నది నేటి రష్యాదేశం.

4. మోల్ అనే శాస్త్రజ్ఞుడి వాదం ఒకటి వున్నది; మోల్ అభిప్రాయంప్రకారం కామ వాంఛకు కారణాలు మూడు: 1. రాగకాలంలో రహస్య అవయవాలకు బిగువూ 'వొడిదుడుకూ సంప్రాప్తమై, మైథునంలో విసృష్టితో సడలింపూ శాంతీ కలగడం ఒక కారణమనీ; 2. స్పర్శా, ఆలింగనం, చుంబనం మొదలైన బాహ్యచేష్టల వల్లను కలిగే సుఖాన్ని ఆపేక్షించడం మరొక కారణమనీ; 3. ఈ సందర్భంలో నాయికానాయకులకు కలిగే అన్యోన్య ఆకర్షణకూడ యెంచదగిన కారణమే అనీ, మోల్ వాదం.

మోల్ వివరించిన మూడుకారణాలూ అంగీకరించదగినవైనా, వాటిని మోల్ విభాగించిన విధంగా విడదీయడానికి వీలు లేదనీ, ఏకకాలంలో కలిగే వీటిని విడదీసి వేరుపరచడం పొరబాటనీ ఆక్షేపణవున్నది, మోల్ వాదానికి.

5. సుప్రారీనల్, థైరాయిడ్, పిట్యూటరీ గ్రంథులనుంచి వెలువడే హార్మోన్లూ, కామ గ్రంథులలో తయారయ్యే హార్మోన్లూ, ఈ సందర్భంలో వెలువడే యితర ద్రవాలూ కలిసి కలిగించే తొందరపాటు కామ వాంఛకు కారణమనీ, మెదడు సహితం ఒక రసాయనశాల వంటిది కావడంవల్లను, ఈ హార్మోన్ల వేగిరపాటునుబట్టి మెదడు కూడా తన కార్యాన్ని తాను నెరవేర్చక తప్పదనీ – ఒక వాదం ఉన్నది.

ఈ హార్మోన్ల వాదంకూడా మోల్ వాదంవంటిదే. శారీరకమైన స్థితిని మాత్రం గుర్తించి, మనస్సునీ దాని శక్తుల్నీ అప్రధానం చేయడంవల్లను ఈ వాదాన్ని పూర్తిగా అంగీకరించడానికి వీలులేదు.

ఇంతవరకూ వివరించిన అయిదు వాదాలలోనూ, చివరి రెండువాదాలూ హేతుపూర్వకమైనవి; కాని, వీటిలోకూడా శరీరానికి సంబంధించిన కారణాలుమాత్రం విశదమయి, ముఖ్యమైన మనస్సును గురించిన భాగం లుప్తమయ్యింది. ఈ లోపానికి తగిన కారణాలు లేకపోలేదు. ఈ శతాబ్దం ప్రారంభంలో సిగ్మండ్ ఫ్రాయిడ్ అనే మనస్తత్వ పరిశోధకుడు, మనస్సును గురించి తెలియబరిచిన రహస్యాలు వెల్లడిఅయ్యేవరకూ, శాస్త్రజ్ఞులు మనస్సు ప్రాముఖ్యతను గ్రహించలేకపోయారు. సిగ్మండ్ ఫ్రాయిడ్ పరిశోధనలకు పూర్వం మనస్తత్వశాస్త్రం కేవలం ఊహాగానంగావుంటూ వొచ్చింది. ఫ్రాయిడ్‌కు పూర్వం, మేగ్డొగల్ అనే శాస్త్రజ్ఞుడు, అభ్యాసాలకీ ప్రవర్తనలకీ, మెదడకీవున్న సంబంధాలను సరిగ్గా నిర్ధారణచేసి, అప్పటికి మనస్తత్వశాస్త్రానికి ఒక కొత్త రూపాన్ని కలిగించాడు. కాని, మనస్సునుగురించి సరియైన నిర్ధారణ అప్పటికికూడా కలగలేదు.

సిగ్మండ్ ఫ్రాయిడ్ తన పరిశోధనలద్వారా తెలియబరిచిన నూతన రహస్యాలతోనూ, ఫ్రాయిడ్ నిర్ణయించిన కొన్ని కొత్తసూత్రాలతోనూ మనస్తత్వశాస్త్రం పూర్తిగామారిపోయింది. ఫ్రాయిడ్ తెలియ

బరిచిన రహస్యాలు యివి: ప్రాణం ప్రారంభించినది మొదలు ప్రాణంపోయేవరకూ, మెదడూ, తద్వారా మనస్సూ పనిచేస్తూనే వుంటవి, నిద్రలోకూడ. అందుచేతను మనస్సుస్థితులను మూడు భాగాలుగా యెంచవొచ్చును: ఇవి జాగృతి, సుషుప్తి, స్వప్న అవస్థలు. జాగ్రదవస్థలోకన్న, జాగృతి రెప్పవాల్చిన సమయంలో మనస్సు నిజస్వరూపం వెల్లడిఅవుతుంది; ఆస్థితులలో ప్రతివ్యక్తి మనస్సూ నిజస్వరూపాన్ని తాలుస్తుంది; ఈ నిజరూపాన్ని, ఏ వ్యక్తికి ఆవ్యక్తి గుర్తించడంకూడా కష్టం. అందుచేతను, స్వప్నాలనుబట్టి మనస్సు నిజస్వరూపాన్ని గ్రహించవొచ్చును. లేదా, జాగ్రదవస్థలోవుండే పూర్తిజాగ్రత్త కొంత సడలిన సమయాలలో పలికేపలుకులూ, చేసేచేష్టలూబట్టి కూడా, మనస్సు నిజస్వరూపాన్ని గ్రహించవొచ్చును, అని ఫ్రాయిడ్ తన అపూర్వపరిశోధనలద్వారా తెలియబరిచాడు. సాధారణంగా అవ్యక్తంగావుండే మనస్థితిని గ్రహించడంవల్లను అనేక రహస్యాలను గ్రహించడానికి అవకాశాలు యేర్పడినవి. ప్రకృతానికి మనకు ముఖ్యమైన విషయం ఒక్కటే: మనస్సులో కలిగే వ్యాకులపాటుల వల్లనూ, మనస్సుకు కలిగే ఆఘాతాల వల్లనూ, కొన్ని అంతర్గతఅవయవాలకు హానికలుగుతుంది. ముఖ్యంగా, ముందుగా చిక్కులోపడేది జీర్ణకోశం, తరువాతను నాడీమండలంకూడా దారితప్పుతుంది; ఈ విధంగా మనస్సు చిక్కులపాలైతే అవయవాలు కొన్ని చీకాకుపాలై, తద్వారా ఆరోగ్యంచెడుతుంది. మనస్సులో మార్పుకలిగించి, మనోబలాన్ని చేకూర్చి, మళ్లీ నిబ్బరపరిచిననాడు, ఆ రోగాలు నయమయి,

ఆరోగ్యం కుదుటపడుతుంది. ఫ్రాయిడ్ పరిశోధనలద్వారా యీ రహస్యాలుకొన్ని నిర్ధారణ అయినవి. ఈ సిద్ధాంతాలను అనుసరించి నేటి పాశ్చాత్య పరిశోధకులు ఒక నిర్ణయానికి రాగలుగుతున్నారు; మానవతత్వం, మనశ్శరీరసమ్మిళితం - Psycho - somatic system - అని. ఈ సిద్ధాంతరీత్యా, నేటి వైద్యులు రోగ నిర్ణయంలోనూ, చికిత్సాకాండలోనూ కూడా, శరీరస్థితితోపాటు, మనస్తత్వాన్నికూడా ప్రధానంగా యెంచుతున్నారు.

మనస్సుకీ శరీరానికీవున్న సంబంధాన్నివూర్తిగా తెలిసికోవలెనంటే, మనస్సు యేమిటో తెలుసుకోవాలి. ఈప్రశ్నకు జవాబుకావాలి అంటే, ముందుగా మెదడుకీ శరీరానికీవున్న అవినాభావసంబంధాన్నీ, శరీరనిర్మాణంలో ఇమిడివున్న కొన్నిరహస్యాలనీ వివరంగా తెలిసికోవాలి; అప్పుడు గాని, ఇంద్రియాలకీ మనస్సుకీ వున్న సంబంధం అర్థం కాదు. ఈరహస్యం అవగాహన అయితేనే గాని, కోరికకీ, ఇంద్రియాలకీ వున్న సంబంధమూ, కామవాంఛ నిజస్వరూపమూ సుబోధకం కావు.



పిండం పైభాగంలో : 1 గొయ్యి ప్రారంభం 2 గొట్టం యేర్పాటు

శరీరనిర్మాణంలో ముఖ్యాంశా లను తెలుసుకోవలెనంటే, పిండం యేర్పాటు అయ్యే ప్రారంభ దశలో జరిగే కొన్ని రహస్యాలను తెలుసుకోవాలి. పురుషుడి నుంచి వెలువడిన శుక్ల అణువు, స్త్రీ నుంచి వెలువడిన శోణిత అణువులో చేరగానే, గుండ్రంగావున్న శోణితఅణువు శుక్ల అణువును తనలో యిముడ్చుకుని, గుండ్రంగా బంతివలె తయా రవుతుంది. పిండానికి ప్రారంభదశ యిది. ఇతర మార్పులు కలిగే ముందు, ఈ బంతి పైభాగంలో ఒకగొయ్యి ప్రారంభమై, ఆగొయ్యి లోతుగా, లోయవలె లోపలికి దిగి, ఈ లోయపై అంచులు రెండూ దగ్గరగాచేరి, మధ్యభాగం ఒక గొట్టంవలె యేర్పాటవుతుంది. ఈ విధంగా యేర్పాటయిన గొట్టం — Neural tube — పిండానికి ముఖ్యఆధారం. పిండం యెదిగి ఆకారం యేర్పాటుకావడంలో, యీ గొట్టం పైభాగం మెదడు గానూ, నిలువుభాగమంతా వెన్నెముకగానూ, ఈ వెన్నెముక నుంచి నరాలు వెలువడి అవి నాడీమండలానికి ఆధారంగానూ, యేర్పడి, శిశువు శరీరనిర్మాణం తయారవుతుంది. పిండదశలోనే, మెదడూ, వెన్నెముకా, నాడీ మండలమూ పరస్పరసంబంధా లతో యేర్పాటయినవి అని, దీనినిబట్టి విశదమౌతుంది.

పిండదశలోనే, మెదడు మూడు భాగాలుగా యేర్పడుతుంది. ఎదరనువున్న పురోభాగాన్ని సిరిబెల్లం — Cerebellum — అంటారు; మధ్యభాగాన్ని సిర్బ్రం — Cerebrum — అంటారు; కిందకు దిగజారిన అధోభాగాన్ని

మెడుల్లా - Medulla- అంటారు. అధోభాగమైన మెడుల్లా, మరీకిందకు దిగజారి, వెన్నెముక పైపూస మధ్య నుంచి వెన్నెముక పొడుగునావున్న పదార్థంతో సంబంధాన్ని కల్పిస్తుంది.




పిండదశలో మెదడు యేర్పాటు

1 సెరిబెల్లం 2 సెరిబ్రం 3 మెడుల్లా 4 వెన్నెముక ఆరంభం

మెదడు అంతటా కూడా, దాని పైభాగంలో, కొద్దిలోతు వరకూ వుండే భాగాన్ని, ఉపరిభాగం - Cortex - అంటారు. ఈ ఉపరిభాగంలో గ్రేమేటర్ - Grey - matter - అనే పదార్థం వుంటుంది. ఈ విధంగా మెదడు అంతటా ఉపరిభాగంలో వున్న గ్రేమేటర్, మెదడు వెన్నెముకను కలిసినచోట నుంచి వెన్నెముకలోనికి కూడా

ప్రవేశించి, వెన్నెముక నిలువునా, దానిమధ్య ప్రదేశమంతటా నిండివుంటుంది. ఈ గ్రేమేటర్ చాలా అమూల్యమైన పదార్థం. ఈ గ్రేమేటర్, మెదడుకీ వెన్నెముకకీ సంబంధాన్ని యేర్పాటు చేస్తూ వున్నది కనుక, దీని విలువను తెలుసుకోవలె నంటే, వెన్నెముక యేర్పాటుని కూడా తెలుసుకోవాలి.

వెన్నెముక, అంటే, ఒక యేకాండీ యెముక కాదు. వెన్నుపూసలు - Vertebrae - అనే, చిన్ని చిన్ని యెముకలు ఒకదానిమీదను వొకటిగా పేర్చివుండడం వల్లను, వెన్నెముక యేర్పాటుతుంది. ఈ వెన్ను పూసలు, వలయాకారంగావుండి, వాటిమధ్యభాగం ఖాళీగా వుండడంవల్లను, ఒకదానిమీదను వొకటిగా పేర్చిన వరలతో కూర్చిన నూతితో వెన్నెముకను పోల్చవొచ్చును. నూతిలో నీరువలె, వెన్నెముక మధ్యభాగంలో గ్రేమేటరూ, దానితో కలిసివుండే వైట్‌మేటరూ - White matter - నిండివుంటవి. వెన్నెముక, కటిప్రదేశం లోపలిభాగంలో మలద్వారానికి కొంచెం పైనుంచి బయలుదేరి, కపాలంవరకూ వ్యాపించి వుంటుంది. శిరస్సులో ముచ్చికగుంట పైభాగంలో, ఆఖరి వెన్నుపూసమీదను పుర్రె ఆని నిలిచినట్టు వుంటుంది.

ఈ విధంగా, కటిప్రదేశంలోపల నుంచి కపాలం వరకూ, వెన్నెముక వ్యాపించి వుండగా, దీని లోని వెన్నుపూసల మధ్యనుంచి, ఒక్కొక్క మజిలీలో, కొన్ని కొన్ని చొప్పున, నరాలు వెలువడుతూ వుంటవి. వెన్నెముక

మధ్యను ఇమిడివున్న గ్రేమేటర్‌తోనూ, వైట్‌మేటర్‌తోనూ యీ నరాలకు సంబంధం వున్నది. ఈ విధంగా, వెన్నెముక పొడుగునా, వెన్నుపూసలనుంచి వెలువడే నరాల మొత్తం, ముప్ఫైయొక్క జతలు. ఈ ముప్ఫైయొక్క జతల నరాలూ వెన్నెముక నుంచి బయలుదేరి, శరీరం అన్నిభాగాలకూ వ్యాపించి వుంటవి. ఈ నరాలు, శరీరానికి తగిలే, శీతోష్ణస్థితులనూ, స్పర్శనూ తెలియజేస్తూ వుంటవి. ఇదేవిధంగా, మెదడు అడుగుభాగం నుంచి పన్నెండు జతల నరాలు వెలువడుతవి; ఈ నరాలు, చూపు, శబ్దం, రుచి, వాసనలను తెలియజేస్తూ, కన్ను, చెవి, నాలుక, ముక్కులతో సంబంధాన్ని యేర్పాటు చేస్తూ వుంటవి. ఈ విధంగా వెన్నెముకా, మెదడూ సంబంధంతో యేర్పాటైన, నరాల మొత్తానికి, కేంద్రనాడీమండలం -- Central nervous system - అంటారు.

కేంద్ర నాడీమండలానికి సంబంధించి మరొక నాడీమండలం ఉన్నది: వెన్నుపూసల మధ్యనుంచి వెలువడేనాడులు, వెన్నుపూసల మధ్యనుంచి బైటికి రాగానే, వాటినుంచి సన్ననినరాలు కొన్ని గుత్తులు గుత్తులుగా బయలుదేరుతవి. అసలునాడులనుంచి గుత్తులు గుత్తులుగా వెన్నెముక పైనుంచి కింది భాగంవరకూ వెలువడిన, ఈ నరాల మొత్తాన్ని ఉపనాడీమండలం - Sympathetic-nervous system - అంటారు.

ఉపనాడీమండలం, అస్వాధీన అవయవాలతో * గ్రంథులతో, రక్తకూపాలతో కడుపులోని అవయవాలతో - Viscera - సంబంధం కలిగివుంటుంది. అందు చేతను, అంతర్గతంగావున్న అవయవాల మంచిచెడ్డల్ని, ఈ ఉప నాడీమండలం గుర్తిస్తూవుంటుంది. శరీరంలోకలిగే ఉద్రేకాలకు ఉపనాడిమండలం స్థానం. ఉద్రేక ఉత్సాహాలు, మెదడుకి సంబం ధించినవి కనుక, ఉపనాడీమండలానికి మెదడుతో సంబంధం యెక్కువ. అందుచేతను, ఉపనాడీమండలానికి సంబంధించిన కదలికలు, వెన్నెముక మధ్యనువున్న గ్రేమేటర్ ద్వారా మెద డుకు అందుతవి. మెదడు అడుగుభాగంలో ఒక నరాలకూడలి వున్నది; ఈ కూడలిని థలామస్ - Thalamus - అంటారు. ఉపనాడీమండలం నుంచి వొచ్చే కదలికలను అన్నింటినీ యీ కూడలి - థలామస్ - అందుకుని, వాటిని మెదడులోని గ్రేమే టర్‌లో, ఏభాగానికి వెళ్లవలసినవార్తను, ఆభాగినికి పంపుతుంది.

నాడీమండలం చాలా విచిత్ర మైన యేర్పాటు. శరీరం సుఖంగా వుండవలెనంటే, నాడీ మండలం ఆరోగ్యంగా వుండవలెను. ఇది బీరకాయపీచువలె శరీరమంతటా వ్యాపించివుండి, నిరంతరమూ పనిచేస్తూనే వుంటుంది. దీనినుంచి శరీరంలోపలికీ, మెదడూ వెన్నెముకా నుంచి అవయవాలకూ, శరీరంమొత్తానికీ, వార్తలు యెప్పుడూ

* అస్వాధీన అవయవాలు, అంటే, గుండెకాయ, ఊపిరితిత్తులు, క్లోమం, ప్లీహం, వృక్కలు, పేగులు మొదలైనవి.

పరిగెడుతూనే వుంటవి. నాడీమండలంలోని నరాలు, రెండు రకాలుగా వున్నవి. వీటిని జ్ఞాననాడులు - Sensory or afferent fibres - అనీ, కర్మనాడులు - Motor or efferent fibres - అనీ, వాటికార్యాలనుబట్టి రెండుగా విభజించారు. శరీరంనుంచీ, జ్ఞానేంద్రియాలనుంచీ, వెన్నెముకకూ, మెదడుకూ వెళ్ళేవార్తలన్నీ జ్ఞాననాడులద్వారా ప్రసరించుతవి. మెదడునుంచీ, వెన్నెముకనుంచీ, అవయవాలవేపూ శరీరంవేపూ వొచ్చే ఆజ్ఞలన్నీ, కర్మనాడుల ద్వారా ప్రసరించుతవి. జ్ఞాననాడులు శరీరస్థితిని వెన్నెముకకూ మెదడుకూ తెలియబరుస్తూ వుంటవి. ఏ స్థితిలో యే జాగ్రత్త అవసరమో ఆ జాగ్రత్తలకు తోడ్పడుతూ వుంటవి కర్మనాడులు. ఈ జ్ఞాన కర్మనాడుల కార్యక్రమం విశదంగా తెలియడానికి ఒక ఉదాహరణ అవసరం :

కాలిలో ముల్లు గుచ్చుకుపోతే, ముల్లు మొన చురుకు తగిలిన తక్షణం, ఆ భాగంలోని జ్ఞాననాడి కదిలి, యీ వార్తను, కాలిపొడుగునా వున్న పెద్దనరం ద్వారా, వెన్నెముకకు తెలియబరుస్తుంది; వెంటనే, వెన్నెముకలో, అదే ప్రదేశం నుంచి వెలువడే కర్మనాడి కదిలి, ముల్లు మొన తగిలిన కండరాన్ని ముడుచుకునేటట్టు చేస్తుంది; తక్షణం కాలు వెనకకు లాగుతుంది. ఈ విధంగా జరిగే కార్యాన్ని ఆకస్మిక కార్యం - Reflex action - అంటారు ఈ ఆకస్మిక కార్యాలు చాలావరకూ వెన్నెముక నుంచి వెలువడే కర్మ

నాడులే నిర్వహిస్తూ వుంటవి; అంటే వీటి సంగతిని వెన్నె ముక తనంతటను తాను సమర్ధించుకో గలదు. ఈ కార్యాలు మెదడుకు లీలగా తెలుస్తూ వుంటవి; కాని, యీ ఆకస్మిక కార్యాలలో మెదడు అంతగా కలుగ జేసుకోనక్కర లేదు. ప్రతీ కార్యమూ యీ విధంగా ఆకస్మికంగా జరగదు. మెదడు కలుగ జేసికోవలసిన కార్యాలు అనేకం వున్నవి. అందుచేతను, మెదడుకీ నాడీమండలానికీ యీ కార్యాలలో వున్న సంబం ధాన్ని తెలిసికోవలెనంటే మెదడును గురించిన కొన్ని వివ రాలు తెలియాలి :




మెదడులో స్థానాలు :

1 - 1 తెలివి స్థానం 2 - 2 కర్మనాడుల స్థానం 3 - 3 జ్ఞాన నాడుల స్థానం 4 - 4 కంటి చూపు స్థానం 5 - 5 చెవి, వినికిడి స్థానం 6 - 6 వాసనగ్రహింపు స్థానం 7 - 7 నాలుక, రుచి స్థానం.

నేటి శరీర - మనస్తత్వ పరిశోధకులు మెదడును గురించి యిదివరలో తెలియని రహస్యాలను అనేకాన్ని కనుక్కున్నారు. మెదడులో ఏయే భాగాలు ఏయే కార్యాలను నిర్వహిస్తూవున్నవో; మెదడులో ఏయే భాగాలు ఏయే అవయవాలకు సంబంధించివున్నవో; మెదడు అడుగుభాగంనుంచి వెలువడే నరాలు, వెన్నెముకలోని గ్రేమేటర్ ద్వారా అవయవాల్నీ, శరీరాన్నీ యేవిధంగా నడిపించగలుగుతూవున్నవో - మొదలైన రహస్యాలు అనేకం నేటి శాస్త్రవేత్తలకు అవగాహన అయినవి. మెదడుకీ, నాడీ మండలానికీ, మొత్తం శరీరానికీవుండే పూర్తి సంబంధాన్ని తెలియబరచవలెనంటే, ఒక ఉపమానం అవసరం.

మెదడు కేంద్ర - ఢిల్లీ - ప్రభుత్వం వంటిది. కేంద్రప్రభుత్వం నిర్వహణ యేమిటంటే : దేశంలో వున్న ప్రతీ రాష్ట్రప్రభుత్వంలోనూ, రాష్ట్ర ప్రభుత్వశాఖల లోనూ- అనగా దేశమంతటావున్న అన్ని ప్రభుత్వాలలోనూ- ప్రభుత్వనిర్వహణలు యేవిధంగా జరుగుతూవున్నవో కేంద్ర ప్రభుత్వం గుర్తిస్తూవుంటుంది. ఇందునిమిత్తం కేంద్రప్రభుత్వంలో అనేకశాఖలు వుంటవి; యీ శాఖలు రాష్ట్రప్రభుత్వాల మంచి చెడ్డలను కనుక్కొంటూవుంటవి. రాష్ట్ర ప్రభుత్వాలు యథావిధిని జరుగుతూవున్ననాడు కేంద్ర ప్రభుత్వం యేమీ కలుగజేసుకోదు; కాని, రాష్ట్రాలలో ఎక్కడ ఏ చిక్కు వొచ్చినా, వాటికి ఏసలహాగాని, సహాయంగాని, అవసరమైనా

కేంద్రప్రభుత్వం కలుగజేసుకుంటుంది. రాష్ట్రాలకు సంబంధించిన శాఖలు కేంద్రంలో వుంటవి; ఈ శాఖలను అన్నింటినీ ఒక విధానానికి సరిదిద్దుతూ నడిపించే మంత్రాంగం కూడా వొకటి కేంద్రంలో వుంటుంది. ఈ మంత్రాంగం నిర్ణయాలనుబట్టి ప్రభుత్వం నిర్వహణ అవుతుంది. మెదడు కేంద్ర ప్రభుత్వం వంటిది; వివిధ అవయవాలూ, అంగాలూ రాష్ట్రాలవంటివి; రాష్ట్రాలలో వొకదానితో వొకదానికీ, అన్ని రాష్ట్రాలకూ కేంద్రానికీ ఉత్తరప్రత్యుత్తరాలను నడపడంలోనూ, ఆజ్ఞలనూ, సలహాలనూ తెలియబరచడంలోనూ, టెలిగ్రాం టెలిఫోన్ సంస్థలవలె, నాడీమండలం పనిచేస్తుంది. నాడులు వార్తాహారులు.

ఇప్పటికి క్లుప్తంగా విశదమైన విషయాలనుబట్టి, శరీరంఅనే విచిత్ర యంత్ర నిర్మాణమూ, దీనిలో, పనులు జరిగే విధానాలూ, కొంతవరకూ అవగాహన అయినవి. అయితే, ఇంతవరకూ తెలియబరిచిన విషయాలకూ కామవాంఛకూ సంబంధం యేమిటి? అంటే, శరీరనిర్మాణమూ, అది పనిచేసేవిధానమూ తెలిసిననాడుగాని, కామవాంఛను గురించిన రహస్యాలు తెలియవు కనుక, అవయవాలకీ, నాడీమండలానికీ, నాడీమండలానికీ మెదడుకీ వున్న సన్నిహితసంబంధాలను విశదంగా తెలియబరచడం తప్పనిసరి అయ్యింది. అయితే, ఇప్పటికిమాత్రం కామవాంఛను గురించి యేమి తేలింది? వాంఛ అంటే కోరికగదా! కోరిక అనగానే మనస్సూ, మనస్సువల్లను కోరిక కలగడమూ అని నమ్మకంగదా! మరి, ఈమనస్సు

యేమిటి, మనస్సుకీ మెదడుకీవున్న సంబంధం యేమిటి, మనస్సుకీ అవయవాలకీవున్న సంబంధం యేమిటి, అనే ప్రశ్నలు ఇంకా మిగిలిపోయినవి.

మెదడు ఉపరిభాగంలో - Cortex - గ్రే మేటర్ వున్నది. ఈ గ్రే మేటర్, ఎంత అమూల్యపదార్థమో, అంత విచిత్రపదార్థంకూడా. దీని శక్తులు అపారం. దీని విధానమంతా ఒకమాయ. అందుచేతను, ఈ గ్రే మేటర్ యెలాపనిచేస్తుందో తెలిసికోవలెనని, అనేకపరిశోధనలు జరిగినవి. ఈ పరిశోధనల మూలంగా ఒక్క రహస్యం మాత్రం బయటపడింది. ఈ గ్రేమేటర్‌లో గుంపులు గుంపులుగా అనేకమైన అతి సూక్ష్మరూపంగల నలుసులు- Nissil's Granules- వున్నవి. మెదడు తీవ్రంగా పనిచేస్తూ వున్నప్పుడు ఈ నలుసులు కరగిపోవడం ప్రారంభించి, మెదడు కొంతసేపు, తీవ్రంగా పని చేసేటప్పటికి, ఈ నలుసులు చాలావరకూ కరిగిపోతవి. ఈ నలుసులు యెక్కువగా కరిగిపోయేటప్పటికి, మెదడుకు అలసట కలుగుతుంది; ఇక తీవ్రంగా పనిచేయడానికి మెదడు పూనుకో లేదు. అంతకో, తీవ్రమైనపనిని ఆపుజేసి, మెదడుకు తగినంత విశ్రాంతిని కలిగిస్తే, మళ్లీ ఈ నలుసులు యేర్పాటై, ఆ తదనంతరం, మెదడు మళ్ళీ తీవ్రంగా పనిచేయడానికి తగిన అవకాశం యేర్పాటవుతుంది. నేటి పాశ్చాత్య పరిశోధకులు మెదడు పని చేయడాన్ని గురించి యింతవరకూ కనుక్కోగలిగారు. ఈ పరిశోధనల ఫలితంగా, మెదడు పనిచేయడం గురించి ఈ రహస్యం

మాత్రం తెలిసింది. అయితే, మనస్సు యేమిటి, అనే ప్రశ్నకు జవాబు మిగిలిపోయింది. ఈ ప్రశ్నకు జవాబు ఒక్కటే కనిపిస్తూవుంది : మెదడును పనిచేయించే ఒక అద్భుతశక్తి మనస్సు, అని·

మనస్సునుగురించి కొంతవరకూ

అయినా అవగాహనకు అవకాశాలు యేర్పడడం వల్లను, మనస్సు ఏ విధంగా పనిచేస్తుందో తెలుసుకోడం సులభమయ్యింది. కోరికలకు మనస్సు. అందుచేతను, ఇక కోరికలను గురించిన వివరాలనుకూడా తెలుసుకోవాలి. దీనికి ఒక ఉదారణ, తిండినిగురించి: ఆకలివల్లను భోజనవాంఛ కలగవొచ్చును; లేదా, రుచిగలపదార్థాలు దృష్టిని ఆకర్షించడం వల్లను వాంఛ కలగవొచ్చును; అటువంటి పదార్థాల సువాసన యిందుకు కారణం కావొచ్చును; ఒక్కొక్కప్పుడు యిదివరలో అనుభవించిన పదార్థాల జ్ఞప్తి కలగడంవల్లను మనస్సులో ఊహాలు పూరి, కోరిక కలగవచ్చును. ఈవిధంగా కోరిక అనేకవిధాలుగా ప్రారంభంకావచ్చును. ఏ విధంగా కలిగితేనేమి తిండికోరిక కలగగానే, నోరు ఊరుతుంది; అంటే నాలుకలోని లాలాగ్రంథులనుంచి ఊరే ద్రవం జీర్ణశక్తికి అవసరం కనుక, నాలుక తన పనిని తాను నెరవేర్చడానికి సిద్ధం కావడమన్నమాట; ఇంతతో జీర్ణకోశమూ, దానికి సంబంధించిన ఇతరకోశాలూ తమ ద్రవాలతో సిద్ధంకావడం తటస్థిస్తుంది. దీనినిబట్టి ఊహిస్తే, కోరిక కలగడం అంటే, శరీరంలోని అవయవాలు తమతమ పనులను నెరవేర్చడానికి సంసిద్ధంకావడం అని నిర్ధారణ అవుతుంది.

ఇక, కామవాంఛను గురించి :

కామవాంఛ కలగడానికి కారణాలు అనేకం కావొచ్చును; కామగ్రంథులలో ద్రవాలు నిండి వుండడంవల్లను, ఆ కోశాలలో కలిగేవొత్తిడి, యిందుకు సంబంధించిన వెన్నెముక నరాలకు కదలిక కలిగించగా, వెన్నెముకలోని గ్రేమేటర్ద్వారా యీ సంచలనం మెదడుకు తగిలి మనస్సుకు వ్యాకులపాటు ప్రారంభంకావొచ్చును; లేదా, మనస్సును యీ సందర్భంలో కలవరపరచగలిగే ఏ దృశ్యమో, ఏ సువాసనో, ఏ పలుకో, ఇటువంటి స్ఫురణయేదో కోరిక కదలడానికి కారణంకావొచ్చును; స్పర్శవల్లను అవయవాలలో సంచలనంకలిగి, యీవార్త జ్ఞాననాడులద్వారా మెదడువరకూ ప్రసరించి కోరికలను రేకెత్తించవొచ్చును; ఒక్కొక్కప్పుడు, పూర్వపు ఏ అనుభవాలో స్మృతికిరావడంవల్లకూడా వాంఛ కలగడం తటస్థించవొచ్చును. ఈ విధంగా వాంఛ కలగడానికి కారణాలు అనేకం. ఏ విధంగా అయితేనేమి, కామవాంఛ కలగగానే యేర్పడేస్థితి యేమిటంటే :

మనస్సులో సంచలనం కలగగానే, వెంటనే మెరుపువార్తలు శరీరానికి పరుగులుపెడతవి ; ఒక వార్త పిట్యూటరీ గ్రంథికి అందుతుంది ; పిట్యూటరీ అన్ని గ్రంథుల్నీ ఆయత్తం కమ్మంటుంది, ముఖ్యంగా సుప్రారీనల్ గ్రంథుల్నీ కామగ్రంథుల్నీ కదుపుతుంది; వెంటనే గ్రంథులు సంసిద్ధమై తమ తమ హార్మోన్లను రక్తప్రవాహంలోనికి

జోరుగా ప్రవహింపజేస్తవి; ఈ వార్త గుండెకాయకు అంద గానే, గుండెకాయ రక్తప్రవాహాన్ని అతి త్వరితంచేసి, ముఖ్యంగా రహస్య అవయవాలకు అవసరమైన రక్తాన్ని సర ఫరా చేస్తుంది; నాడీమండలానికి వార్త తెలియగానే, నాడు లలో ఒక విధమైన బిగువు కలిగి, తద్వారా అన్ని అవయ వాలూ, శరీరమంతా సునిశితమై ఒకవిధమైన బిగింపును పొందుతుంది - ఈస్థితినే రాగకాలం అంటారు - రాగకాలం సంప్రాప్తం కాగానే, స్త్రీలోని బార్థొలిన్ గ్రంథులూ, పురు షుడిలోని కూపర్ గ్రంథులూ సంసిద్ధమై, తమనుంచి జిగట ద్రవాలను ప్రవహింపజేస్తవి; అప్పుడు, 'సర్వం సంసిద్ధమేనా' అని, మనస్సు కనుక్కొని, పిట్యూటరీ గ్రంథికి జాగ్రత్తను తెలియబరుస్తుంది; పిట్యూటరీ 'నేను జాగరూకతతో వున్నాను' అని మనస్సుకు అభయంఇచ్చి, తన అధీనంలో వున్న గ్రంథులనన్నింటినీ హెచ్చరించి, వాటిని కనిపెడుతూ, 'సిద్ధం' అని మనస్సుకు తెలియబరుస్తుంది; అంతట మనస్సు 'సరే' అని అనుజ్ఞను యిస్తుంది.

రతిచక్రం కదలిక ప్రారంభమౌతుంది.

# సాధన

ప్రపంచకాన్ని జాగ్రత్తగా పరిశీలించిచూస్తే, ఒకసత్యం అందరికీ అవగాహన అవుతుంది : సృష్టి వైవిధ్యాన్ని కోరుతుంది, అని. ఆకారంలోనేకాదు, స్వభావంలోనేకాదు, మనస్తత్వంలోనేకాదు, ప్రతీచిన్న హాంశంలోనూ, ప్రపంచకంలోని యిన్నికోట్లజనంలోనూ, వ్యక్తికీ వ్యక్తికీ మధ్యను వ్యత్యాసాలువున్నట్టు సులభంగా గ్రహించవొచ్చును. దీనినిబట్టియోచిస్తే, మానవకోటి అంతలోనూ కూడ, వ్యక్తులలో భిన్నత్వం తప్పనిసరిగా వుంటూ వున్నప్పుడు, దాంపత్యం సుఖవంతంగా వుండడమనే అపేక్ష, యెండమావులలో దప్పి తీర్చుకోడంవంటిదేనా అని సందేహం కలగకమానదు.

సందేహానికి అగత్యంలేకపోలేదు కాని, ఈ సందేహం నిస్పృహకు కారణంమాత్రం కానక్కరలేదు. దంపతులమధ్యను సహితం వ్యత్యాసాలు వుండడం సహజం అని భార్యాభర్తలు గ్రహించి, ఆ వ్యత్యాసాలవల్లను ప్రతిబంధకాలు యేర్పడకుండా, ఒకరియందు వొకరు సానుభూతితో, తమలోని భిన్నత్వాలను అప్రధానం చేసుకుని, ఏకత్వానికి అనుగుణమైన లక్షణాలనూ, లక్ష్యాలనూ, పెంపొందించుకోడంలో, దాంపత్యాన్ని ఒకసాధనగా భావించగలిగిన

నాడు, నిస్పృహకు అగత్యం వుండదు సరేగదా, దాంపత్య జీవనంలో ఆకర్షణకూడా యేర్పాటవుతుంది. భిన్న ప్రకృతుల మధ్యను ఆకర్షణ యెక్కువ అని శాస్త్రం నిర్ణయిస్తూవుంది. అందుచేతను, సరియైన సాధనవున్ననాడు, దంపతులమధ్యను వున్న భేదాలు, వైపరీత్యాలకు తావునియ్యవు సరేకదా, ఆకర్షణకు కారణభూతమౌతవి కూడా.

ఈ సందర్భంలో గ్రహించదగిన రహస్యం మరొకటి కూడా ఉన్నది : మానవతత్వం మనశ్శరీర సమ్మిళితం కావడంవల్లను, మనస్సు సాధించిన ఆనందం, శరీరానికి ఆరోగ్యాన్నీ పుష్టినీ కలిగించగలిగినట్టుగానే, శారీరకంగా కలిగే తృప్తి మనస్సుకి గ్రాంతినీ శాంతినీ కల్పించగలుగుతుంది. అందుచేతను, మనస్సుకి తృప్తి కలిగినా, శరీరానికి తృప్తి కలిగినా, ఒకదానివల్లను వొకటి శాంతిని సాధించడం తటస్థిస్తుంది.

ఈ రహస్యాన్ని గ్రహించే కాబోలును, దాంపత్యజీవితంలో, ముందు శారీరకంగానూ, తరువాత మానసికంగానూ అసంతృప్తికి కారణమైన ఒక ముఖ్య హంశాన్ని గుర్తించి, పూర్వ శాస్త్రవేత్తలు, సమపృష్ఠాన్ని సాధించిన దంపతులు ధన్యులు, అని నిర్వచించి; తత్వాలలో భేదాలు వున్ననాడు సమపృష్ఠాన్ని కల్పించే మార్గాలను కూడా సూచించారు. అంతేకాదు, అన్యోన్య సహకారంతో అభ్యంతరాలను సాధించగలిగిననాడు, ఆ సహకారం యెక్కువ మక్కువను కలిగించడం సహజం కూడా.

అందుచేతను, దాంపత్యజీవనంలో సాధించగలిగిన రహస్యాలు యేమిటి; ఇంత ప్రాముఖ్యతను పొందిన సమపృష్ఠం యేమిటి; దీనిని సాధించే మార్గాలు యేమిటి?

నాయికానాయకులు, ఏక కాలంలో ఉద్రేకశిఖరాన్ని అందుకుని, యిద్దరికీ భావప్రాప్తి సమకాలంలో కలిగి, యిరువురూ ఒకేసారి అద్వైతానందంలో పరవశత్వాన్ని పొందగలిగితే, దానిని 'సమపృష్ఠం' అనీ, 'సమరతి' అనీ అన్నారు. సమరతిని సాధించగలిగిన నాయికా నాయకులకు అన్యోన్యత అపరిమితమని శాస్త్రం. సమపృష్ఠం కలగడం సామాన్యం కాదా, భార్యా భర్తలకు భావప్రాప్తి సహజంగా ఏకకాలంలో కలగదా, అని అనుమానం కలగ వొచ్చును. ఈ సందర్భాన్ని గురించి హేమిల్‌టన్ అనే ఆయన దాంపత్యజీవితంలోని కష్టాలను గురించి ప్రత్యేకపరిశోధన చేస్తూ, చాలామంది దంపతులను ప్రశ్నించాడు: "మీకు సమకాలంలో భావప్రాప్తి కలుగుతూ వున్నదా" అని. ఈ విధంగా నూరుగురు భర్తలను ప్రశ్నిస్తే, యాభైయైదుగురు, భార్యకు భావప్రాప్తి కలగకముందే, తమకు బిందుపతనం అవుతూ వున్నది, అని తెలియబరిచారు. ఇదేవిధంగా, నూరు గురు భార్యలను ప్రశ్నించగా, వారిలో నలభైయెనమందుగురు భార్యలు, తమకు భావప్రాప్తి కలగకుండానే భర్తలకు బిందు పతన మౌతుంది అని జవాబు నిచ్చారు. నూరుగురిలో ముప్పై ముగ్గురు భార్యలు మాత్రం సమకాలంలో భావప్రాప్తి కలు

గుతూవున్నది అని తెలియజేశారు. అందుచేతను, ఈ సమవృత్తాన్ని సాధించడానికి అభ్యంతరాలు యేమి వున్నవి; ఈ అభ్యంతరాలు కలగకుండావుండడానికి శాస్త్రజ్ఞులు యే విధమైన సలహాలను యిచ్చారు; మొదలైన సంగతులను తెలిసికోవలెనంటే, ముందుగా నాయికానాయకులను గురించిన కొన్ని విషయాలను గ్రహించడం అవసరం.

"శశో వృషోఽశ్వ ఇతి లింగతో నాయక విశేషాః" అనగా, లింగం పరిమాణంలోవుండే, తేడాలనుబట్టి నాయకులు శశ, వృషభ, అశ్వ, అని మూడుజాతులు. ఈవిధంగానే, "నాయికా పునర్మృగీ బడబా హస్తినీ చేతి" అనగా నాయికలుకూడా, యోని లోతులనుబట్టి మృగీ, బడబా, హస్తినీ అని మూడుజాతులు అని వాత్స్యాయనుడు నిర్ణయించాడు. ఈ సంగతినిగురించి పాశ్చాత్య శాస్త్రజ్ఞులు కూడా చర్చిస్తూ; యూదు జాతిలో స్త్రీలకూ పురుషులకూ కూడా రహస్యఅవయవాల పరిమాణం చాలా విశేషం అని తెలియబరిచారు. వ్యక్తులలో కొద్దిగొప్ప భేదాలు వుండడమే కాక, జాతులనుబట్టి తేడాలు వున్నవని హేవెలక్ ఎల్లిస్ అంగీకరించాడు. దేశాలనుబట్టి నిర్ణయమయ్యే జాతులలో భేదాలు వుండడమేకాక, సామాన్యంగా ఏకజాతిలో సహితం, మనిషికీ మనిషికీ భేదం ఇతర అవయవాలలో వున్నట్టుగానే, రహస్యఅవయవాలలో కూడా తేడాలు వున్నవనీ, ఈ తేడాలనుబట్టి నిర్ణయిస్తే, స్త్రీలూ పురుషులూ, మూడేసిజాతులుగా విభజన అవుతారనీ, వాత్స్యాయనుడు తెలియబరిచాడు.

ఈ విధంగా నాయికానాయకు లను మూడేసి జాతులనుగా విడదీస్తూ, "తత్ర సదృశ సంప్రయోగే సమరతాని త్రీణి ' అనగా, ఏజాతికి ఆజాతితో సంయోగం కలిగినప్పుడు, సమరతాలు కలిగేఅవకాశాలు వున్నవని తెలియబరిచాడు. ఈ విధంగా తెలియబరుస్తూ, సమరతికి వుండే ప్రతిబంధకాలనుకూడా తేటతెల్లంచేశాడు: "యస్య సంప్రయోగకాలే, ప్రీతిరుదాసీనా వీర్య మల్పం క్షతానిచ న సహతే స మందవేగః" అనగా, ఎవరికి సంయోకాలంలో కోరిక స్వల్పంగానూ, వీర్యం అల్పంగానూ వుండి, క్షతాన్ని - దెబ్బను - సహించే శక్తితక్కువగా వుంటుందో, వారు, మందవేగులు అనీ; "తద్విపర్యయే మధ్యమ చండవేగా భవతః" అనగా, పై సూత్రంలో వివరించిన మందవేగులకు తేడాగా, మధ్యవేగులూ, చండవేగులూ వుంటారనీ, "తథా నాయికా పి" అనగా, నాయకులవలెనే నాయికలుకూడ, మూడువిధాలుగా వుంటారనీ, నిశ్చయించాడు.

జాతి భేదాన్నిబట్టీ, కాలపరిమితితో కూడిన వేగాన్నిబట్టీ, సమరతికి కలిగే ప్రతిబంధకాలకు తోడు, మరొక చిక్కుకూడా వున్నదని, వాత్స్యాయనుడికి పూర్వులైన ఔద్దాలకీ, బాభ్రవ్యుడూ, గుర్తించి, ఆ సంగతిని విపులంగా తర్కించారు. ఈ చిక్కు, భావప్రాప్తికి సంబంధించినది: రతిచక్రం కదలిక ప్రారంభించి, ఉద్రేకశిఖరాన్ని చేరగానే, విసృష్టితో, అనగా బిందుపతనంతో - సంప్రాప్తమయ్యే సుఖ

స్థితిని 'భావప్రాప్తి' అంటారు. భావప్రాప్తితో యికచాలును అనే తృప్తి కలుగుతుంది.

ఈ భావప్రాప్తి, స్త్రీకి వున్నదా లేదా, అనే సమస్యను పరిష్కారం చేయడంలో శాస్త్ర ప్రణేతల మధ్యను పూర్వకాలంలో, చాలావాదాలు జరిగినవి. స్ఖలనంకాగానే- బిందుపతనంతో- పురుషుడికి భావప్రాప్తి కలుగుతుంది, లింగం మొదలులో, దాని అడుగుభాగంలోవున్న స్ఖలన కండరం, బిందు పతనసమయంలో కొట్టుకోడంవల్లను * ఒక సుఖం కలుగుతుంది, అదే సమయంలో బిందుపతనం తెలుస్తుంది, పురుషుడికి. ఈ విధమైన బిందుపతనం స్త్రీకి వున్నదా; బిందు పతనం లేకపోతే, స్త్రీకి భావప్రాప్తి యెలా కలుగుతుంది; స్త్రీకి భావప్రాప్తి అనే స్థితి లేనేలేదా; భావప్రాప్తి లేనినాడు స్త్రీకి సంతృప్తి యెలా కలుగుతూవున్నది ? ఇవీ సమస్యలు. ఈ తీక్ష్ణ సమస్యలను గురించి వాత్స్యాయనుడికి పూర్వం బాభ్రవ్యుడూ, ఔద్దాలకీ కూడా తర్కించి, తమతమ మతాలను నిర్ణయించారు. ఈ పూర్వులమతాలనూ, వారి వాదనలనూ, వాత్స్యాయనుడు సమగ్రంగా తర్కించి సరియైన నిర్ణయానికి రాగలిగాడు.

"న స్త్రీ పురుషవదేవ భావమధిగచ్ఛతి" అనగా, పురుషుడు ఏవిధంగా విసృష్టి వలన సుఖాన్ని అనుభవిస్తున్నాడో, ఆ విధంగా విసృష్టివల్లను కలిగే

---

* స్ఖలనమయ్యే సమయంలో ఆభాగంలో వేలువుంచి చూస్తే ఈ కండరం కొట్లాట తెలుస్తుంది.

భావప్రాప్తిని, స్త్రీ యెరగదు; అయితే, భావప్రాప్తితో కూడిన సుఖం లేనినాడు, స్త్రీ సంగమాన్ని యెందుకు అభిలషిస్తుంది, అంటే : " సాతత్యాత్త్వస్యాః పురుషేణ కండూతి రనుపద్యతే" అనగా, రాగకాలంలో స్త్రీకి కలిగే కండూతి - దురద - పురుషుడివల్లను తీరుతుంది; అని ఔద్దాలకి మహర్షి మతం. "సా తత్వాఽ ద్యువతి రారంభాత్ప్రభృతి భావ మధిగచ్ఛతి, పురుషః పునరంత ఏవ" అనగా, స్త్రీ, రతి ఆరంభంనుంచి కూడా, భావాన్ని పొందుతుంది, పురుషుడు, అంతంలో విసృష్టితో భావాన్ని పొందుతున్నాడు, అని బాభ్రవ్యుడి మతం.

తన పూర్వులైన బాభ్రవ్య ఔద్దాలకుల యీ వాదాలను విమర్శిస్తూ, వాత్స్యాయనుడు, ఒక సబబైన ప్రశ్నను వేశాడు : ఈ మతాలను అంగీకరిస్తే, స్త్రీ పురుషుణ్ణి కోరవలసిన అవసరం యేమిటి; ఆమె, అపద్రవ్యాలతో * తృప్తిని పొందరాదా ? అన్నాడు. ఈ ప్రశ్నకు తానే ఒక జవాబునుకూడా యిచ్చాడు, యీ విధంగా : "సా పునరాభిమానికేన సుఖేన సంస్పృష్టా రసాంతరం జనయతి" అనగా, స్త్రీ, అభిమానిక సుఖాన్ని పొందుతూ, - అభిమానిక సుఖం, అనగా, పురుషుడివల్లను కలిగే చుంబనం, ఆలింగనం, ప్రహణనం మొదలైన కర్మలు - ఈ అభిమానిక సుఖంవల్లను

---

* అపద్రవ్యాలు, అంటే, రతికార్యానికి ఉపయోగపడే కృత్రిమ సాధనాలు అని అర్థం. పూర్వకాలంలో ఇందుకు ఉపయోగించే ఆ వస్తువులు యేమిటో తెలియడంలేదు. ఈ ప్రశంస వాత్స్యాయనుడి 297 మాత్రంలో వున్నది.

కలిగే ఉద్రేకంవల్లను, చివరకు ఉద్రేకం దిగజారడంలో, సంస్పృష్టి వంటి సుఖాన్ని పొందవచ్చును, అని కూడా అంగీకరించాడు, వాత్స్యాయనుడు. కాని, ఈ జవాబు కూడా చాలదు, అని చాలా విపులంగా తర్కించి, యీ వాదనలలోని లోపాలను వ్యక్తపరిచి, చివరకు, తాను ఈ విధంగా నిర్ణయించాడు: "సురతాంతే సుఖం పుంసాం స్త్రీణాం తు సతతం సుఖం ధాతుక్షయ నిమిత్తాచ విరామేచ్ఛోపజాయతే" అనగా, పురుషుడికి, రతి అంతంలో బిందుపతనంతో సుఖం కలుగుతుంది; స్త్రీకి, సురతం ఆరంభం నుంచీ, మన్మధక్రీడ జరుగుతూ వున్నంతసేపూ కూడా సుఖం కలుగుతూనే వుంటుంది; ధాతు క్షయం కావడం అనే కారణం వల్లను, విరామేచ్ఛ - అనగా, ఇక చాలును అనే తృప్తి - స్త్రీకి కలుగుతుంది; "తస్మాత్పురుషవదేవ యోషితోఽపి రసవ్యక్తి ర్ద్రిష్టవ్యా" అనగా, పైన వివరించిన విధంగా, సురతం ఆరంభంనుంచీ, స్త్రీ, సుఖాన్ని పొందుతూ, రతిలో సహితం ద్రవాలు దిగజారుతూ, ఆ ద్రవాలు దిగజారడం పూర్తికావడంతో, రసవ్యక్తి, అనగా భావప్రాప్తి పొందుతుంది, అని వాత్స్యాయనుడి మతం.

పాశ్చాత్య శాస్త్రజ్ఞులలో, స్త్రీకి భావప్రాప్తి వున్నదా లేదా, అనే సంగతిని కొందరుమాత్రం చర్చించారు. వారిలోకూడా అభిప్రాయభేదాలు కలిగినవి. చివరకు నేటి పాశ్చాత్యశాస్త్రవేత్తలు కూడా వాత్స్యాయనుడి నిర్ణయానికి సరిపోయే సిద్ధాంతాన్నే అంగీకరించారు.

ఈ సమస్యను విపులంగా తర్కించి, శరీరశాస్త్రరీత్యా సరియైన జవాబును యిచ్చినవాడు, వాన్ డి వెల్డ్ అనే శాస్త్రవేత్త, —వాన్ డి వెల్డ్, కామశాస్త్రాన్ని గురించి ప్రత్యేక కృషిచేసి, నేటి పాశ్చాత్య శాస్త్రజ్ఞులలో అధికార ముద్రను ఆర్జించాడు— స్త్రీకి భావప్రాప్తి యెలా కలుగుతుంది, అనే ప్రశ్నకు, ఆయన జవాబు యిది: స్త్రీ రహస్యఅవయవంలో గర్భకంఠంలో అనేకమైన చిన్న చిన్న గ్రంథులు వున్నవి; ఈ గ్రంథులనుంచి నిరంతరమూ ద్రవం ఊరుతూవుంటుంది; దీనికితోడు, రాగ కాలంలో, యోని లోపలిపొరలనుంచి ద్రవం ప్రవహించడం ప్రారంభిస్తుంది; కామవాంఛ కలగగానే, యోనిలోని బార్థొలిన్ గ్రంథులనుంచి జిగటద్రవం స్రవించడం తటస్థిస్తుంది; ఈ విధంగా సురతంలో ద్రవాలు ఊరుతూ, కొంతసేపటికి కలిగే ఉద్రేకంలో యీస్రవించడం పూర్తిఅయి, స్త్రీకి భావ ప్రాప్తి కలిగి, తృప్తి యేర్పడుతుంది; అని నిశ్చయించేశాడు, వాన్ డి వెల్డ్. ధాతుక్షయంవల్లను స్త్రీకి విరామేచ్ఛ కలుగుతుంది, అని పూర్వకాలంలో వాత్స్యాయనుడు చేసిన సిద్ధాంతాన్ని, ఈనాటి వాన్ డి వెల్ట్ నిర్ణయం బలపరుస్తూవుంది.

ఈ సందర్భంలో వాన్ డి వెల్డ్ తెలియబరిచిన రహస్యాలనుబట్టి గ్రహిస్తే, రతికి సంసిద్ధం కావడంలోనూ, ఉద్రేకశిఖరాన్ని అందడంలోనూ, పురుషుడికన్న స్త్రీకి యెక్కువ వ్యవధి వుండడం సహజమని వ్యక్తమౌతుంది. అందుచేతను, సంసిద్ధంకావడంలోనూ, ఉద్రేకశిఖరాన్ని అందడంలోనూ కూడా, స్త్రీకి, ఆలస్యమనేదివుండడం సహజమైన

నాడు, యీ రెండు సందర్భాలలోనూ పురుషుడు ఏయే జాగ్రత్తలను అవలంబించడం అవసరం అనేసంగతులను కూడా శాస్త్రజ్ఞులు తెలియబరిచారు. స్త్రీ సంసిద్ధంకావడానికి ఆమె రహస్యఇంద్రియంలోని గ్రంథులు ద్రవించడమేకాక, భగలింగం లేపనాన్ని పొంది, ఉద్రేకానికి ప్రయోజనకారి కావాలికూడా. అప్పటికిగాని యోనిక్లేదనం – క్లేదనం, అంటే తడికావడం – జరగదు. ఈ క్లేదనం జరగకుండా పురుషుడు తొందరపడితే స్త్రీకి కష్టంకలుగుతుంది. ఈ కారణంవల్లను స్త్రీని సిద్ధంఅయ్యేటట్టుచేయడానికి కొన్ని మార్గాలువున్నవి :

1. ఆలింగన చుంబనాది ప్రక్రియలద్వారానూ, కళాస్థానాలలో కదలికలు కలిగించడంవల్లనూ స్త్రీకి ఉద్రేకాన్ని కల్పించడమేకాక, పురుష అవయవాన్ని ప్రవేశింపజేయడం స్త్రీకే విడిచిపెట్టడం ఉత్తమం, అని, హెలీనా రైట్ సలహా.

2. పురుషుడు, తన వేళ్లతో భగలింగాన్ని కదుపుతూ, యోనిక్లేదనం జరిగినదీలేనిదీ తడిమిచూసి, తరువాతను ఉపక్రమించవలెను, అని, లియునోరా ఐల్స్ అభిప్రాయం.

3. పురుషుడు తన అవయవాన్ని చేతితోపట్టి, మణిభాగంతో, భగద్వారంనుంచి భగలింగం వరకూ రాపాడిస్తూ, స్త్రీకి ఉద్రేకాన్ని కల్పించ

వొచ్చును, అని అంటూ, ఈ విధమైన రాపాడింపును 'జంత్ర' అనీ, 'యంత్ర' అనీ నామకరణంచేశాడు, వాత్స్యాయనుడు. ఈ 'యంత్ర'ను జరిగించడంలో మోటతనం పనికిరాదనీ, సున్నితంగా, పైన తగిలీతగలనట్టుగా రాపాడించడంలో సుఖం యెక్కువ వున్నదనీ వాన్ డీ వెల్డ్ ఉద్దేశం.

పై విధానాలలో యేదో వొక పద్ధతిని అనుసరించి, యోనిక్లేదనాన్ని కల్పించి, తరువాతను ఉపక్రమించి కూడా, సమపృష్టాన్ని సాధించలేకపోవొచ్చును, పురుషుడు. తత్వాలలోవున్న భేదాలనుబట్టి సమపృష్టం సహజంగా కలగనినాడు, సమపృష్టాన్ని సాధించడానికి కూడా పద్ధతులను సూచించారు శాస్త్రవేత్తలు :

1. బిందుపతనం కావడం చాలా వరకూ మానసిక ఉద్రేకంమీదను ఆధారపడుతుంది, కనుక, పురుషుడు తనసుఖాన్ని మనసులో వుంచుకుని ఉపక్రమించి, త్వరలో తాను ఉద్రేకంలో పడడంకన్న, స్త్రీ మీదను దృష్టి నిలిపి, ఆమెకు ఉద్రేకాన్ని కల్పించి, ఆమెకు భావప్రాప్తి కలిగేటట్టు తొందరలు కల్పించడం ఒక మార్గం.

2. పురుషుడు, తన తొందర పాటును తగ్గించుకుని, సురతంలో, తనశరీరంతోగాని, వేళ్లతో గాని, భగలింగానికి రాపిడి కలిగించి, స్త్రీకి భావప్రాప్తిని కలిగించవొచ్చును. ఈ పద్ధతిని అవలంభించి, ఒక్కొకలయిక

లోనే స్త్రీకి రెండుసార్లు భావప్రాప్తిని కలిగించగలిగిన చతురులు వున్నారు, అని లియొనారా ఐల్స్ తెలియబరిచింది.

పైన వివరించిన విధానాలు, సమపృష్ఠం సహజంగా కలగక, తత్వాలలో భేదంవుండి, అసంతృప్తివుంటేనే అవలంభించవలసినవి; ఎందుచేతననగా, వేగాలలో భేదంవుండడానికి కొన్ని కారణాలు తాత్కాలికమైనవి కూడా వున్నవి: "ప్రథమరతే చండవేగతా శీఘ్రకాలతాచ పురుషస్య, తద్విపరీత ముత్తరేషు యోషితః పునరేతదేవ విపరీత మాధాతుక్షయాత్" అనగా, మొదటిరతిలో పురుషుడికి బిందుపతనం త్వరగా కలుగుతుంది, తరువాతి సంయోగాలలో పురుషుడుకి మధ్యవేగమూ, మందవేగమూ, సహజంగానే యేర్పడుతుంది. స్త్రీ తత్వం యిందుకు పూర్తిగావ్యతిరేకం. ఆమెకు, మొదటిరతిలో భావప్రాప్తి ఆలస్యంగా అవుతుంది; తరువాత, రతులు హెచ్చినకొలదీ, భావప్రాప్తి తొందర తొందరలో కలుగుతుంది.

ఈ భావప్రాప్తిని గురించి, యింతగా చర్చించడానికి తగిన కారణాలను వాత్స్యాయనుడు తెలియబరిచాడు: "తాస్త్వనధిగత విశ్వాసైః ప్రసభ ముపక్రమ్యమాణా స్సంప్రయోగద్వేషిణ్యో భవంతి" అనగా, స్త్రీ అనుకూలురాలు కాకుండానే, పురుషుడు తొందరపాటుతో మోటతనంచేస్తే, ఆమె సంగమాన్ని ద్వేషించడం తటస్థిస్తుంది. "సా ప్రీతియోగ మప్రాప్తా, తే నోద్వేగేన

దూషితా, పురుష ద్వేషిణీస్యాత్, విద్విష్టావా, తతో౽న్యగా" అనగా, పురుషుడు తొందరపాటుగలవాడై, స్త్రీకి రాగప్రాప్తీ, యోనిక్లేదనమూ, కలగకుండానే ఉపక్రమించి, దూషణ కల్పిస్తే, స్త్రీ, పురుష ద్వేషిణికావడంగాని, రతికి విముఖురాలు కావడంగాని, యీ సుఖాన్ని యితరత్రా పొందడంగాని, తటస్థించవొచ్చును.

ప్రారంభించడంలోనే కాదు, విరమించడంలో కూడా చిక్కులువున్నవి, అని కొందరు శాస్త్రవేత్తలు నిర్ణయంగా చెబుతున్నారు. తన విసృష్టిలో తృప్తిపడి, స్త్రీ సంగతిని యోచించకుండా, పురుషుడు రతిసమాప్తిచేసి, స్త్రీకి తృప్తికలగకుండానే విరమించి, తొలిగిపోతే, స్త్రీకి శారీరికంగానూ, మానసికంగానూ, కలిగేబాధలు అనేకం వున్నవి: పురుషుడు, స్వసుఖాన్నిమాత్రమే ఆపేక్షించి, ఇటువంటి తొందరపాటుకు అలవాటుపడితే, స్త్రీకి, రానురాను నరాల సత్తువ చెడిపోవడమూ, కొంతకాలానికి ఆరోగ్యం పూర్తిగా నాశనం కావడమూ తప్పదు. కొందరు స్త్రీలకు, ఈ అసంతృప్తి వల్లను గుండెదడ శాశ్వతమాతుంది, అని, డాక్టర్ కిష్ నిర్ధారణగా చెప్పాడు; అక్కడక్కడ స్త్రీలకు హిస్టీరియా - అపస్మారం - రావడానికి యీ అసంతృప్తి కారణమని వైద్యుల అభిప్రాయం.

వేగాలలోవుండే తేడాలు శాశ్వతం కాకపోవొచ్చును. తేడాలువున్ననాడు, శాస్త్రవేత్తలు

సూచించిన విధానాలను అనుసరించి, ఇబ్బందులులేకుండా సమర్థించుకోవొచ్చును. అంతేకాదు, కాలం గడిచినకొలదీ తత్వాలు మారుతూవుంటవి. అందుచేత జాగ్రత్తగా సర్దుకుంటూవొస్తే, మార్పు దానంతటను అది కలుగుతుంది. ఇక, జాతిభేదాలువున్ననాడు తృప్తికి అవకాశం వుంటుందా, అంటే, ఒక జవాబు చెప్పవొచ్చును: ఈ సందర్భాలలో, మనస్సు ప్రాధాన్యత యెక్కువకనుక, మనస్సుకు ఆకర్షణీయమైన ఇతర వాంశాలూ, ముఖ్యంగా శృంగారపరంగా ఒకరియందు వొకరికి గల ఆకర్షణా, నాయికా నాయకులకు అన్యోన్యతను కల్పించడానికి ఉపయోగపడగలవు. శృంగారపరంగా వొకరియందు వొకరికి ఆకర్షణవున్ననాడు, అది, రాగోదయానికీ భావప్రాప్తికీ కూడా తోడ్పడుతుంది.

అయినా, మానసికమైన ఆనందానికి, ప్రేమా, అన్యోన్యతా యెంత ముఖ్యమైనప్పటికీ, మానసికమైన తృప్తి శరీరంమీదనూ, అవయవాలమీదనూ ఆధారపడి వుంటూవుండడం తప్పదుకనుక, వీటిని ఉపయుక్తపరుచుకునే విధానాలలోవున్న కిటుకుల్ని శాస్త్రవేత్తలు గ్రహించి, వాటి ప్రాముఖ్యతను వెల్లడిస్తూ, యీ సందర్భంలో గుర్తించవలసిన యితర సంగతులనుకూడా చర్చించారు:

ప్రపంచకంలో నాగరికత పెరిగిన ప్రతిదేశంలోనూ, మన్మథక్రీడను, సిగ్గుతోనూ, చీకటితోనూ అంటగట్టి దీనిని అతిరహస్యకార్యంగా యెంచుతూవొచ్చారు.

దీనికితోడు, యీనాటి పరిస్థితులలో స్త్రీలూ పురుషులూ కూడా, విశ్రాంతికి వీలులేని పరిస్థితులలో, పగలంతా పనులలో నిమగ్నులౌతూవుండంవల్లను, భార్యాభర్తలకు యిష్టాగోష్ఠికి సహితం రాత్రివేళగాని వీలుచిక్కడంలేదు. సాధారణసంసారాలలో భార్యాభర్తలు, రాత్రి భోజనం అయిన తరువాతను శయనాగారం చేరడం మామూలు అయినది. జీర్ణకోశం నిండుగావున్న సమయంలో, శరీరంలోని రక్తం, ఆకోశానికి యెక్కువగా ప్రవహించి, జీర్ణశక్తికి తోడ్పాటుచేస్తూవుంటుంది. సురతంలో, రక్తప్రవాహం రహస్యఅవయవాలలోనికి జోరుగాప్రవహిస్తుందనీ, నాడీమండలమంతా రాగకాలంలో చాలా ఉద్ధృతంగావుంటుందనీ యిదివరలో తెలుసుకున్నాం. రక్తప్రవాహం జీర్ణకోశానికి ప్రవహించవలసిన సమయంలో, దానిని రహస్యఅవయవాలకు మళ్లించడంవల్లను, రానురాను, అజీర్ణమూ దానివల్లను యితరవ్యాధులూ కలగడం తటస్థిస్తుంది. ఇదీకాక, స్త్రీలూ పురుషులూ, పగలంతా శరీరానికి ఆయాసం కలిగేపనులలో నిమగ్నులైవుండి, రాత్రివేళకు అలసటచెంది వుండడంవల్లను, రాత్రి తొలి ఝాములలో సురత సుఖాన్ని అంతగా అనుభవించలేరు. ఈ సందర్భంలో, అనాగరికులైన అడవిజాతులవారు, ఎక్కువ అదృష్టవంతులు, వాళ్లు అడవులలో, చెట్లకింద, పట్టపగలు రతిక్రీడ జరుపుతారు. పగలు రతిక్రీడ పనికిరాదనీ, దివామైథునం నిషేధమనీ, నమ్మకంవున్నది. రతి అనంతరం తగినంత విశ్రాంతివుండదు అనేభావంతో

పూర్వులు యీ నిషేధాన్ని కల్పించివుంటారు. ఈ జాగ్రత్త చాలా అవసరమే. సురతం అయిన తరువాతను శరీరానికీ, మనస్సుకీ సంపూర్ణమైన విశ్రాంతి చాలా అవసరం. ఈ సంగతులనుగురించి ప్రత్యేకపరిశోధన చేసిన శాస్త్రవేత్త, రోబండ్ అనే ఆయన, " తెల్లవారగట్ల మంచిసమయం సుఖసురతానికి; రాత్రి పూటను తొలిఝాములలో కోరిక హెచ్చుగావుంటుంది, కాని, తెల్లవారుఝామున సురతంలో సుఖం హెచ్చుగా వుంటుంది" అని నిర్ణయించాడు. సురతాంతంలో విశ్రాంతి, అన్యచింతలేని విశ్రాంతి, మనస్సుకీ శరీరానికీ కూడా సంపూర్ణమైన విశ్రాంతి అవసరం. తగినంత విశ్రాంతి వుండగానే, అలసట చెందిన అవయవాలూ బిగింపులో వుండివున్న నాడీ మండలమూ, ఉద్రేకంలో పడిపోయిన మనస్సూ, కోలుకుని సామాన్యస్థితిని మళ్లీ పొంది, ఆరోగ్యంగా వుండగలవు.

మరివొక ముఖ్య విషయాన్ని కూడా గ్రహించడం చాలా అవసరం : స్త్రీ శరీరంలో మల మూత్ర కోశాలు, రహస్య అవయవాలను ఇంచుమించు ఆనుకుని వున్నట్టు వున్నవి. దేనికిఅవే, యివి, చర్మంతోకూడిన తిత్తులు కావడంవల్లను, ఈ తిత్తులు నిండుగావున్న సమయాలలో సురతాన్ని స్త్రీ సుఖంగా అనుభవించలేదు. పురుషుడి రహస్యఅవయవాలు వేరుగావున్నా, పురుష శరీరంలో శుక్ల కోశమూ, ప్రోస్టేట్ గ్రంథీ, శుక్లనాళమూ, మూత్రకోశమూ,

మలకోశమూ, ఒకదానికి వొకటి సమీపంలో వున్న తిత్తులు కావడంవల్లను, వీటిలో ఒకదాని వొత్తిడి వొకదానికి కలిగే అవకాశం వున్నది.



5 పై పెదవులు 2 మూత్రిక 8 మూత్రకోశం 4 గర్భకోశం
5 గర్భకంఠం 6 మలకోశం 7 భగద్వారం

అందుచేతను పురుషుడికి కూడ మలమూత్ర కోశాలు నిండుగా వున్ననాడు, స్ఖలనం త్వరగా కావడమూ, సురతం సుఖవంతంగా వుండకపోవడమూ తప్పదు. ఈ కారణం

వల్లనే, అనుభవజ్ఞులైన వైద్యులు మలబద్ధకాన్ని పరమ శత్రువుగా యెంచమని సలహా యిస్తారు.

భార్యా భర్తలు, ముఖ్యంగా గుర్తించవలసినవని శాస్త్రవేత్తలు చెప్పిన ముఖ్య సూత్రాలు కొన్ని వున్నవి :

1. యౌవనం పదహారు సంవత్సరాలు మొదలు డబ్భై సంవత్సరాల వరకూ అని వాత్స్యాయనుడు నిర్ణయించాడు; కొందరికి డబ్భైఅయిదువరకూ కూడా అని హేవెలక్ ఎల్లిస్ తెలియబరిచాడు. ఈ సందర్భంలో యౌవనం అన్నమాటకు రతిశక్తి వుండడం అన్నమాట. యౌవనారంభంలోవుండే శక్తి, రానురాను తగ్గుతూ వుండే మాట నిజమే, కాని, జాగ్రత్తగా కాపాడుకున్ననాడు, ఈ శక్తి పురుషుడికి డబ్భైసంవత్సరాల వయస్సువరకూ, స్త్రీకి యాభై, యాభై అయిదు సంవత్సరాల వయస్సువరకూ కూడా వుండే అవకాశాలు వున్నవి. అందుచేతను, అతిగా పోకుండా, జాగ్రత్తగా కామశక్తినీ ఆరోగ్యాన్నీ కాపాడుకున్నవారు యెక్కువకాలం సుఖాలను అనుభవించ గలుగుతారు.

2. భార్యాభర్తలు యిరువురూ సంపూర్ణ ఆరోగ్యంలో వున్ననాడే సురతానికి పూనుకోవలెను. సురతం అయిన తరువాతను, వొళ్లు తేలికగానూ, మనస్సు హాయిగానూ వుండడమే దీనికి తార్కాణం. అలాకాకుండా రతి అనంతరం నిస్సత్తువ తోచినా, కాళ్లు లాగినా, మరేవిధమైన

బాధకలిగినా, పొరబాటుచేసినట్టు గ్రహించి, కొంతకాలం విరమించి, జాగ్రత్త పడడం మంచిది.

3. భార్యాభర్తలు ఒకరి యింగితాలను వొకరు యెరిగి, వ్యత్యాసాలు వుంటే, వాటిని గ్రహించి, అన్యోన్యసహకారంతో యిరువురికీ భావప్రాప్తి సమకాలంలో తటస్థించేటట్టుగా అలవాటుచేసికోడం చాలా అవసరం. ఒకరి మనస్సును వొకరు గ్రహించి, దాంపత్యజీవితంలో శృంగారభావాన్ని నిలుపుకుని, అన్యోన్యఆకర్షణను కాపాడుకున్ననాడు, యిది సాధ్యమౌతుంది.

4. భావప్రాప్తి యిరువురికీ సమకాలంలో తటస్థించినా, వెంటనే తొలిగిపోవడం మంచిది కాదు. రహస్య అవయవాల లోపలిచర్మాలు చాలా సున్నితమైనవి; నరాల చివరలు వీటిలో వుండడంవల్లను, రతి ద్రవాలను కొంతవరకూ జీర్ణించుకునే శక్తి ఈ లోపలి చర్మాలకు వున్నది – సుఖరోగాల అనుమానం వున్ననాడు, ఈ ఆలస్యం పనికిరాదు.

5. ఎన్నిసార్లు, అనే ప్రశ్నకు జవాబు కష్టం. వ్యక్తుల తత్వాలను బట్టీ, వారి ఆనువంశిక లక్షణాలను బట్టీ, వారి ఆరోగ్యస్థితులను బట్టీ, ఈ ప్రశ్నకు జవాబు వుంటుంది. యౌవనారంభంలో, కొత్తరోజులలో, ముఖ్యంగా ఉద్రేకమూ ఉబలాటమూ హెచ్చుగా వున్న కాలంలో, మితితెలియని తనం వుంటుంది. కాని, రాను

రాను, భార్యాభర్తలు తమంతటతామే, పరిమితిని తెలుసుకో గలుగుతారు. అయినా, యువతీయువకులు ముఖ్యంగా ఒక సంగతిని మనసులో వుంచుకోడం అవసరం: విందులు యెక్కువైననాడు, ఉపవాసం ఆరోగ్యాన్ని కలిగిస్తుంది, అని.

6. కామవాంఛ కలగడంలో, స్త్రీ పురుష తత్వాలలో ఒకభేదం వున్నది: రజోదర్శనానికి ముందురోజులలోనూ, రజోదర్శనం ఆగిపోయిన కొద్దిరోజుల తరువాతనూ స్త్రీకి కామవాంఛ యెక్కువగా వుంటుంది, అని మేరీ స్టోప్స్ అభిప్రాయం ఈ సంగతిని భర్త గ్రహించాలి.

7. సురతాన్ని ఒక వ్యసనంగా చేసికోడం చాలా తెలివి తక్కువ – లేకపోడం బాధకరం కావడమూ, ఉన్ననాడు సుఖానికి విలువ తగ్గడమూ, వ్యసనానికి లక్షణం – అందుచేతను, సురతాన్ని వ్యసనంగా చేసుకుంటే, శృంగారభావం నశిస్తుంది; సుఖానుభూతి తగ్గుతుంది. ఈ స్థితికి అలవాటుపడిన భార్యాభర్తలు, ఒకరికివొకరు అవసరమౌతారు కాని, ఒకరియందువొకరికి ఉండవలసిన ఆకర్షణ క్షీణిస్తుంది. సుఖానికి శృంగారం ప్రాణం.

8. మనసులలో భయమూ, జంకూ వుంచుకొని సురతానికి పూనుకోడం చాలా ప్రమాదకరం. ఉద్రేకం మధ్యలో భంగం కలిగిననాడు, అది మెరుపు దెబ్బవలె నరాలకు శాశ్వతమైన ఆఘాతాన్ని కలిగించే అవకాశం వున్నది. ఈ విధంగా దెబ్బతిన్నవారు; చిక్కిపోయి,

నిద్రించే శక్తి పోయి, నరాలసత్తువ సడలిపోయి, తలవెంట్రుకలు ఊడిపోయి, ముసలిరూపుపడి, అనేక విధాలుగా బాధలు పడతారు. అందుచేతనే, శాస్త్రజ్ఞులు, చౌర్యసురతాన్ని ఘట్టిగా ఖండించారు.

9. భార్యవిధులను నిర్వచనం చేస్తూ, 'శయనేషు రంభా' అన్నారు, మన పూర్వులు. రంభ, మూర్తీభవించిన శృంగారస్వరూపమని కదా భావన! భార్య యీ రహస్యాన్ని మనస్సులోవుంచుకోవాలి. ఈ సూత్రం భార్యకుమాత్రమే వర్తిస్తుంది; అని భర్త భ్రమపడరాదు. భర్తకూడ యిందుకు తగినట్టుగానే వుండాలి. భార్యాభర్తలు ప్రతి కలయికాకూడా శృంగారభూయిష్టంగా కల్పించగలిగిననాడు, వారిదాంపత్యజీవనం తృప్తితోనూ ఆనందంతోనూ తులతూగుతూ వుంటుంది. ఈ విధంగా తృప్తినీ, ఆనందాన్నీ సాధించిన దంపతులు ధన్యులు. ఈ ధన్యతను సాధించిన దంపతులముఖాలలో శాంతీ, ఆనందమూ, వర్చస్సూ, తాండవిస్తూవుంటవి.

## ర తి !

కేవలం శారీరికసుఖాన్ని అనుభవించడమేకాదు రతి; తపనవల్లను కలిగే బాధను తీర్చుకోడం మాత్రంకాదు రతి; మల మూత్రకోశాలు నిండివున్నప్పుడు, వాటిని ఖాళీచేయడంవంటి తచ్ఛాంతికాదు రతి;

ప్రకృతిశక్తినంతనీ ఉపయుక్త పరుచుకున్న, రెండు సునిశితశరీరాలకలయికరతి; సాదృశ్యంలేని, అపారశక్తియుతమైన రెండు మనస్సుల సమ్మేళన రతి; అద్వైతానందంలో ఐక్యంపొంది, భూతలస్వర్గాన్ని నిర్మించుకునే ఆత్మానుసంధానం రతి !

అందుచేతను, తమ జీవితాలలో బ్రహ్మానందాన్ని కలిగించే సాధనాలు తమ శరీరాలు అనే జ్ఞానంతో, వొకరిశరీరాన్ని వొకరు ప్రేమిస్తూ, సౌందర్యార్చకులు కావాలి దంపతులు ! భావప్రాప్తి కలిగేసమయంలో తటస్థించే అద్వైతస్థితిని గ్రహించి, నీవు నేను అనే భేదాన్ని విడిచి, తమ మనస్సులను ఐక్యం చేసుకోవాలి దంపతులు ! నూనె వొత్తీ కలిసి, దీపకళికను వెలిగించినట్టు, రెండు ఆత్మశక్తుల అనుసంధానంలో కలిగే వెలుగులో, సంసారాన్ని తేజోమయంగానూ, శోభస్కరంగానూ చేసికోగలగాలి దంపతులు !

# రహస్యాలు

ప్రేయసీ ప్రియులు!

ఎవరు వీరు? సామాన్య మానవులు కారా? సామాన్యమానవులే అయితే, మరి, నిజమైనప్రేమ హృదయాలలో అంకురించగానే, యెందుచేతను ఒకరి కన్నులలో వొకరికి, ఆ కర్పూరహారతుల కళకళలు కనపడడం; యెందుచేతను ఒకరి కంఠస్వరం వొకరికి, మధురాతి మధుర సంగీతం కావడం; యెందుచేతను ఒకరిగాలి వొకరికి సోకగానే, ఆ సుఖస్వప్నాల సోలింతలు; యెందుచేతను ఒకరి స్పర్శ వొకరికి తగలగానే, ఆ మెరుపుల తళతళలు, ఆ మైమరుపులు, ఆ మైకములు, హృదయాలలో ఆ అమృత బిందువుల చిరువర్షాలు!

ప్రేమ హృదయాలను ఆవరించిన తక్షణం, ఆ ప్రేయసీప్రియుల కన్నులకు, ప్రపంచకం నందన వనంగా, వారి భావనకు జీవితఘడియలు అమృత గుళికలుగా, వారి ఆఘ్రాణానికి గాలికెరటాలు గగుర్పాటులుగా, వారి వీనులకు పక్షుల కలకలారావాలు మత్తుమంత్రాలుగా, వారి హృదయాలకు వెన్నెలలు వెన్నలోకలిపిన వన్నెలసోనలుగా, ప్రకృతిలో ప్రతీ దృశ్యమూ, ప్రతీశబ్దమూ, ప్రతీసువాసనా, ప్రతీస్పర్శా ఉద్దీపనం కావడం! ఏమిటి ఈ వైచిత్ర్యం!

ప్రేమ ఇంద్రజాలం!

అందుచేతనే, ప్రేమకథ యెలా ప్రారంభమైనది; ప్రేమకు కారణంయేమిటి; ప్రేమను సంపాదించడం యెలాగున...ఈ ప్రశ్నలను అడిగి ప్రయోజనంలేదు; ఈ ప్రశ్నలకు సరియైనజవాబు లభించదు. కాని ఒక్క-జవాబు మాత్రం చెప్పవొచ్చును: ప్రేయసీప్రియులలో నయన, కర్ణ, ఘ్రాణ, త్వగింద్రియాల గ్రహణశక్తులలో రహస్యమైన వైపరీత్యం యేదో కలుగుతుంది అని. ఈ రహస్యాన్ని గ్రహించవలెనంటే, ఈ ఇంద్రియాల ద్వారా కలిగే ప్రేరేపణలనుమాత్రం గ్రహించగలం.

1. 'చూపుతో మాటాడి'

అనే కవివచనంలో చాలా సత్యం యిమిడివున్నది. పెదవుల నుంచి వెలువడే మాటలకు భాష అనే సరిహద్దులు ఉన్నవి; కాని నయనభాషకు ఏ సరిహద్దులూ లేవు. ప్రేయసీప్రియుల హృదయాలు వారి కన్నుల లోతులలో ప్రతిబింబిస్తూ వుంటవి; అందుచేతనే కాబోలును, 'తొలిచూపులోనే వలపు కలగడం' అంటారు. మొదటిచూపులోనే కలిగే సిగ్గు సింగారం ఆకర్షణ అయి, ప్రేమ కథ ఆ విధంగా ఆరంభిస్తే, అది, జీవిత సాఫల్యాన్ని సాధిస్తుంది; దాంపత్యం ఆ విధంగా ప్రారంభిస్తే, ఆ దంపతులు కలకాలప్రియులు కాగలరు. అంతే కాదు, కనుపాపలో పడిన విగ్రహం ఆకర్షణీయం అయితే, అది శాశ్వతంగా హృదయంలో ప్రతిబింబిస్తూవుంటుంది. అందుచేతనే

వాత్స్యాయనుడు. ప్రేయసీ ప్రియులకు ఒకరి దర్శనం వొకరికి కంటికీ మనస్సుకీ ఆనందాన్ని కల్పించేటట్టుగా వుండాలి అన్నాడు. ఒక నడక తీరు, ఒక భంగిమ విలాసం, ఒక విగ్రహం ఠీవి, ఒక రూపం దర్పం... ఈ విధంగా, దేనికిఅదే ఆకర్షణ కావొచ్చును. ఈ సందర్భాలలో కన్నూ, చూపూ చాలా ముఖ్యమైనవి.

2. కన్నువలెనే; కంఠస్వరం కూడా సమ్మోహనాస్త్రం కావొచ్చును. ప్రేయసీ ప్రియులకూ ఒకరి కంఠస్వరం వొకరికి యెంతో ఆకర్షను కల్పిస్తుంది. ఆకర్షణీయమైన కంఠస్వరం అనురాగానికి కారణంకావొచ్చును. అందుచేతనే, ప్రేయసీప్రియులకు పాటలు ప్రాణప్రదం. కంఠాన్ని, ప్రేమ పలికించిననాడు, అంతకు మించిన సంగీతం లేదనిపిస్తుంది. 'మెరుపల్లె పాటెత్తి, మురిపించినాడమ్మ' అన్న కవి వాక్కులో ఈ రహస్యం వెల్లడి అవుతుంది. అంతేకాదు, వివిధదశలలో కలిగే స్వనాలు, వివిధవిధాలుగా భావోద్రేకాన్ని కలిగించగలవు. రుతుకాలంలో వున్నప్పుడు, పక్షులలోనూ, జంతువులలోనూ కంఠస్వరాలలో కలిగే మార్పు, ఒక ప్రత్యేక ఆకర్షణను కల్పించుతుంది. కంఠస్వరం అనురాగాన్ని కలిగించడమేకాక, రాగోదయానికి కూడా తోడ్పడుతుంది అనడానికి పై హంశాలు ఉదాహరణలు. అంతేకాదు, సుఖానుభవాన్ని కూడా గొంతుకు తెలియబరుస్తుంది. రతిపారవశ్యంలో, గొంతుకలో పలికే శబ్దాన్ని 'మణితం' అని నామకరణం చేసి,

పావురాల కువకువ వంటి యీ ధ్వనిలో యిమిడివున్న సుఖాన్ని గుర్తించి, దీనిని వర్ణించారు, మన కవులు.

3. ప్రేయసీప్రియుల ఆకర్షణకూ ఘ్రాణశక్తికీ సంబంధంవున్నది. మనస్సుని సుముఖంచేయడంలో సువాసనలకు మంచిశక్తి వున్నది. మనస్సుకు ప్రీతిని కల్పించే సువాసనలు, నాడీమండలంలో చక్కని సంచలనాన్ని కల్పించి, నరాలకు పటుత్వాన్ని కల్పించగలవు అని తెలియజేస్తూ, భారతదేశంలో పూర్వకాలంనుంచీ కస్తూరిని * సుగంధద్రవ్యముగా వాడడాన్ని ప్రశంసించాడు, వాన్ డి వెల్డ్. ఈ సందర్భంలో, భారతీయులూ అరేబియా దేశస్థులూ, పూర్వకాలంనుంచీ వస్నీరుని వాడడంకూడా ప్రశస్తమైన ఆచారమని శాస్త్రవేత్తలు తెలియజేస్తున్నారు. సుగంధిద్రవ్యాలను వాడడంలో ఉద్దీపన ప్రయోజనమే కాక, వెగటు కల్పించే శరీర వాసనలను కప్పిపుచ్చడం ద్వారాకూడా ప్రయోజనం వున్నది. కాని, సుగంధద్రవ్యాలు మరీ ఘాటుగా వుండడం కూడదు అనీ, స్త్రీలు ముఖ్యంగా వీటిని వాడడం చాలా అవసరమనీ, వాన్ డి వెల్డ్ ఘట్టిగా చెప్పాడు. శృంగార కాండలో సుగంధద్రవ్యాలకువున్న ప్రయోజనాలను మన కవులు పూర్వకాలంనుంచీ వర్ణిస్తూ వొచ్చారు.

---

* కస్తూరి మృగం ఋతుకాలంలో వున్నప్పుడు, దాని రహస్య అవయవాల ప్రాంతంలో కస్తూరి తయారవుతుంది.

4. సుఖాన్ని కలిగించడంలో స్పర్శకు వున్నశక్తి అపారం, ఉద్రేకాన్ని కల్పించడంలోకూడ. త్వగింద్రియం - అనగా శరీర మంతటావున్న చర్మం - స్పర్శను గ్రహించగలుగుతుంది. కాని, శరీరంలోపలనుంచి వెలుపలికి వొచ్చిన సున్నితమైన చర్మం, శరీరంపైనివున్న చర్మంతో కలిసినతావులన్నీ స్పర్శసుఖాన్ని యెక్కువగా అనుభవించేటట్టు చేయగలవని హేవెలక్ ఎల్లిస్ తెలియబరిచాడు - అంటే నవరంధ్రాలలో ముఖ్యమైన పెదవులూ, కన్నులూ, రహస్య అవయవాలలోని భాగాలూ - కాని, వాన్ డి వెల్డ్, ఎల్లిస్ అభిప్రాయంతో పూర్తిగా అంగీకరించక, సున్నితమైన లోపలి చర్మం పై చర్మంతో కలియడంలో ప్రాధాన్యతను పొందినవి పెదవులు మాత్రమే అని అభిప్రాయపడ్డాడు.

స్పర్శకు సంబంధించిన శరీర భాగాలను రెండుతరగతులుగా విభజించవొచ్చును : స్పర్శను తెలియబరిచేవి, స్పర్శను అనుభవింపజేసేవి, అని. చేతులూ, వేళ్లూ, వేళ్లకొనలూ, నాలుకకొనా, తెలియబరిచే అవయవాలు.

పెదవులు మధ్యస్థంగా వుంటవి; వీటికి తెలియబరిచే శక్తీ, అనుభవింపచేసే శక్తీకూడా కొంత కొంత వున్నవి.

ఇక, స్పర్శను అనుభవింపజేసే భాగాలను గురించిన ప్రశంస చాలాముఖ్యమైనది. స్పర్శను

అనుభవింపజేసే భాగాలను మన పూర్వపుశాస్త్రజ్ఞులు 'కళాస్థానాలు' అన్నారు. ప్రాచీనకాలంలో గ్రీసుదేశ రచయిత, హిప్పొక్రెటీస్, కళాస్థానాలను గురించి తర్కించాడు. ఇంగ్లీషు వారిలో హేవెలక్ ఎల్లిస్ కళాస్థానాలను గురించి - Erogenic zones - విపులంగా రాశాడు. హేవెలక్ ఎల్లిస్ నాటి నుంచీ నేటి పాశ్చాత్య రచయితలు అందరూ, తమ కామశాస్త్ర రచనలలో, కళాస్థానాలప్రసంగాన్ని ఒక ముఖ్యభాగంగా గణిస్తూవున్నారు.

"లలాటాలక కపోల నయన వక్షస్తనోష్ఠ్యాం తర్ముఖేషు చుంబనం" అనగా, నొసలూ, ముంగురులూ, బుగ్గలూ, కన్నులూ, వక్షస్థలమూ, స్తనాలూ, పెదవీ, నాలుకా, చుంబించదగినవి, అన్నాడు వాత్స్యాయనుడు. మన కవులు అధరామృతాన్ని శ్లాఘించిన విధానాన్ని బట్టి, పెదవిచుంబనాన్ని గురించిన విశేషాన్ని గ్రహించవొచ్చును. 'అంతర్ముఖేషు చుంబనం' అనడంలో, నాలుక ప్రయోజనమూ, నాలుకా నాలుకా రాపాడించడంలో కలిగే సుఖమూ, యెంచదగినవని వాత్స్యాయనుడి అభిప్రాయం. నొసలూ, కన్నులూ, బుగ్గలూ, వక్షస్థలమూ ముద్దుపెట్టదగిన స్థానాలు అన్నసంగతి సామాన్యంగా తెలిసినదే.

పాశ్చాత్య శాస్త్రవేత్తలు, మరికొన్ని స్థానాలను కూడా కళాస్థానాలుగా నిర్ణయించారు: మెడమీదను వెంట్రుకలు దిగజారిన భాగమూ, చెవుల

పైభాగమూకూడా, ఒకవిధమైన సున్నితత్వాన్ని కలిగివున్నవనీ; ఈభాగాలను పెదవులతో కోరికినట్టుగా గట్టిగాపట్టి కదలికలు కలిగించడం ఒక హాయిని చేకూరుస్తుందనీ, ఎల్లిస్ తెలియబరిచాడు. మర్మస్థానాలకు చేరువుగావున్న తొడలోపలి భాగాలు మృదువైనస్పర్శకు సుఖదాయకంగా వుంటవని వాన్ డి వెల్డ్ అభిప్రాయం. స్త్రీ - పురుషుల రహస్య ఇంద్రియాలలో ప్రతీ భాగమూ స్పర్శసుఖాన్ని అనుభవింపజేయగలదు అని అందరు శాస్త్రజ్ఞులూ అంగీకరించారు.

స్త్రీ అవయవాలలో విశేషించి చెప్పదగినది, భగలింగం. దీనిలో నరాల చివరలు విస్తారంగా వుండడంవల్లను, యిది స్పర్శకు యెక్కువగా స్పందిస్తుంది. స్త్రీఉద్రేకానికి, భగలింగం రహస్యస్థానం, చాలా ముఖ్యస్థానం కూడా. రాగకాలంలో పురుష అవయవంవలె భగలింగం స్తబ్దతనుపొంది, ఒకటిన్నరరెట్లు పెద్దది అవుతుంది. దీనికి స్తబ్దత కలగగానే, స్త్రీ రహస్య అవయవంలోని గ్రంథులు ద్రవించి, స్త్రీని సిద్ధంచేస్తవి. భగలింగానికి కలిగే రాపిడీ, వొత్తిడీ, స్త్రీకి అమితసుఖాన్ని కలిగించుతవి; కాని, ఈ కార్యంలో మోటతనం కన్న మృదుత్వం యెక్కువ సుఖాన్ని కలిగించుతుంది అని గ్రహించడం చాలా అవసరం.

స్త్రీ విగ్రహానికి అందాన్ని కల్పించడంలోనేకాదు, కలగబోయే సంతానానికి తొలి ఆహారాన్ని కలిగించడంలోనేకాదు. ఆమెకు అపరిమిత ఆనం

దాన్ని కల్పించడంలోకూడా స్తనాలకు యెక్కువ ప్రయోజనం వున్నది. స్పర్శవల్లనూ, ఒత్తిడివల్లనూ యివి స్తబ్ధతను పొందుతవి. రాగకాలంలో, చూచుకాలు – అనగా, వీటి మొనలు – గట్టి పడి స్పర్శసుఖాన్ని విస్తారంగా కలిగించుతవి. గర్భకోశంలోని కండరాలకూ, స్తనాలకూ ఒకవిధమైన సంబంధం వున్నదని, ఇటీవల పరిశోధకులు నిర్ణయించారు.* అందుచేతనే కాబోలును, స్త్రీకి ప్రేమకలగగానే స్తనాలలో నిశితత్వం కలుగుతుంది. భావప్రాప్తి కలిగేసమయంలో, చూచుకాలకు వొత్తిడిని కల్పించడం కొందరు స్త్రీలు కోర్తారు. అంతేకాదు, రాగ కాలాన్ని కల్పించడంలోనూ, భావప్రాప్తి తరువాత విశ్రాంతి లోనూ చనుగుదుపులో విస్తారసుఖాన్ని అనుభవిస్తారు, కొందరు స్త్రీలు, అని తెలియజేశాడు వాన్ డి వెల్డ్.

కళాస్థానాలను గురించి మరొక్క ముఖ్యవిషయాన్ని కూడా తెలియబరచడం అవసరం: కళాస్థానాలు నిశితంగావుండడంలో వ్యక్తులను బట్టి భేదాలు వుండడం మామూలు; అంతేకాదు, ఒకే వ్యక్తిలో తత్వం మారినప్పుడు కళాస్థానాలలో మార్పులు కలగడం కూడా తటస్థించవొచ్చును. అందుచేతను, నాయికా నాయకులు ఒకరి రహస్యాలను వొకరు అనుభవం వల్లను తెలుసుకుని మరీ, వీటిని ఉపయుక్త పరుచుకోవలెనని శాస్త్రవేత్తల సలహా.

---

* ఈ పరిశోధనల వివరాలు ' సుఖప్రసవం ' అనేప్రకరణంలో చూడనగును.

సృష్టిలో ఏ ప్రాణికీలేని అవయవ సౌలభ్యం మానవశరీరానికి వున్నది; అంటే అవయవాలను ఇష్టం వొచ్చినట్టుగా తిప్పగలిగిన అవకాశాలు మనుష్యశరీర నిర్మాణంలో వున్నవి. ఇందువల్లను, ఇతర ప్రాణులకు లేని కొన్ని అవకాశాలు మనుష్యులకు సులభసాధ్యమైనవి. అందుచేతను, కామాన్ని అనుభవించడంలో అనేకవిధాలనాను అనుసరించడానికి అవకాశాలు కలిగినవి. వీటిని యోగాలు, సంవేశనప్రకారాలు, బంధాలు, అని శాస్త్ర ప్రణేతలూ, బంధనాలు, అని సామాన్య ప్రజా, నామకరణంచేశారు.

భారతదేశంలోనేకాదు, ప్రాచీన కాలంలో నాగరికతకు పేరుపొందిన యితరదేశాలలోకూడా, కామశాస్త్రరచయితలు బంధనాలను గురించి వర్ణిస్తూ వొచ్చారు. ప్రాచీన గ్రీసుదేశ కవయిత్రిఅయిన ఎలిఫేన్‌టిన్, తొమ్మిది బంధనాలను వర్ణించింది. రెండువేల రెండువందల యాభై సంవత్సరాలక్రితం ఈజిప్టులోని శాస్త్రకారులు పధ్నాలుగు బంధనాలను పేర్కొన్నారు. ప్రాచీన అరబ్బుదేశ రచయితలు నలభై బంధనాలనూ, ఆరురకాల కదలికలనూ వర్ణించారని 'పెర్‌ఫ్యూమ్డ్ గార్డెన్' అనే గ్రంథాన్నిబట్టి విశదమౌతూవుంది. ఇటీవల, ఇంగ్లీషు రచయితలుకూడా బంధనాల ఆవశ్యకతను గుర్తించి, కొన్ని విధానాలను తమ గ్రంథాలలో వర్ణిస్తూవున్నారు. హెలీనావైట్ తన గ్రంథంలో అయిదు బంధనాలను వర్ణించింది. వాన్ డి వెల్డ్, పది బంధనాలను గురించి విపులంగా రాశాడు తన యింగ్లీషు గ్రంథంలో.

ఉత్ఫుల్లకం, విజృంభితకం, ఇంద్రాణికం, సంపుటకం, పీడితకం, వేష్టితకం, బాడబకం, అని, ఏడుబంధనాలను వర్ణించాడు బాభ్రవ్యుడు. జృంభితకం, ఉత్పీడితకం, అర్ధపీడితకం, వేణుదారితకం, శూలాచితకం, పీడితకం, పద్మాసనం, పరావృత్తకం, అని తొమ్మిది బంధనాలను పేర్కొన్నాడు, వాత్స్యాయనుడు. ఈ బంధనాలలో నాయికా నాయకుల శరీరస్థితులనుబట్టి బంధనాలను ఆరు విధానాలుగా నిర్ణయించాడు, నెల్లూరు శివరామకవి, తన 'కామ కళానిధి' అనే గ్రంథంలో, శివరామకవి తెలియజేసిన విధానాలు: ఉత్తానకరణం, ఉత్థితకరణం, స్థితకరణం, వ్యాకరణం, తిర్యక్ కరణం, విపరీతకరణం, అని ఆరు. ఆరవదియైన విపరీతకరణాన్ని స్త్రీ నిర్వహించడం వల్లను, దీనిని పురుషాయితం అన్నారు.

ప్రాచీనరచయితలు తెలియ బరిచిన బంధనాల సంఖ్య తక్కువగా వున్నది; కాని, 'చతుష్షష్టికాన్ యోగాన్' అనగా, అరవై నాలుగు యోగాలు అనే మాటను బట్టీ; 'చౌశీతి' అనగా యెనభైనాలుగు అనే మాటనుబట్టీ, బంధనాలు యిన్నివిధాలుగా ఉన్నవేమో అనిపిస్తుంది. కొద్ది కొద్ది మార్పులతో, ఒక్కొక్క మార్పుకు, ఒక్కొక్క పేరును నిర్ణయించి చెప్పడంలో సంఖ్య ఇంతగా పెరిగినదనీ; "ఆలింగన చుంబన నఖచ్ఛేద్య దశనచ్ఛేద్య సంవేశన సీత్కృత పురుషాయిత ఔపరిష్టకానా మష్టానా మష్టవిధా వికల్పభేదా దష్టా వష్టకా శ్చతుష్షష్టి రితి బాభ్రవీయాః" అనే

నాయికా నాయకుల మక్కువకార్యాలలో గల యెనిమిది విశేషాలతో బంధనాలను గుణించగా, అరవైనాలుగు వరకూ సంఖ్య పెరగడంవల్లను, ఈ అరవైనాలుగునీ 'చతుష్షష్టి' అనీ, 'పాంచాలకీ చతుష్షష్టి' అనీ, వర్ణనలు తయారైనవనే పండితఅభిప్రాయం సరియైనది.

సామాన్య సంసారులు సహితం కొన్నిసంగతులను తెలిసికోవడం అవసరం. కొన్ని కొన్ని సందర్భాలలో, భార్యా - భర్తల శరీర నిర్మాణాలలోవుండే భేదాలు విపరీతమై, ఈ భేదాలవల్లను అభ్యంతరాలు యేర్పాటైననాడు, వాటివల్ల యిబ్బందిలేకుండా అనుసరించే విధానాలను తెలుసుకోడం మంచిది. అదీకాక, భార్యాభర్తలుసహితం, తప్పనిసరి అన్నట్టు భావిస్తూ, ఒకే విధానానికి అలవాటుపడిపోవడం కన్న, అప్పుడప్పుడు మార్పు కల్పించడం వల్లను, నూతన ఉత్సాహాన్ని, యెక్కువ సుఖాన్ని అనుభవించగలుగుతారు. ఇంతకుమించి సామాన్యసంసారులకు బంధనాలతో నిమిత్తం అనవసరమేమో!

బంధనాలనుగురించి సాధారణంగా విపరీత అభిప్రాయాలు వుంటూవుండడంవల్లను, వీటిని గురించి సరియైన అధికారాలను సూచిస్తే, ఆ వివరాలు కావలెనన్నవారు, ఆగ్రంథాలద్వారా తెలుసుకోగలుగుతారు కనుక, వీటినిగురించి యింతకుమించిన ప్రసక్తికి పూనుకోలేదు, యీ గ్రంథంలో.

ఈ సందర్భంలో కొన్ని జాగ్రత్తలను తెలియబరచడం మంచిది: బంధనాలను వివరిస్తూ, వాటిలో కొన్నింటిని 'చిత్రరతాలు' అనీ, 'విషమరతాలు' అనీ అర్థయుక్తంగా నామకరణంచేశాడు, వాత్స్యాయనుడు. నిసనైన శాస్త్రవేత్తలు తెలియబరిచిన విధానాలుకాక, అక్కడక్కడ వింతగా చిత్రించిన విధానాలనుబట్టి, అటువంటి యత్నాలకు పూనుకుంటే, అవయవాలు మరమ్మత్తుపాలు కావలసిన అగత్యంకూడా తటస్థించవొచ్చును.

రతిక్రీడ సాముగరడీలకు పూనుకునే గారడీవిద్యకాదు.

# స్వర్గం - నరకం

సుఖాపేక్ష మానవసహజం. యీ దృష్టితో స్వర్గాన్ని సృష్టించారు. అందుచేతను, స్వర్గం అన్ని వైభవాలకూ, సమస్త సుఖాలకూ, స్థానం అన్నారు. స్వర్గం అనే సృష్టి యెప్పుడు జరిగిందో, యిందుకు పూర్తిగావ్యతిరేకమైన సృష్టికూడా తప్పదుకదా! అందుచేతను, నరకాన్నికూడా సృష్టించారు. అందువల్లనే, నరకం అన్నిహింసలకూ యమ యాతనలకూ స్థానం అయ్యింది.

స్వర్గసుఖాన్ని అపేక్షించడమూ నరకయాతనలకు అవకాశంలేకుండా తప్పించుకోడమూ మానవ యత్నం. అయితే, నరకయాతనలపాలుకావడం యెందుకు తటస్థించాలి, అని ప్రశ్న. దీనికి జవాబు వొకటే: సరియైన సుఖంయేది అనే విచక్షణలేక, ప్రమాదానికి దారితీసే తాత్కా-లికసుఖాలకు లొంగిపోవడం వల్లను, స్వర్గసుఖానికి దారి అనుకుని, ఒక అడుగువేసి, నరకంలోనికి దిగజారడానికి అవకాశాలువున్నవి.

జీవితం, దాంపత్యం, సంసార సుఖం, యివి స్వర్గసుఖాన్ని కల్పించవొచ్చును; లేదా, నరక యాతనల పాలుకావొచ్చును; శరీరస్థితీ, మనస్థితీ సుఖంగావుండి

సంతానం ఆరోగ్యంతో ఆనందదాయకంగా వున్ననాడు; సంసారం స్వర్గంకావడానికి అవకాశాలువుంటవి. అలాకాక ఆరోగ్యం చెడిపోయి, అందువల్లను మనస్సు పాడయిపోయి, ఈ దోషం వల్లను పిల్లలుకూడా అనారోగ్యంపాలైననాడు, సంసారం దుర్భరమౌతుంది; ఇంతకుమించిన నరకం మరిలేదు. ఈ దుర్భర స్థితిని కల్పించే రోగాలు కొన్నివున్నవి. సుఖాపేక్షతో వీటిపాలు కావడం తటస్థిస్తుంది కనుక వీటిని సుఖరోగాలు అన్నారు. అనేక విధాల నరకయాతనలను కలిగించగలిగి, సంసారాలనూ, సంతానాన్నీకూడా పీడించుకు తినగలిగినవి కనుక, యీ జాడ్యాలనుగురించి వివరంగా తెలియబరచడం చాలా అవసరం. సుఖరోగాలు రెండే రకాలు : సవాయి, సెగ.

కాని, సుఖవ్యాధులు అనేక రకాలు వున్నవని సామాన్యప్రజలలో నమ్మకంవున్నది. బిళ్ళలూ, అడ్డకర్రలూ, కొరుకూ, సవాయిపుండూ మొదలైనవి కొన్నీ, సెగలో, పచ్చ, యెర్ర, తెల్ల, అనే భేదాలుగల సెగలూ వున్నవనీ ; సాధారణంగా చెప్పడంవింటూ వుంటాము. ఇంతేకాదు, తెల్లసెగ శరీరానికి మంచిదనికూడా నమ్మేవారు చాలామంది వున్నారు. శరీరానికి ఉపయోగపడే సుఖవ్యాధి లేదు సరేకదా, శరీరానికి ప్రమాదాన్ని కల్పించని సుఖవ్యాధి కూడా లేదు. ఈ సందర్భాలలో ప్రజలు ప్రమాదాలపాలై బాధలు పడడానికి, పిచ్చిపిచ్చి అభిప్రాయాలు కూడా కొంత వరకూ కారణం. తగిలినవెంటనే కొంతబాధను కలిగించినా,

చికిత్సచేసినా చేయకపోయినాకూడా త్వరలో అణగారిపోయి, ప్రమాదం తప్పిపోయినట్టు కనపడడం, ఈ రోగాలలో వున్న దొంగలక్షణం. కాని, సరియైన చికిత్స చేయించి వీటిని శరీరం నుంచి పూర్తిగా తొలగించనినాడు, యివి జీర్ణించి, వయస్సు ముదిరిన కొలదీ. అనేక విధాలను, దుర్భరమైన భాధలను కల్పించడమేకాక, నపుంసకత్వాన్ని కలిగించీ, సంతానం కలగకుండాచేసి, సంతానానికి సంక్రమించి, అంతటితోనూ ఆగక సంతానాన్ని ఏడు తరాలవరకూ కూడా వెంటాడేశక్తి యీ రోగాలకు వున్నది.

## 1. పాశ్చాత్య వైద్యవిధానం

– ఇంగ్లీషువైద్యం – ఈ జాడ్యాలను గుర్తించడంలోనూ, కుదర్చడంలోనూ, శాస్త్రీయమైన పద్ధతులను అవలంభిస్తూవుంది. సుఖవ్యాధులు కంటికికనబడని సూక్ష్మక్రిములవల్లను కలుగుతూ వున్నవి. చాలాశక్తిగలిగిన మైక్రోస్కోప్ – Microscope – అనే యంత్రం ద్వారా పరీక్షచేసి, సెగ క్రిమినీ – వాసిర్‌మన్ ఖాన్ పరీక్షలుచేసి సవాయి క్రిమినీ, ఈ డాక్టర్లు కనుక్కోగలరు. మణిమీదనూ, మణిచర్మంమీదనూ, మూత్రద్వారంలోనూ, దోనెలోనూ, మూత్రికలోనూ, యోనిలోనూ తటస్థించే ప్రతీపుండూ, ఆ పుండువల్లను తయారయ్యే రసీ చీమూ, సుఖవ్యాధులకు సంబధించినవా కావా నిర్ణయంగా తెలిసికోడం చాలా అవసరం. సెగ అంటు అయిననాడు, ఆ చీమునూ, సవాయి అంటు అయిననాడు నరంలోనుంచి

రక్తాన్నితీసీ, రోగనిర్ణయపరీక్ష చేసేవారివల్లను నిశ్చయపరుచుకుని మరీ, చికిత్స చేయించవలెను. మొన్నటి ప్రపంచ యుద్ధానంతరం పాశ్చాత్యపరిశోధకులు కనిపెట్టినపెనిసిలిన్ మందులు సుఖరోగాలను కుదర్చడంలో అద్భుతంగా పనిచేస్తూ వున్నవి. అందుచేతను, సమర్థుడైన డాక్టరుద్వారా చికిత్స చేయించడం అవసరం.

2. సుఖరోగాలు తగిలినవెంటనే డాక్టరు వద్దకు వెళ్ళవలెను; ఆలస్యం ఏమాత్రమూ పనికిరాదు. తగిలిన వెంటనే చికిత్సప్రారంభిస్తే, రోగాలు పూర్తిగానూ, త్వరగానూ కూడా నయం కావడానికి అవకాశాలు యెక్కువ. వీటి విషయంలో, ఆలస్యం మహాప్రమాదం అనే సంగతిని మళ్ళీ చెప్పడం అవసరం.

3. సమర్థుడైన డాక్టరు వద్దకు వెళ్ళినా, చికిత్స కొంత జరగగానే తగ్గిందికదా అని, చికిత్స మాని వేయడం శుద్ధ తెలివి తక్కువ. ఏ మందు యిచ్చినా, కొన్నిసందర్భాలలో, మందు ఈయకపోయినా, తమంతట తాము తగ్గిపోవడం, యీ రోగాల లక్షణం. అందుచేతను, తగ్గడం ప్రధానంకాదు. శరీరంలో ప్రవేశించిన క్రిమి పూర్తిగా శక్తిహీనంకావాలి. తగ్గినదనే భ్రమతో మధ్యలో చికిత్సమానివేస్తే యీ రోగాలు జీర్ణించి, తరువాత వయస్సు ముదిరినకొలదీ అనేకవిధాలైన బాధల్నీ, ప్రమాదాల్నీ, కల్పించగలవు.

కంటికి కనపడని సూక్ష్మాతి సూక్ష్మమైన క్రిములవల్లను కలుగుతుంది, సవాయి -Syphilis- క్రిమి, ఏవిధంగానైనాసరే రక్తంలోకి ప్రవేశించగలుగుతే, అక్కడనుంచి దాని ఆట అది ఆరంభించి, కర్రను చెద తిన్నట్టు, శరీరాన్ని, కొంచం కొంచంగా నాశనంచేసివేస్తుంది. సవాయి క్రిమి శరీరంలో ప్రవేశించడానికి, ముఖ్యమైనవి మూడు మార్గాలు వున్నవి :

1. తల్లిదండ్రుల రక్తంలో యీ క్రిమి వున్ననాడు, అది సంతానానికి సంక్రమిస్తుంది. ఏ ఆస్తిపాస్తులను యిచ్చినా ఈయక పోయినా, అమాయికులయిన తమ పిల్లలకు, తల్లిదండ్రులు, ఈ ఆస్తిని మాత్రం ముట్ట జెప్పడం జరుగుతుంది; అంతేకాదు, ఈ పీడ ఒక తరంతోనూ రెండు తరాలతోనూ వొదలదు; ఏడు తరాలవరకూ సంతానాన్ని వెంటాడేశక్తి దీనికి వున్నది.

2. మంగలిచేతను క్షవరం చేయించినప్పుడు కొందరికి ముఖమంతా కురుపులులేచి బాధ పెట్టడం చాలా మంది చూసివుంటారు. ఇది యెట్లాజరుగుతుందో తెలిసికోడం చాలా అవసరం. అంటుజాడ్యంవల్లను గడ్డంమీదను కురుపులు వున్నవారికి క్షవరంచేసిన తరువాతను, అదే కత్తితో, యితరులకు క్షవరంచేయడం తటస్థించి, గడ్డంమీదను చిన్ననాటువడితే చాలును, మొదటివారి జబ్బు తరువాతవారికి అంటుకుంటుంది. మంగలికి అంటువ్యాధి వుండివున్నా

ఆ అంటు క్షవరం చేయించుకున్న వారికి తగలడానికి అవకాశాలు వున్నవి. ఈ విధంగానే సవాయిపుండ్లు వున్నవారు వాడిన తువాళ్ళు,సబ్బులూ, తాగే గ్లాసులూ, వారి గుడ్డలూ, వాడడం వల్లనుకూడా యీ రోగం ఇతరులకు అంటుకోవచ్చును. ఒకొక్కప్పుడు ముద్దుపెట్టుకోవడంవల్లనుకూడా యీ జాడ్యం అంటుకునే అవకాశాలువున్నవి. ఇంతసులభంగా యీ రోగం అంటడానికి అవకాశంవున్నప్పటికీ, మనదేశంలో చాలామంది ప్రజలు అజ్ఞానంవల్లను తగిన జాగ్రత్తలు తీసుకోకుండా, యిటువంటి ప్రమాదాలకు గురిఅవుతూవున్నప్పటికీ, యీ జాడ్యం తగలకుండా తప్పిపోయే అవకాశాలు లేకపోలేదు సవాయి క్రిమి రెండు గంటలకన్నా యెక్కువకాలం సజీవంగావుండలేదు; అందుచేతను దానిశక్తి చచ్చిపోయేలోపుగా అది చర్మం లోపలికి చేరగలగాలి. చర్మాన్ని చీల్చుకుని లోపలికిప్రవేశించే శక్తి, సవాయి క్రిమికిలేదు. అందుచేతను, యేదోవిధంగా చర్మం నలిగిగాని గంటుపడిగాని, చిట్లిగాని. గీచుకునిగాని, పుండయిగాని, వున్ననాడే, యీ క్రిమి, ఆద్వారాన చర్మంలోపలికి ప్రవేశించగలుగుతుంది; చర్మంలోపలికి ప్రవేశించగలిగిననాడే అది ప్రమాదకరం కాగలుగుతుంది. ఎంతపల్చని చర్మమైనా, నలగకుండా ఆరోగ్యంగావున్ననాడు, ఆచర్మాన్ని సవాయిక్రిమి అంటినా అది ఏమీ చేయలేదు.

3. పైన చెప్పిన రెండు పద్ధతులలోనూ అమాయకులైన వారికి యీ రోగం తగలడంగురించి

తెలుసుకున్నాం. ఇక, స్త్రీ పురుషుల సంగమంవల్లను యీ జాడ్యంరావడం, మూడవపద్ధతి; ఇది సామాన్యమైనది. వ్యభిచారానికి అలవాటుపడినవారు కొందరు సాధారణంగా " నాశరీరం ఉక్కుతునక, రోగాలు అంటడంలేదు "అని బడాయి మాటలు చెప్పడం వింటూవుంటాం. ఇలా గొప్ప చెబుతూ చెబుతూ, యీ ఉక్కుతునకలు హఠాత్తుగా దెబ్బతింటారు. దీనికి కారణంయేమిటి ? ఆరోగ్యంగావున్న చర్మాన్ని అంటినా యీ క్రిమి యేమీచేయలేదని యిదివరలో తెలుసుకున్నాం. స్త్రీలోని బార్థోలిన్ గ్రంథులూ, పురుషుడిలోని కూపర్ గ్రంథులూ తయారుచేసే జిగటద్రవాలవల్లను, రహస్య అవయవాలు తడిసి, సురతంలో, అవయవాలు సుళువుగా జారగలగడంవల్లను, సున్నితమైన చర్మాలు నలగకుండావుండే అవకాశాలు వున్నవి. అందుచేతను, యీ భాగాలలో సవాయి క్రిమి అంటినా, ప్రమాదం తరుచు తప్పిపోవొచ్చును. కాని, యీ విధంగా తప్పించుకుంటూ, యెప్పుడో వొకప్పుడు చర్మం యెక్కడనో కొద్దిగా నలగడం తటస్థిస్తుంది ; ఆ అవకాశం రాగానే, క్రిమి లోపలికి ప్రవేశించి, దాని చరిత్ర అది ఆరంభిస్తుంది. ఇదికాక మరొక సంగతికూడా వున్నది : సవాయి ఒకసారి అంటి, ఆ క్రిమి, రక్తంలోవున్నప్పుడు, సాధారణంగా యీ రోగం మళ్ళీ తగలదు. ఈ విధమైన రెండు కారణాల వల్లను సామాన్యంగా పొరబాటుపడడానికి అవకాశాలు వున్నవి. ఇక, సవాయిక్రిమి శరీరంలో ప్రవేశించి యే రూపాన్ని బయటపడుతుందో, వెంటనే చికిత్సచేయించక అశ్రద్ధచేసినవాడు

ఏ యే విధాలను, ఏ యే దశలలో యెన్నివిధాలను బాధిస్తుందో, తెలిసికోడం అవసరం:

సవాయి క్రిమి శరీరంలో ప్రవేశించిననాడు, రెండు వారాలు తరువాతను, ఆరు వారాలు దాటేలోపుగా, అది ఒక చిన్న పుండుగా బయలుదేరుతుంది. సాధారణంగా, పురుషుడిలో, మణిమీదిచర్మం లోపలి భాగంలోనూ, తరుచు మణికింది చిన్ని యీనె మడతలలోనూ, ఒక్కొక్కప్పుడు మణిమీదనూ, అరుదుగా రహస్య అవయవాలలో ఏభాగంమీదనైనాకూడా, ఈపుండు యేర్పాటు కావొచ్చును. ఈ విధంగానే, స్త్రీలో తరుచు పై పెదవులూలో పెదవులూ, వాటి మధ్య ప్రదేశంలోనూ, రహస్య అవయం ఏ భాగంలోనైనా కూడా పుండు తయారు కావొచ్చును.

మొదటిదశలో తయారైన పుండు, అతి చిన్నదిగావుండి, చికిత్సచేయించకపోయినాకూడా తొందరలోనే మాడిపోవొచ్చును; ఏ చికిత్సచేసినా కూడా అణిగిపోవొచ్చును; ఒక్కొక్కప్పుడు, యీ పుండు వున్నట్టు గుర్తించడంకూడా జరగకపోవొచ్చును; ఈ విందగా అణాగారిపోయినంతమాత్రాన, అంటు పోయినదని భ్రమపడడం చాలా పొరబాటు. శరీరంలో ప్రవేశించగలిగిన తరువాతను, యీ క్రిమి అతిత్వరలో ఒకటి రెండుగానూ, రెండు నాలుగుగానూ, నాలుగు యెనిమిదిగానూ, యీ రీతిని సంఖ్య పెరిగిపోయి, రక్తమంతటా అలుముకునిపోతుంది. ఈ విధంగా శరీరమంతటా

ఆవహించి అనేకదశలలో అనేక విధాలను బాధిస్తుంది; వీటిని సాధారణంగా మూడుదశలుగా విడదీస్తారు :

మొదటి దశ : - Primary Stage - పైన వివరించినట్టుగా చిన్న పుండుగా తయారై, రేగ కుండావుంటే, నెమ్మదిగా మానిపోవొచ్చును; లేదా, యీపై పుండు మానిపోయి, ఘట్టి కాయగాతయారై, కొంతకాలానికి అది కురుపు కావొచ్చును. ఈ దశలో దీనిని కొరుకు - Chancre - అంటారు. ఇది బాధకరంగావుంటుంది. దీనినుంచి రసీ, రక్తమూ కూడా బయలుదేరుతవి. సాధారణంగా, యీస్థితి దాటగానే, పుండులోపలికి తినివేస్తూ, ఆభాగంలో రంధ్రం వడుతుంది; అశ్రద్ధచేస్తే, రహస్య అవయవంలో కొంతభాగాన్ని యిది నెమ్మదిగా తినేస్తుంది.

మొదటి దశలోనే సవాయి మరొకరూపాన్ని తాల్చి, గజ్జలలో దుర్మాంసంపెరిగినట్టు, వాపు తయారుకావొచ్చును. వీటిని 'బిళ్లలు' అనీ, 'అడ్డక(్రలు' అనీ - Bubos - అంటారు. కాని, ఏ పేరు పెట్టినా, ఏ రూపాన్ని తాల్చినా; వీటికన్నింటికీ సవాయి(క్రిమే కారణం. బిళ్లలూ, అడ్డక(్రలూ కొంతవరకూ పెరిగిన తరువాతను, నడకకు ఇబ్బంది కలిగించుతవి. చికిత్సచేయించకుండా అశ్రద్ధచేస్తే, యివి పుండు పడడంకూడా కద్దు; అప్పుడు శస్త్రచికిత్సకూడా అవసరం కావొచ్చును. ప్రారంభంలోనే చికిత్సచేస్తే, రెండు మూడు వారాలలో నయంకావొచ్చును. గజ్జలలోపెరిగిన దుర్మాంసం

శాద్దికాలంలో కరిగిపోతుంది. కాని, చికిత్స ఆలస్యంగా ప్రారంభిస్తే, పెరిగిన దుర్మాంసం సామాన్యస్థితికి రావడానికి ఒక్కొక్కప్పుడు సంవత్సరంకూడా పట్టవొచ్చును. క్రిమి శరీరంలో ప్రవేశించిన తరువాత, పెదవులమీదా, వేళ్ళమీదా, చనుమొనల మీదా కూడా పుండ్లు తయారు కావొచ్చును.

రెండవదశ : - Secondary Stage -. మొదటిదశలో సరియైనచికిత్స చేయకపోతే, అణగారిపోయి, సవాయిక్రిమి అవయవాలనుంచి, రక్తంద్వారా శరీరమంతటా వ్యాపిస్తుంది. ఈ స్థితిలో, ఒకవిధమైన అస్వస్థతా, తలనొప్పీ, నీరసమూ, రక్తహీనతా కలుగుతవి. తొమ్మిది వారాలు దాటగానే, శరీరమంతటా పొడలుగాని, పొక్కులు గాని తయారై పుండ్లు పడడం ప్రారంభిస్తుంది. ఒక్కొక్కడు, నొసటిమీద పొలుసులవలె పొరలు రేగడమూ, పెదవుల మీదనూ, బుగ్గలలోపలనూ, నాలుక పక్కలనూ, కూడా బాధకరమైన పుండ్లు తయారు కావడమూ మామూలు. ఇంకా ముదరనిస్తే, నోరు రెండుమూలలనూ, నాలుక పక్కలనూ, మలద్వారం దగ్గరనూ, బొటమనవేళ్ళ లోపలిపక్కలనూ, చర్మం పగిలి, రసికారే పుండ్లు తయారవుతవి. ఈ రెండవదశలో సవాయి ప్రమాదకరమైన అంటువ్యాధిగా పరిణమిస్తుంది. పుండ్లరసీ, పొలుసులూ క్రిములతో నిండివుండి, యితరులకు త్వరగా అంటుకునేస్థితి యిది. అందుచేతను, యీ స్థితిలోవున్న రోగులు అతి జాగ్రత్తగావుండి తాము వాడేబట్టలనూ, పోస్తు

వులనూ యితరులు అంటకుండావుండేటట్టు చేయవలెను. ఈ స్థితిలో సురతవ్యాపారం కూడదని చెప్పనక్కరలేదు.

రెండవదశలో బాగా ముదరనిస్తే, పై బాధలతోపాటు, కీళ్ళూ యెముకలూ పట్టుబట్టి, కదలిక కష్టం అవుతుంది. ఈ స్థితిలో సహితం, చికిత్సచేసినా, చేయక పోయినా కూడా, మూడు మొదలు ఆరు వారాలలోవుగా పై చిహ్నాలు అన్నీ అణగారిపోయి, రోగం పోయినదనిపిస్తుంది. కాని, లోలోపల దాని దుర్మార్గాన్ని మాత్రం అది మానదు. దానంతటను అది తగ్గిపోయే దొంగతనం వుండడమే, యీరోగం లోని పెద్ద ప్రమాదం. ఇందువల్లనే దొంగవైద్యులు యేవో మందులు యిచ్చి, యిలా తగ్గగానే, తమమందు గుణమిచ్చినదని మోసం చేయడానికి అవకాశం వున్నది.

మూడవ దశ - Tertiary Stage -. రెండవదశకూడా దాటి, రెండు సంవత్సరాలు ఉపేక్షచేస్తే సవాయిక్రిమి శరీరాన్నంతనీ ఆవహిస్తుంది. కాని, దీనిపూర్తి దుర్మార్గం బయటపడడానికి యింకా ఇరవైముప్ఫై సంవత్సరాలుకూడా పట్టవొచ్చును. అప్పటికి క్రిమి అవయవా లలో ప్రవేశించి శల్యగతంకూడా అయి, ఎముకలబలాన్ని పాడు చేస్తుంది గుండెకాయనుగాని, గుండెకాయనుంచి వెలువడే పెద్దహృదయనాళాన్ని గాని ఆవహిస్తే, హఠాత్తుగా గుండె ఆగిగాని, హృదయనాళం పగిలినాని వెంటనే మరణించడం తటస్థి స్తుంది. మెదడును ఆవహిస్తే, మెదడు మెత్తబడి, అనేక

విధాలైన మానసికవ్యాధులు కలిగి, చివరకు మతిచెడడం కూడా తటస్థిస్తుంది. వెన్నెముకను ఆవహిస్తే, శరీరం కింది భాగంలోని అవయవాల కదలిక పట్టుతప్పి, మల మూత్రాల విసర్జన సహితం స్వాధీనంలో లేకుండాపోయి, తుదకు ప్రాణహాని కలుగుతుంది. ఈ మూడవ దశలో శల్యాగతమై, యెముకల్ని సహితం పాడుచేస్తుంది. మెత్తని పొరలతో కూడిన అవయవాలను, ముఖ్యంగా ముక్కు మొదలైనవాటిని; తినివేయడం సంగతి చెప్పనక్కరలేదు.

స వా యి వ లె నే సె గ

-Gonorrhoea -, క్రిమివల్లను అంటుకుంటుంది. సెగవున్న వారి రహస్యఅవయవాలనుంచి బయటపడే చీములో, సెగక్రిములు నిండివుంటవి. ఈ క్రిములు యేవిధంగానైనా పురుషుడికి మూత్ర ద్వారంలోనూ; స్త్రీకి మూత్రికలోనూ, గర్భముఖములోనూ ప్రవేశించగలుగుతే, సెగ అంటుకుంటుంది. సాధారణంగా సెగ అంటడానికి సెగవున్న వారితో సంగమం జరగడమే కారణం.

సెగఅంటు రహస్యఅవయవాలనుగాని, కంటిగుడ్డునుగాని అంటిననాడే ప్రమాదం యేర్పడుతుంది. శరీరం యితర భాగాలలో ఏ అవయవాలను ఈ క్రిమి అంటినా, ఇబ్బందిలేదు. ఎవరికైనా సెగఅంటు అనుమానం వున్ననాడు, చీమువున్న రహస్య అవయవాలను అంటుకున్న చేతితో కళ్లను ముట్టుకోరాదు. ఏ విధంగానైనాసరే, సెగ క్రిమి కళ్లల్లో ప్రవేశించగలిగితే, అది కంటిగుడ్డును తినివేస్తుంది.

ఒకసారి తగిలి జీర్ణించినవారికి సవాయి మళ్లీ తగలడం సాధారణంగా తటస్థించదు అని తెలుసుకున్నాం ; కాని, సెగసంగతి అట్లాకాదు. సెగ ఎన్ని సార్లైనా తగలడానికి అవకాశాలు వున్నవి. సెగ అంటు క్రొత్తగా తగిలి, జీర్ణించకముందు ఉధృతంగా వున్నవారితో సంగమం జరిగినప్పుడల్లా, సెగ మళ్లీ మళ్లీ తగలవొచ్చును. ఎటువొచ్చినా, సెగ జీర్ణించివున్నవారికి, తరువాతను తగిలిన అంటులు, తొలిసారి అంత విస్తారంగా బాధించవు.

సెగక్రిమి శరీరంలో ప్రవేశిస్తే, రెండురోజులు దాటినతరువాతను, ఎనిమిదిరోజులలోపుగా సెగ బైటపడుతుంది. తగిలినవెంటనే కనబడే చిహ్నాలు యివి : 1. మూత్రద్వారం లోపలిభాగం వాచి, మూత్రం వొదిలినప్పుడు మంటపుడుతుంది. 2. తగిలిన వెంటనే చికిత్స చేయించకపోతే, ఒక విధమైన అస్వస్థత ప్రారంభమాతుంది. అక్కడినుంచి, కటిప్రదేశం బరువెక్కడమూ, నడుము సలుపూ, మలబద్ధకమూ, ఆకలి మందంకావడమూ, తలనొప్పీ, జ్వరమూ మొదలైనబాధలు ప్రారంభమాతవి. మూత్రద్వారం బాగా వాచి, మాటి మాటికీ మూత్రవిసర్జన చేయవలెననే ఆత్రుతకలుగుతుంది. ఇకనుంచి,చిక్కని పసుపురంగుగల చీము, మూత్రనాళంద్వారా ప్రవహిస్తూ, మూత్రవిసర్జన సమయంలో బాధకరమైన మంట, ప్రారంభమాతుంది. చీముతోపాటు రక్తం కూడా ప్రవహిస్తుంది.




1 మణి  2 లింగం  3 మూత్రకోశం  4 మూత్రనాళాలు
5 శుక్లకోశం  6 శుక్లనాళం  7 ఎపిడిడిమిస్  8 వృషణం.

ఇప్పటికీ చికిత్సచేయకుండా అశ్రద్ధచేస్తే, మూత్రనాళంగుండా సెగక్రిములు యెగబాకి, మూత్రకోశంలోకీ, మూత్రనాళాలద్వారా వృక్కలలోకీ, శుక్లనాళంద్వారా ప్రయాణమై ఎపిడిడిమిస్‌లోకీ, ప్రవేశించగలవు. ఈ స్థితిలో వృషణం వాచి, బాధకరమౌతుంది; వృషణంలో, వాపు ప్రారంభమైనదంటే, ఎపిడిడిమిస్‌లో సెగక్రిములు ప్రవేశించి, వాటిఉధృతాన్ని ప్రారంభించినవన్నమాట.

ఏదైనా చికిత్సచేస్తే, బాధ తగ్గిపోయి, రోగం నయమైపోయినదనే భ్రమకు అవకాశం కలిగి; సెగ జీర్ణిస్తుంది. జీర్ణించిన సెగ, దారుఢ్యం వున్నంతవరకూ యెక్కువ బాధలను కలిగించదు; బాగా వేడి చేసినప్పుడు మూత్రవిసర్జన వేడిగావుండి మంటపుడుతుంది; అప్పుడప్పుడు; మూత్రద్వారం పెదవులు అంటుకుంటూవుంటవి; బట్టమీదను చిన్నమరక పడుతూవుంటుంది; సెగక్రిములు మూత్రంలో కలిసి పోతూవుంటవి; ఈ జీర్ణించిన సెగని ఇంగ్లీషులో గ్లీట్ - Gleet - అంటారు.

గ్లీట్ స్థితిలో సెగ, జీర్ణించి శరీరంలో అణగారిపోయివున్న తరువాత, ఆరు సంవత్సరాలు గడిస్తే, ఏ చిహ్నాలూకూడా లేకుండాపోయి, సెగ నిర్మూల మైనదేమో అనిపిస్తుంది. కాని యీ స్థితిలో - అనగా అణగారి చిహ్నాలు యేమీలేకుండా, ఆరు సంవత్సరాలు దాటిన తరువాతనుకూడా - అంటువున్నవారిని యే విధంగానూ బాధించక పోయినా, ఇతరులకు అంటుకోడంలోమాత్రం, ఏ లోపమూ వుండదు. అయితే, అంటువున్నవారికి ప్రమాదాలు తప్పిపోయినట్టు భావించడంమాత్రం పొరబాటు.

సెగ జీర్ణించి, ఆరు సంవత్సరాల తరువాతను, ఏ జాడలూ లేకుండా పోయినట్టు కనిపించినా, కొంత కాలం గడిచి, వయసుమీరి, పటుత్వం తగ్గడం ప్రారంభం కాగానే, వివిధవిధాల భరించశక్యంకాని బాధలు ప్రారంభ

మాతవి : మూత్రనాళం చివరిభాగంలో రంధ్రాలుపడి, చిమ్మన గొట్టంలోనుంచి పోయినట్టు మూత్రం చిమ్ముతుంది; మూత్ర నాళం లోపలిభాగంలో కండలు పెరిగి, మూత్రం బయటికి బొట్టుబొట్టుగావడుతూ, మూత్రవిసర్జనలో చాలా యాతన కలుగుతుంది; ఒక్కొక్కప్పుడు, మూత్రం అసలు రాకుండానే ఆగిపోయి, కడుపు ఉబ్బిపోయి, చాలా అపాయం కలుగుతుంది. ఇక కీళ్ళు పట్టుబట్టి, కదలిక కష్టం కావడమూ. కళ్ళూ, చూపూ చెడిపోవడమూ, ఇంకా ప్రోస్టేట్ గ్రంధికీ వృక్కలకూ ప్రమాదాన్ని కల్పించి, బ్రతుకు దుర్భరం చేయడమూ, అనేకమైన వాతాలకూ, పక్షవాతానికీ కారణంకావడమూ, చివరకు ప్రాణానికి అపాయాన్ని కల్పించడమూ కూడా తటస్థిస్తుంది. పురుషుడిగతి ఈవిధం. ఇక స్త్రీ సంగతి.

పురుషుడికి సెగఅంటు, మూత్ర ద్వారం గుండానే ప్రవేశించాలి; మరొక మార్గంలేదు. ఈ సంద్భంలోకూడ, స్త్రీ, యెక్కువ దురదృష్టవంతురాలు. అంటుతగిలే అవకాశాలూ, తదనంతరం కలిగే బాధలూ కూడా ఆమెకు యెక్కువ. స్త్రీకి సెగఅంటు, దోనెమధ్యలోవున్న మూత్రద్వారంగుండాగాని, యోని లోపలిచివరను వున్న గర్భకంఠాన్నిగాని అంటుకోవొచ్చును. ఒక్కొక్కప్పుడు, యీ రెండు తావులలోనూ కూడా తగలవొచ్చును.

అంటు తగిలిన రెండు రోజుల నుంచి, ఎనిమిది రోజులలోపుగా బయటపడి, చిహ్నాలు

కనిపించుతవి. దోనెలోని మూత్రిక పక్కనువున్న చిన్న గ్రంథులతో - Para - urethra ducts - ప్రారంభించినవాడు మూత్రిక పెదవులు యెరుపెక్కి, వాచి, చీముకారడం ఆరంభ మౌతుంది. గర్భకంఠానికి తగిలిననాడు, గర్భకంఠం వాచి, చీము, యోని ద్వారా ప్రవహించడం ఆరంభిస్తుంది. ఇక కటి ప్రదేశం బరువెక్కడమూ, నడుము లాగడమూ, తలనొప్పి, జ్వరమూ, మలబద్ధకమూ, ఆకలి మందగించడమూ, మాట మాటికీ మూత్రవిసర్జనచేయవలెననే తొందర కలగడమూ మొదలైన బాధలు కలుగుతవి.




1 గర్భకంఠం 2 మూత్రకోశం 3 గర్భకోశం 4 శోణితనాళం
5 మూత్రనాళం 6 వృక్క 7 చలనఅంగుళాలు 8 శోణకోశం.

ఇప్పటికీ, చికిత్సచేయకుండా అశ్రద్ధచేస్తే, సెగక్రిములు పైకియెగబాకి, గర్భకోశంద్వారా శోణితనాళాలకూ, వీటిద్వారా శోణకోశాలకూ, మూత్రనాళాలకూ, వీటిద్వారా మూత్రకోశానికీ, వృక్కలకూ కూడా ప్రసరించగలవు. తగిన చికిత్సచేయక అశ్రద్ధచేసినా, చేసినచికిత్స సరియైనదికాక, క్రిమిని నిర్మూలం చేయలేకపోయినా, సెగ అణగారినట్టయి, జీర్ణిస్తుంది. సెగ జీర్ణించిననాడు, పురుషుడిలోవలెనే, అప్పుడప్పుడు బాగా వేడిచేసినప్పుడు మూత్రవిసర్జనలో మంటకలగడంవంటి చిహ్నాలుమాత్రం కనబడుతూ, అణగారి, గ్లీట్ స్థితిలో వుంటుంది. ఈ విధంగా, ఆరు సంవత్సరాలు గడిచిన తరువాతను, సెగ, నిర్మూలమైనదేమో అనిపిస్తుంది. కాని, యీ స్థితిలోకూడా, అంటువున్నవారిని ఏ విధంగానూ బాధించనట్టువున్నా, వీరివల్లను యితరులకు, అంటుకోడంలోమాత్రం, ఏ అభ్యంతరమూ వుండదు. జీర్ణించిన సెగ, వయస్సుమీరి, శరీరపటుత్వం తగ్గినకొలదీ, పురుషుడిలో యెన్ని యెన్ని బాధలకు కారణమైనదో, ఆ విధంగానే స్త్రీకి కూడా అనేకమైనబాధల్ని కలిగిస్తుంది. ముఖ్యంగా కీళ్లువట్టుకుపోడమూ, కీళ్లవాపులూ, వక్షువాతమూ, చివరకు ప్రాణాపాయమూ కూడా దీనివల్ల కలగవొచ్చును.

పురుషుడికిలేనిబాధలు స్త్రీకి అధికంగా కలుగుతవి, సెగవల్లను. సెగ జీర్ణించిన తరువాతను, స్త్రీకి రజోదర్శనం సరిగా కలగదు ; రానురాను, రజోదర్శన

కాలంలో పొత్తికడుపులో భరించరాని నొప్పి బయలుదేరి, గిలగిలా కొట్టుకునేటంతటి బాధను కలిగిస్తుంది. అంతేకాదు, కల కాలమూ స్త్రీకి మనస్సులో శూలంగావుండే మరొకబాధ కూడా, జీర్ణించిన సెగవల్లను కలుగుతుంది: ఇది వంధ్యాత్వం - అనగా గొడ్డాలితనం -. సెగఅంటు శోణితనాళాలవరకూ వ్యాపించిననాడు, అది ఆ నాళాలలో ఒక అభ్యంతరంగా యేర్పాటయి, శోణిత అణువు దిగజారిరావడానికీ, శుక్ల అణువు యెగబాకి యెదురువెళ్లి దానిని కలియడానికీ, వీలుకాకుండా అడ్డును కల్పిస్తుంది. ఈ కారణాలవల్లను, గర్భం కలగడానికి అవకాశం లేకుండా పోతుంది.

ఈ సందర్భంలో మరొకసంగతిని కూడా తెలియబరచడం అవసరం: గర్భకోశంలో ఒక విచిత్రం వున్నది. సెగ అంటును తనలో నిలవనీయదు గర్భకోశం. అందుచేతను, పిండం తనలో యిమిడివున్నంతవరకూ, తయారయ్యే శిశువుకు ఈ అంటుస్పర్శ కలగకుండా, గర్భకోశం కాపాడుతుంది; కాని, ప్రసవసమయంలో యోనిగుండా శిశువు బైటికిరావడంలో, యోనిలో ఆ అంటు వున్ననాడు, అది శిశువుకు తగలవొచ్చును. ఈ విధంగా, ప్రసవసమయంలో శిశువు కళ్లకు సెగఅంటు తగిలిననాడు, పుట్టిన రెండు మూడు రోజులలో, శిశువు కళ్ళు చెడిపోయి గుడ్డితనం కలగవొచ్చును. అందుచేతనే, క్రమశిక్షణపొందిన మంత్రసానులు పురుడుపోసిన నాడు, శిశువు బైటకు రాగానే, సిల్వర్ నైట్రేట్

- Silver Nitrate - అనే ద్రావకంతో, శిశువు కళ్ళను, శుభ్రం చేస్తారు. త్వరలో ఈ ద్రావకంతో శుభ్రం చేసిననాడు, శిశువు కళ్ళకు కలిగే ప్రమాదం తప్పుతుంది. ఈ మాత్రం జాగ్రత్త తీసికోనినాడు, కలిగే ప్రమాదాలను నచ్చచెప్పడానికి కొన్ని వివరాలు :

ఇంగ్లాండు దేశంలో, 1884 వ సంవత్సరంలో నేత్రవైద్యులు కొందరు, గుడ్డివారి ఆశ్రయాలను నాలుగింటిని పరీక్షచేసి, పుట్టుకనుంచీ గుడ్డితనంతో వున్న వారిలో, సెగఅంటువల్లను కన్నులుపోయిన దురదృష్టవంతుల సంఖ్య, మూడువొంతులకు పైగా వున్నదని నిర్ణయించారు. జర్మనీ దేశంలో, డాక్టర్ రీన్‌హార్డ్, గుడ్డివారి ఆశ్రయాలను పరీక్షచేసి, నూటికి ముప్ఫైవొంతులు గుడ్డితనం, సెగఅంటు వల్లనే కలిగినదని నిర్ణయించాడు. 1894 వ సంవత్సరంలో జరిగిన భారతవైద్యసమ్మేళనలో, డాక్టర్ బెనర్జీ, ఈ సంగతిని గురించి చర్చిస్తూ, ఒక్క బంగాళారాష్ట్రంలో, ముష్టివాళ్ళలో ఆరులక్షలమంది గుడ్డివారు వున్నారరీ, వీరిలో నూటికి నలభై మందికి కలిగిన పుట్టుగుడ్డితనానికి, తల్లికి వున్న సెగఅంటు కారణమని తెలియబరిచాడు. డాక్టర్ ఛార్లెస్ మేక్ ఎలిస్టర్ అభిప్రాయం ప్రకారం, పసిపిల్లలలో నూటికి ఇరవైనలుగురికి, గుడ్డితనం కలగడానికి, తల్లి దండ్రుల సెగ కారణమనీ; నూటికి ముప్ఫైవొక్కరికి గుడ్డితనం కలగడానికి సవాయి కారణమనీ, తెలియబరిచాడు.

స్త్రీలకు సాధారణంగా కలిగే బాధలలో, నూటికి యిరవై వొంతులు బాధలకు, జీర్ణించిన సెగ కారణమని మేరీ స్టోప్స్ అభిప్రాయం. క్రిమి నాశనమయి, పూర్తిగా రోగం నిర్మూలంకాకపోయినా, తగినంత చికిత్స చేయించిననాడు, సవాయి, అంటువ్యాధిగా పరిణమించకుండా ఆగుతుంది; కాని, సెగ అలాకాదు; చాలాకాలం అణగారి వున్నప్పటికీ, అది మళ్లీ తిరగబెట్టిన సమయాలలో పూర్తిగా అంటువ్యాధిగా తయారవుతుంది. అందుచేతను, సవాయి కన్న సెగ యెక్కువ ప్రమాదకరమైనది.

సంతానం విషయంలో సెగ కన్న సవాయి యెక్కువ ప్రదమాకారి. సంతానం కలగడానికి అభ్యంతరాన్ని కల్పించే లక్షణాలు వుండంవల్లను, మరి పిల్లలు పుట్టకుండా ఆపుదలను కల్పించి, సెగ, మానవజాతికి ఒక ఉపకారాన్ని చేస్తుంది. కాని, సవాయి అలాకాదు. దీని దుర్మార్గానికి అంతంలేదు. సవాయి, కామవాంఛను అధికంచేస్తుంది. అంతేకాదు, సవాయి జీర్ణించినవారికి, పిల్లలు యెక్కువగా పుట్టడంకూడాతటస్థిస్తుంది. అయితే, ఎటువంటి సంతానం కలుగుతుందో చూడండి: పుట్టుకనుంచీ వెర్రివాళ్లూ ఏ విధమైన తెలివీలేక మతిలేనివారూ, పసితనంలోనే తీరని చెవుడు కలవారూ పుట్టుకనుంచీ అవయవాలలో లోపాలుగలవారూ, పుట్టిన తరువాతనూ మరికొంతకాలమూ ఆరోగ్యంగావున్నా ఆ తరువాతను అనారోగ్యం పాడయ్యేవారూ - ఇటువంటి సంతానం కలగడానికి తల్లిదండ్రులను ఆవహించిన సవాయి కారణం.

పుట్టినపిల్లగతి అలావుండగా, యిక పుట్టుకలోవుండే దౌర్భాగ్యాలను గుర్తించండి! డాక్టర్ జార్జి ఎమ్. కోబర్, తన పరిశోధనలద్వారా తెలుసుకున్న విశేషాలు యివి: ప్రతీ నూరు గర్భవిచ్ఛిత్తులలో కడుపు పోవడానికి కారణాలను విచారిస్తే, సలభై రెండింటికైయినా తల్లిదండ్రుల సవాయి కారణమైవుంటుంది; గర్భంలోనే ప్రాణంపోయి మృతశిశువులు పుట్టడానికికూడా సవాయికారణం కావొచ్చును. సాధారణంగా, పుట్టుకముందుగాని, పుట్టిన తరువాతను కొద్దికాలంలోగాని, శిశువుకు ప్రాణంపోవడం, నూటిలో అరవైకి సవాయి కారణం; అని నిర్ధారణగా చెబుతున్నాడు, డాక్టర్ కోబర్. డాక్టర్ మాట్, ఇంగ్లాండులో రాయల్ కమిషన్ యెదరను సాక్ష్యంయిస్తూ, ఈ వివరాలను తెలియబరిచాడు: సవాయి జీర్ణించివున్న ముప్ఫై నలుగురు తల్లులకు తటస్థించిన, నూటడభై అయిదు ప్రసవాలను పరీక్షిస్తే, వీటిలో నూటనాలుగు ప్రసవాలు, నెలలు నిండకుండా జరిగినవి; నెలలునిండి ప్రసవించిన వారిలో, నలభైయొక్కరు శిశువులు పుట్టిననాడే రోగగ్రస్తులై వున్నారు. ఈ నూటడభై అయిదు ప్రసవాలలోనూ ముప్పైమంది శిశువులుమాత్రమే ఆనాటికి ఆరోగ్యంగా వున్నారు. కాని యీ ముప్పైమంది శిశువులూ అయినా, యికముందు ఆరోగ్యంగానే వుంటారు అని నమ్మడానికి వీలులేదు. ఇవీ, డాక్టర్ మాట్ తెలియబరిచిన దారుణ విశేషాలు. ఈ ప్రమాదాలనుగురించి వ్యాఖ్యానం అక్కరలేదు.

తన ఆరోగ్యాన్ని దగ్ధం చేయడమే కాక, తన వల్లను మరొకరికి వ్యాపించి సంసారసుఖాన్ని నాశనం చేయడమే కాక, సంతానప్రాప్తిని లేకుండా చేసి, అథవా సంతానం కలిగినా, అమాయకులైన వారి జీవితాలను దుర్భరం చేసి, దుర్భలమైన శరీరాలతోనూ, అంతకన్నా దుర్భలమైన మనస్సులతోనూ జన్మించి, ఈ విధంగా జన్మించిన వీరు, అప్రయోజకులు కావడమే కాక, సంఘసుఖానికీ, దేశాభ్యుదయానికీ అభ్యంతరాలుగా కూడా పరిణమించే పరిస్థితులు యేర్పాటవుతూ వున్నవి, ఈ రోగాలవల్లను. అందుచేతను, యిన్నివిధాల ప్రమాదాలను కలిగించే యీ జాడ్యాలకు గురికాకుండా వుండే మార్గాలను ప్రజలకు తెలియబరచడం చాలా అవసరం:

ఈ దుష్టత్వాల బారి పడకుండా వుండడానికి క్షేమమైనమార్గం వొక్కటే: అది, వ్యభిచారుల జోలికి పోకుండా వుండడం. సంఘశ్రేయస్సును కోరిన బుద్ధిమంతులు, తరతరాల నుంచీ నీతి పాఠాలను నేర్పుతూ, మతం పేరుతో అనేక విధాలను జాగ్రత్తలను పలుకుతూ, అవినీతి మార్గాలను అనుసరించిననాడు కలిగే నరకబాధలను విపరీతంగా వర్ణిస్తూ, మానవకోటిని సరియైన మార్గాన్ని నడిపించవలెనని యెన్ని యత్నాలు చేస్తూ వున్నా, పొరబాట్లు జరుగుతూనే వున్నవి. ప్రజలు యీ రోగాలవల్లను అనేకవిధాలుగా బాధలపాలౌతూ వున్నారు. అంతేకాదు, వీటికి గురియైన

వారితో యివి ఆగడం లేదు, అమాయికమైన సంతానాన్ని తరతరాలుగా కూడా బాధిస్తూ వున్నవి. అందుచేతను, వీటి బారిని పడకుండా వుండే మార్గాలనూ, వీటిబారిని పడిననాడు, వీటిని నయంచేసుకునే మార్గాలనూకూడా వెల్లడిచేయడం అవసరం.

ముందుగా ఒకసంగతిని తెలియ బరచాలి: సుఖరోగాలకు కారణమైన క్రిములు- Gonococcus and Spirochaeta pallida - మైక్రోస్కోప్ అనే యంత్రం ద్వారా చూస్తే, ఇవి కొన్నివందల రెట్లు అధికంగా పెరిగి నట్టయి, వీటి నిజస్వరూపం కనిపిస్తుంది, ఈ సూక్ష్మ క్రిములు కంటికి కనపడవు. అందుచేతను, శరీరంలో ప్రవేశించి వీటి దుర్మార్గం బయటపడేవరకూ, వీటి ఉనికిని గుర్తించడం వీలుకాదు. కాని, ఈ క్రిములు చాలా అల్పమైన ప్రాణులు. వీటికి అనుకూలమైన విధాన్ని, యివి శరీరంలోపలికి ప్రవేశించ లేనినాడు, యివి ఒకటి రెండు గంటలలో శక్తిహీనమై నశించిపోతవి. ఒకవేళను, శరీరం లోపలికి నలిగిన చర్మం ద్వారా ప్రవేశించగలిగినప్పటికీ ఒకటి రెండు గంటలలోపుగా కిందను వివరించిన జాగ్రత్తలను తీసుకుంటే, అంటు తగలకుండా వుండే అవకాశాలు వున్నవి :

1. సంగమం అయిన తరువాతను, ఒకటి - రెండు గంటలలోపుగా రహస్య అవయవాల పై భాగాలనూ, లోపలిభాగాలనూ, జెర్మిసైడల్ సబ్బుతో

- Germicidal Soap - బాగా కడగాలి. ఈ సబ్బు క్రిమిని నాశనం చేయగలుతుంది.

2. పెర్మాంగ్‌నేట్ ఆఫ్ పొటేషియం - Permanganate of Potassium - అనే మందును కలిపిన నీరుని వాడడం చాలా ఉపయోగకరం. ఈ మందు జీలకర్రవలె పలుకులుగా వుంటుంది. అయిదు పలుకుల్ని శేరు నీళ్లలో కలిపితే, బాగా ముదరగులాబీరంగు వొస్తుంది. నీళ్ళలో వేసిన కొద్ది సేపులో ఈ పలుకులు కరిగిపోతవి. ఆ తరువాతచు, నీటిని బాగా కలిపి, ముదరగులాబీరంగు రాగానే, ఆ నీటితో రహస్య అవయవాలను బాగా కడగాలి. పురుషుడు, మణిచర్మాన్ని బాగా వెనకకుతీసి, ఆచర్మాన్నీ, మణిగట్టులోతుల్నీ, మణికింద ఈసా మడతలలోనూ, ఈ నీరు బాగా తగిలేటట్టుగా, పదేపదే కడగడం మంచిది. ఈ విధంగా జాగ్రత్తగా కడిగిననాడు, సవాయి అంటు ప్రమాదం తప్పిపోడానికి అవకాశం వుంటుంది. కాని, సెగఅంటు మూత్రద్వారంగుండా తగులుతుంది కనుక, అందుకు కూడా జాగ్రత్తపడవలెను. ఇందునిమిత్తం, ఈ కడిగే సమయంలో మూత్రవిసర్జనచేసి, మూత్రిక పెదవులలోపలికికూడా మందునీరు పోయేటట్టుగా కడగడం ముఖ్యం. పూర్తిజాగ్రత్త కావలెనంటే, ఇరిగేషన్ - Irrigation - చేయడం మంచిది. ఇరిగేషన్ అంటే, ఈ మందునీరు మూత్ర ద్వారంలోపలికి వెళ్లేటట్టు చేయడం. ఈ ఇరిగేషన్‌ను ఏ డాక్టరయినా చేయగలడు. ఈ పద్ధతిని జాగ్రత్తగా అనుసరించాలి. స్త్రీ ఈ సందర్భంలో, రహస్య అవయవం పై భాగాలను, పెర్మాంగ్‌నేట్ ఆఫ్ పొటేషియం

కలిపిన నీళ్లతో, బాగాకడగాలి. ఈ కడగడంలో చేతిని, కిందనుంచి పైకి రానియ్యడంకన్న, పైనుంచి కిందకు పోనియ్యడం మంచిది. యోని లోపలిభాగంకూడా శుభ్రపరచడం చాలా అవసరం, కనుక; ఇందు నిమిత్తం సిరింజ్ - Syring - అనే చిమ్మన గొట్టాన్ని వాడడం మంచిది.

3. పురుషుడుమాత్రం వాడ గలిగిన మరొక సాధనంవున్నది. ఇది, ఫ్రెంచి లెటర్ -French Letter- అనే రబ్బరుతొడుగు. ఈ ఫ్రెంచిలెటర్ చుట్టచుట్టివుంటుంది. దీనిని, అలా చుట్టివుండగానే పురుష అవయవానికి చేర్చి; దాని అడుగుభాగంలో వేలాడుతూవున్న తిత్తిలోని గాలిని నొక్కివేసి; తదుపరి, దానిని మణిచర్మం మీదుగా అవయవం పొడుగునా దొర్లించివేయాలి. ఇది అవయవాన్ని అదిమిపట్టుకుంటుంది కనుక, సులభంగా ఒదిలిరాదు. దీనిని వాడడంలో, మరొక జాగ్రత్తకూడా అవసరం; మణి చర్మాన్ని వెనకకులాగి ఫ్రెంచిలెటర్‌ను ఎక్కించకూడదు; అలా చేస్తే, సంగమంలో ఫ్రెంచిలెటర్ చిరిగిపోతుంది. ఫ్రెంచి లెటర్‌ను వాడిననాడు, పురుషుడి వల్లను స్త్రీకిగాని, స్త్రీవల్లను పురుషుడికిగాని, ఏ విధమైన సుఖరోగాలూకూడా అంటుకునే అవకాశం వుండదు.

4. సుఖరోగాలు తగలకుండావుం డడానికి స్త్రీ, పురుషుడూకూడా ఉపయోగించదగిన ఒక మందువున్నది. దీనిని మామూలుగా, కేల్మెల్ ఆయింట్‌మెంట్

-Calomel Ointment- అంటారు. దీనిని ఏ డాక్టరు అయినా తయారుచేయగలడు; లేదా యెవరైనా, సరిగ్గా పాళ్లు కలిపి, స్వయంగాకూడా తయారుచేసికోవచ్చును. దీనిని తయారుచేసే విధానం చాలా సులభం : కేల్మెల్ - Calomel - అనగా రసభస్మం - మూడు భాగాలూ, హైడ్రస్ లేనోలిన్ - Hydrous Lanolin - అనేమందు, నాలుగు భాగాలూ, తెల్ల వేస్‌లైన్ - White Vaseline - రెండు భాగాలూ; ఈ మూడు పదార్థాలనూ, ఒకదానిలో వొకటి బాగా కలిసేవరకూ నొక్కి కలిపి, ముద్దగాచేసి, ఈ ముద్దను రహస్య అవయవాల లోపలను వున్న సున్నిత చర్మాలకు బాగా పట్టించాలి. పురుషుడు, మణిచర్మాన్ని వెనకకు తీసి, ఆ చర్మాన్ని కంతకీ, మణిగట్టు వెనకభాగాలకూ, మణికింది యీనె మడతలలోనూ, మూత్రికలోపలికీ పట్టించాలి. స్త్రీ, పైపెదవులనుంచి లోపలిపెదవులకూ, భగలింగనుంచి దోనె అడుగుభాగంవరకూ ఈమందును బాగా పట్టించాలి; శుభ్రమైన గుడ్డముక్కను ఈమందులో బాగా నాననిచ్చి, ఆ గుడ్డముక్కను యోనిలోనికి చొప్పించి, గర్భకంఠాన్ని ఆనేవరకూ దానిని లోపలికి నెంటాలి. ఈమందు క్రిమినాశనంచేయగలదు.

సంగమం తరువాతను, గంటా రెండుగంటలు దాటకముందు, ఈమందు వాడడంవల్లను రోగాల ప్రమాదం తప్పు తుంది; కాని, సంగమానికిపూర్వమే దీనిని వాడడంవల్లను ప్రయోజనం యెక్కువ. రహస్య అవయవాల

లోని సున్నితమైన చర్మాలు ఏ గీటువల్లనో, నలగడంవల్లనో, ఏవిధంగానైనాసరే వీటిపైపొరలో దారియేర్పడి, దానిలో సవాయిక్రిమి చేరిననాడే, రోగం అంటడానికి అవకాశం కలుగుతుంది. కనుక ఈ మందు జిగటగా వుండి అవయవాలు సులభంగా జరగడానికికూడా అవకాశాన్ని కల్పించడంవల్ల, సున్నితచర్మాలు నలిగేఅవకాశంలేకుండాకూడా ఈ మందు ఉపకారి అవుతుంది, సంగమంఅయిన గంట-రెండుగంటలు లోపుగా ఈమందును జాగ్రత్తగా వాడితే, క్రిమి, సున్నితమైన చర్మం లోపలికి ప్రవేశించి వున్నా కూడా, అది శక్తిహీనమై, త్వరలో నశించిపోతుంది. ఈపని వీలున్నంతత్వరలో జరగడం మంచిది. ఆలస్యమై, క్రిమి చర్మంలోపలకు ప్రవేశించి, అక్కడ దానికి స్థానం యేర్పాటయితే, దానికి బలంహెచ్చుతుంది; ఆ తరువాతను ఏ జాగ్రత్తలు తీసుకున్నా నిష్ప్రయోజనం. ఆస్కారం దొరకనంతసేపూ, యీ క్రిమి యెంత అల్పమైనదో, ఆస్కారం దొరకగానే, యిది అంత బలవంతమైపోతుంది.

సుఖరోగాలనుండి రక్షణను కల్పించడంలో, పెర్మాంగనేట్ ఆఫ్ పొటేషియమూ, కేలొమెల్ అయింట్మెంటూ, యెక్కువ ఉపయోగమైనవి; ఈ రక్షణను గురించి కొందరు డాక్టర్లు తెలియబరిచిన ప్రయోజనాలనుకూడా తెలియబరచడం మంచిదేమో! సైనికులకు రక్షణవిధానాలను నచ్చజెప్పి, రెండుసంవత్సరాల కాలంలో, ఇరవైవేలమంది సైనికులను పరీక్షించగా; రక్షణ విధానాలను అనుసరించిన యిరవైవేలమందిలోనూ, ఒక్కరికి కూడా, జాడ్యాల అంటు

తగలలేదు; అని సర్ ఆర్చిబాల్డు రీడ్, 1919 వ సంవత్సరంలో తెలియబరిచాడు. సుఖరోగాల అంటుకు అవకాశం కలిగిన గంట పదిహేను నిమిషాల లోపుగా, రక్షణవిధానాలను అనుసరించగా, రెండువేల నాలుగువందల ఇరవై ఆరుగురిలో ఇద్దరికిమాత్రం అంటు తగిలినది; అని ఎల్, డబుల్యూ హేర్రిసన్ అనే డాక్టరు తెలియబరిచాడు.

ఈ రక్షణవిధానాలను జాగ్రత్తగా అనుసరిస్తే ప్రమాదం వుండదుకదా, అని సాహసించడంమాత్రం తెలివైన పనికాదు; ప్రమాదాన్ని తప్పించుకున్న రెండువేల నాలుగువందల ఇరవై ఆరుగురిలోనూ ఒకరు కాకపోకూడదా అనే ధీమాకన్న, అంటు తగిలిన యిద్దరిలోనూ వొకరు యెందుకు కాకూడదు, అని అనుమానించడం తెలివికి లక్షణం.

మరొక్క సంగతి కూడా గుర్తించవలసినదివున్నది; స్త్రీకి రుతుస్రావం పూర్తిగా ఆగిపోని సమయంలో సంగమం జరిగినా; కుసుమ - అనగా తెల్లబట్ట - Leucorrhoea - వున్న స్త్రీతో సంగమం జరిగినా; ఈ రెండు సందర్భాలలోనూ ఒక్కొక్కప్పుడు పురుషఅవయవంలో చిన్నపుండు బయలుదేరడమో, లేదా, మూత్ర ద్వారంనుంచి రసికారడమో తటస్థించవొచ్చును. ఈ విధంగా తయారైన పుండూ, రసీ, సుఖరోగాలకు సంబంధించినవని పొరబాటు పడనక్కరలేదు. కాని, ఏ పుండు, యే రసి, సుఖరోగాలకు సంబంధించినవి, అనేసంగతిని నిర్ణయించడం కష్టం. అందుచేతను,

ఇటువంటి అనుమానం కలగగానే సమర్థుడైన డాక్టరు వద్దకు వెళ్ళి సలహాతీసికోడం మంచిది.

సుఖరోగాల సందర్భంలో పాశ్చాత్య వైద్యవిధానం - Allopathy - శాస్త్రీయమైన పద్ధతులను అనుసరిస్తూ వున్నది. విశాఖపట్టణం, కె. జి. ఆసుపత్రి లోనూ, మద్రాసులో, గిండీవద్దనువున్న కింగ్ ఇన్‌స్టిట్యూట్ లోనూ, ప్రత్యేక కృషిచేసిన డాక్టర్లు వున్నారు; వాసిర్‌మన్ టెస్ట్ - Wasserman Test - అనే రక్తం పరీక్షచేసి, శరీరంలో సవాయిక్రిమి వున్నదీలేనిదీ, యిది ఏ స్థితిలోవున్నదీ, ఈ డాక్టర్లు నిర్ణయంగా చెప్పగలరు. ఇప్పుడు కొన్ని వూరులలో కొందరు డాక్టర్లు "రోగనిర్ణయ వైద్యశాలలను" స్థాపించారు. రక్తం పరీక్ష - ఖాన్ టెస్ట్ - Kahn Test - చేసి, వీరుకూడా సవాయి క్రిమి శరీరంలోవున్నదీలేనిదీ చెప్పగలరు. అందుచేతను, సవాయి అనుమానం కలిగిన వెంటనే, సమర్థుడైన డాక్టరు వద్దకు వెళ్ళి నట్టయితే, వారు రక్తం తీసి, పైన వివరించిన స్థానాలలో యెక్కడికయినా పంపి, సవాయి వున్నదీలేనిదీ, ఏ స్థితిలో వున్నదీ తెలుసుకుని, అందుకుతగిన చికిత్సచేస్తారు. సెగవున్ననాడు, రోగనిర్ణయవైద్యశాలలో యెక్కడ పరీక్షచేయించినా చాలును; రహస్య అవయవంనుంచి బయలుదేరే చీమును తీసి, మైక్రోస్కోప్ - Microscope - అనే యంత్రంలో పరీక్షచేసి, రోగనిర్ణయం చేయగలరు.

సుఖరోగాలను కుదర్చడంలో, ఈ మధ్యను పరిశోధకులు కనిపెట్టిన పెనిసిలిన్ - Penicillin -

మందులు చాలా ఉపయుక్తంగా వున్నవి. తగిలినవెంటనే చికిత్స ప్రారంభిస్తే, యీ మందులు, చాలా గుణమిస్తూవున్నవి. వీటిని, ఏ సందర్భంలో యెంతవరకూ, యెలా వాడడమో డాక్టర్లవని, కనుక ఆ విశేషాలను ఇక్కడ తెలియబరచడం అవసరంకాదు. స్వతంత్రించి ఈ మందులను వాడడం తెలివైన పనికాదు. ఈ మందుల ప్రయోజనాన్ని ప్రపంచమంతటా సమర్థులైన డాక్టర్లు అంగీకరిస్తూ వున్నారు కనుక, ఈ రోగాలకు యీ నాటికి సరియైన చికిత్స లభించినదిసుమా అని నమ్మకంకలగడానికి మాత్రమే ఈ సంగతిని తెలియబరచడం. మరొక జాగ్రత్తను కూడా విశదంచేయడం అవసరం : ఏ మాత్రం చికిత్సచేసినా, రోగం ఉధృతంతగ్గి, బాధపోయి, రోగం నయమైనదనిపిస్తుంది. అంతతో చికిత్స మానివేయడం తెలివితక్కువ. డాక్టరు సలహాయిచ్చిన ప్రకారం, పూర్తి చికిత్స అయ్యేవరకూ మానరాదు. అంతేకాదు, ముఖ్యంగా సవాయి విషయంలో, పూర్తిచికిత్స అయిన తరువాత, కొంత కాలం వ్యవధియిచ్చి, మళ్లీ రక్తం పరీక్షచేయించి, పోయినదీ లేనిదీ తేల్చుకోడం చాలా అవసరం. సెగ విషయంలోకూడా, నయమైన తరువాత, కొంతకాలానికి మళ్లీ పరీక్ష చేయించడం ఉత్తమం.

సుఖరోగాల అనుమానం

ప్రారంభమైనది మొదలు, యివి పూర్తిగానయమైనవని డాక్టరు అభయం ఇచ్చేవరకూ, సంసారసుఖాన్ని అపేక్షించడం పనికి రాదు అని వేరుగా చెప్పనక్కరలేదు, కొంత తగ్గగానే భార్యా

లేదని పొరబాటుపడి సంసారాన్ని దుఃఖంపాలుచేయడం క్షమించరానికార్యం. ఈ రోగాలవల్లను కలిగే దౌర్భాగ్యం, భార్యాభర్తలతో ఆగక, అమాయికమైన వారి సంతానాన్ని కూడా బాధిస్తుందిఅనే సంగతిని ఘట్టిగా నొక్కిచెప్పడం తప్పదు.

అమాయికమైన సంతానాన్ని సహితం బాధిస్తూవుండడం వల్లను, సుఖరోగాలు, సంఘసుఖానికీ, దేశాభ్యుదయానికీ కూడా అనర్థకమనియెంచి: వీటిని గురించి ప్రతీప్రభుత్వమూ అమలులోపెట్టవలెనని, హేవెలక్ ఎల్లిస్ మొదలైన శాస్త్రజ్ఞులు కొన్ని సూచనలను చేశారు:

1. సుఖవ్యాధులపాలు కాకుండా కాపాడుకునే మార్గాలను, యుక్తవయస్సువొచ్చిన ప్రతీవారూ తెలుసుకునేటట్టుగా ప్రచారం యేర్పాటుచేసి, వీటి ప్రమాదాలకు గురికాకుండా ప్రజలు జాగ్రత్తపడే అవకాశాలను కల్పించవలెను.

2. సుఖవ్యాధులు యితర వ్యాధులవంటివే, యివి తగలగానే, కంగారుపడిపోయి, మానసికవ్యథను కల్పించుకోడం తెలివితక్కువ, అని ప్రజలకు తెలియజెప్పవలెను.

3. "నీకు యీ రోగాలు వున్ననాడు, వీటిని యితరులకు అంటించడం వల్లను, ప్రజారోగ్యాన్ని ప్రమాదం పాలుచేస్తున్నావు సుమా!" అని ప్రతివ్యక్తీ గ్రహిం

చేటట్టు ప్రచారంచేస్తూ; "నీవు ఒక కత్తిపోటుతోగాని, ఒక తుపాకిదెబ్బతోగాని, యితరుల ప్రాణాలను తీయడంకన్న, ఈ రోగాలు నీకు వున్ననాడు వీటిని యితరులకు అంటించడం యెక్కువ పాతకం"అనే నీతిని, సామాన్యప్రజ గ్రహించేటట్టుగా పెద్ద ప్రచారాన్ని సాగించాలి.

4. తల్లిదండ్రులకు సవాయి జీర్ణించి వున్ననాడు, ఈ అంటు తమ సంతానాన్ని ఆవహించి వుండడం సహజం కనుక, పిల్లలు పసితనంలో వుండగానే చికిత్స చేయించిననాడు, వారు ఆరోగ్యవంతులు కావడానికి అవకాశాలు వున్నవి; వయస్సు మీరిన తరువాతను చికిత్స పెద్ద ప్రయోజనకారి కాకపోవొచ్చును, అనే సంగతిని ప్రజలకు నచ్చజెప్పే ప్రచారం అవసరం.

5. సుఖవ్యాధులను కుదిర్చే చికిత్సను ప్రతీ వూరిలోనూ యేర్పాటుచేస్తూ; ఈ చికిత్స బీద వారికి ఉచితంగా చేయించవలెను.

మనదేశంలోవలెనే, పాశ్చాత్య దేశాలలో పూర్వం మశూచీ, కలరా, ప్లేగూ మొదలైన వ్యాధులు ఏటేటా ప్రజలకు ప్రమాదాలను కలిగించేవి. శాస్త్రీయమైన నిరోధకమార్గాలను ఆ దేశాలలోని ప్రభుత్వాలు అనుసరించి, ఆ దేశాలలో యీ వ్యాధుల్ని నిర్మూలం చేయగలిగారు. ఈవిధంగానే సుఖరోగాలను కూడా నిర్మూలం చేయవొచ్చును; అని, డాక్టరు మేరీ స్టోప్స్ వంటివారు

ఆశిస్తున్నారు. రష్యాదేశంలో, సుఖవ్యాధుల్ని నిర్మూలం చేయగలిగింది, నేటి సోవియట్ ప్రభుత్వం, అని వినికిడి.

నేటి మన భారతప్రభుత్వం కూడా ఒక మంచి యత్నానికి పూనుకున్నారని, డాక్టర్ జంగల్‌వాలా తెలియబరిచాడు: హిమాచలప్రదేశంలో, ఘుండః జాతివారు ఉన్నారు. ఈ జాతి మొత్తం జనాభా పందొమ్మిదివందలు. వీరిలో యుక్తవయస్సువొచ్చిన పదిహేను వందలమందికి రక్తం పరీక్షచేసి చూస్తే, వీరిలో నూటికి డబ్భై మంది చొప్పున, సవాయిఅంటు వున్నదని నిర్ధారణ అయ్యింది. ఇందునిమిత్తం శిక్షణపొందిన డాక్టర్లను నియమించి, అంటు వున్నదని తేలినవారికందరికీ ప్రోకైన్ పెనిసిలిన్ జి, ఇంజెక్షనులను యిచ్చి, ఘుండఃజాతిని ఆరోగ్యవంతంగా చేయడానికి యత్నాలు జరుగుతూవున్నవి. ఇటువంటి యత్నం ఇంతవరకూ ఆసియాఖండంలో యెక్కడా జరగలేదు, అని, డాక్టర్ జంగల్‌వాలా తెలియబరిచాడు. * భారత ప్రభుత్వం చేసిన ఈ ప్రయత్నం చాలా మెచ్చదగినది. రాష్ట్రప్రభుత్వాలు కూడా శాస్త్రవేత్తలు సూచించిన పద్ధతులను అనుసరించి ప్రజారోగ్యాన్ని కాపాడేయత్నాలను చేయాలి. ఏ దేశంలో నైనా ప్రజలు ఆరోగ్యంగా వున్ననాడే ఆ దేశం వృద్ధిని పొందుతుంది. ప్రజలు ఆరోగ్యంగానూ, సుఖంగానూ ఏ దేశంలో వుంటారో, ఆ దేశాన్ని ఇతర దేశాలు గౌరవించుతవి.

---

* An article by Dr. Jangalwala in Journal of the Indian Medical Association, - July 1950.

# కష్టజీవి - స్త్రీ

'కరుణ, ఒక్కటే రసం!' అని తతిమ్మా యెనిమిది రసాలనూ తోసివేశాడు, భవభూతి మహాకవి. నవరసాలలోనూ, కరుణనుమించిన రసంలేదని భవభూతి నిశ్చయం. కరుణరసం ప్రధానంగా, ఈయన రచించిన నాటకం, సంస్కృత వాఙ్మయంలో సాటిలేనిది. సీతాదేవి జీవితంలోని చివరిభాగం ఈ మహాకవి నాటకానికి ప్రధాన వాస్తువు. ఈ నాటకం 'ఉత్తర రామచరిత్ర'.

పురాణ స్త్రీల చరిత్రలలో, సీతాదేవిచరిత్ర ఆకర్షించినట్టుగా మరియేకథా, స్త్రీలను ఆకర్షించదు. అందులోనూ, సీత జీవితంలోని ఆఖరి ఘట్టాలను వింటూవుంటే, కన్నీటి తెరలలోనుంచి కరుణామూర్తి అయిన సీతాదేవి కనిపిస్తూవుంటుంది, శ్రోతలకు. ధీరత్వం, శాంతం, సహనం, యివీ సీతాదేవి జీవితంలో స్త్రీహృదయానికి ఆకర్షణ కల్పించే లక్షణాలు. వాల్మీకి మహాకవి, సీత, నాగేటిచాలులో దొరికినదనీ, అందుచేతనే, ఆమెకు 'సీత' అని నామకరణం చేయడం తటస్థించినదనీ, ఆమె భూపుత్రి అనీ వర్ణించాడు.

భూదేవికి, ఓర్పు ప్రధాన లక్షణంగా వర్ణిస్తారు, కవులు. బీటలుతీసే మండుటెండలను

సహించి, కుమ్మరించే వర్షాలలోని జలాన్ని తనలోనికి పీల్చుకుని, తాను సారవంతమై, దున్నినంతనే తనలో యిమిడివున్న సారాన్ని అంతనీ అర్పించి, తనలో నిక్షిప్తమైన బీజాన్ని ఫలప్రదంచేసి, ప్రాణికోటి అభివృద్ధికి కారణమౌతూవుంది, భూమి. సృష్టిలో, స్త్రీ నిర్వహించే కార్యమూ, స్త్రీ సహజ లక్షణాలూకూడా, భూమిని పోలుతూవున్నవి. కొన్ని సహజ కష్టాలకు పాలుకావడంలోనూ, వాటిని ఓర్పుతో భరించడం లోనూ పోలికలు వుండడంవల్ల స్త్రీని భూమితో పోలుస్తూ, స్త్రీని 'క్షేత్రం' అన్నారు పూర్వులు

స్త్రీ పురుష శరీరాల నిర్మాణం లోనే భేదంవున్నది. బాలుడికి పధ్నాలుగు సంవత్సరాల వయస్సు వొచ్చిన తరువాతనుగాని అతనిలో శుక్ల అణువులు తయారుకావు. బాలికసంగతి వేరు; ఆమె పుట్టిననాటికే, ఆమె శోణకోశాలు రెండింటిలోనూ, మొత్తం ముప్పైవేలు శోణిత అణువులు వుంటవి. ఆమెకు యుక్తవయస్సు ప్రారంభం కాగానే, ఆమె శోణకోశాలలో యిమిడివున్న శోణితఅణు వులలో ఒక్కటొక్కటీ, శోణకోశంనుంచి విడివడి, బయటపడి, తమయాత్రను ప్రారంభించుతవి. శోణకోశంనుంచి బయటపడిన తరువాతను, శోణితఅణువు, శోణితనాళాల చివరనువున్న చలనఅంగుళాలకు చిక్కుతుంది; చలనఅంగుళాలు దీనిని పట్టి, శోణితనాళాలలో ప్రవేశింపజేస్తవి; ఆ తరువాతను, శోణిత అణువు యీ నాళాలలోనుంచి దొర్లుకుంటూవొచ్చి, గర్భ

కోశంలో ప్రవేశిస్తుంది. ఈ విధంగా శోణితఅణువు తనలోనికి ప్రవేశించే సమయానికి, గర్భకోశంలో ఒకమార్పు జరుగుతుంది: గర్భకోశకండరాల లోపలనువున్న సన్ననిపొర వొకటి, గర్భకోశంనుంచి విడివడి, ఊడిపోతుంది. ఈ పొర, యిట్లా ఊడిపోడంలో గర్భకోశకండరాలలో కలిగిన వొత్తిడివల్లను, వాటినుంచి కొంతరక్తం స్రవించుతుంది. ఈ యత్నంలో యీ గర్భకోశంపొర ముక్కలు ముక్కలుగా విడిపోతుంది. ఈ విధంగా ముక్కలు అయిపోయిన పొరా, గర్భకోశకండరాల నుంచి వూరిన రక్తమూ, శోణితనాళాలనుంచి జారివొచ్చిన శోణిత అణువూ, యివన్నీ కలిసి, ద్రవరూపంగా యోనిద్వారా ప్రవహించుకునివొచ్చి, కన్నెతెరను వొత్తిగించుకుని బయట పడడం తటస్థిస్తుంది. ఈ కార్యం మొదటిసారి జరిగినప్పుడు, దానిని, సమర్త అనీ, రజస్వలకావడం అనీ, - Menarchie - అంటారు. ఇంతతో, బాలిక జీవితంలో కొత్త ఘట్టం ప్రారంభమైన దన్నమాట. ఈ విధంగా ప్రారంభమైన యత్నం, ప్రతీ యిరవైయెనిమిదేసి రోజులకూ వొక్కసారి చొప్పున, నలభై యైదు- యాభై సంవత్సరాల వయస్సు దాటేవరకూ, ప్రతీస్త్రీకీ తప్పదు. అందుచేతను, దీని పూర్తివివరాలు తెలుసుకోడం అవసరం.

శోణితఅణువు, కంటికి కనీకన పడనంత సూక్ష్మంగా వుంటుంది. అంటీ అంటనట్టుగా సూది మొనతో కాగితం మీదను గుచ్చితే పడినగుంట యెంతమాత్రం

వుంటుందో, అంతమాత్రం పరిమాణం కలిగివుంటుంది, శోణిత అణువు. శోణకోశంలో పక్వమై బయటపడే నాటికి, దీనిమీదను రెండు పొరలు కప్పివుంటవి. ఈ రెండు పొరలలోపలనూ యిమిడివుండడంవల్లను యిది ఒక గుడ్డు ఆకారంగా వుంటుంది. ఆ స్థితిలో, దీనిని కప్పివున్న పైపొరను, గ్రేఫియన్ ఫాలికిల్ - Graffian follicle - అంటారు. ఈ ఫాలికిల్ లోపలను వుండి, శోణిత అణువుకు రక్షణను కల్పిస్తూవున్న రెండవపొరను కార్పస్ లూటియం - Corpus luteum - అంటారు. ఈ లూటియం అనే పొర, పసుపుపచ్చని రంగు కలిగివుంటుంది. ఈ లూటియం చాలా శక్తి వంతమైనది; దీని చరిత్ర విచిత్రమైనది.




1 గర్భకంఠం 2 చలన అంగుళాలు 3 శోణితనాళాలు 4 గర్భకోశం

శోణకోశంలో, రెండు పొరల లోనూ యిమిడి గుడ్డు ఆకారంగావుండి, శోణిత అణువు,

పక్వమౌతుంది. ఈ గుడ్డు పక్వదశకు వొచ్చేనాటికి, శోణ కోశంలో నొక్కులు ప్రారంభమై, యీ నొక్కులవల్లను, గుడ్డు, కోశంనుంచి బైటపడుతుంది. ఇలా బైటపడడంలో, గుడ్డు పై పొరఅయిన ఫాలికిల్, చిదికిపోతుంది. ఫాలికిల్ చిదికిన తరువాతను, లూటియం అనే పసుపుపచ్చని పొరలో యిమిడి వున్న శోణితఅణువు, దొర్లుకుంటూ బయటపడుతుంది. ఈ విధంగా యిది బైటపడగానే, చుట్టూవున్న తడివల్లనో, చలన అంగుళాల కదలిక వల్లనో, మరి యే విచిత్రకారణంవల్లనో, దొర్లుకుంటూవెళ్లి, చలన అంగుళాలకు తగులుతుంది ఈ స్పర్శ తగలగానే, చలన అంగుళాలు, దీనినిపట్టి, నెమ్మదిగా శోణిత నాళంలోనికి ప్రవేశింపజేస్తవి.

శోణితనాళాల, లోపలినిర్మాణం చాలా ఆశ్చర్యకరమైనది : వీటి లోపలిభాగం వేలాడుతూవున్న సన్నని దారాలకొసలవలె యీనెలతో వుంటుంది. శోణితనాళం లోకి, లూటియంలో యిమిడివున్న శోణిత అణువు ప్రవేశించగానే, నాళంలోని యీనెలలో కదలికప్రారంభమై, యీ కదలికతో, యీనెలు శోణితఅణువును కదుపుతూ, దానిని నెమ్మదిగా గర్భకోశంవైపు నడిపించుతవి. శోణితఅణువు భావి చరిత్రను తెలుసుకునేముందు, దీనిని గురించిన మరికొన్ని వివరాలు తెలుసుకోడం అవసరం :

రజోదర్శనం ప్రారంభం కాక ముందు, రెండు రోజులు వ్యవధి వుండనగా, కొత్త శోణిత

అణువు, శోణకోశంలో పక్వంకావడం ప్రారంభిస్తుంది. పక్వమై బయటపడడానికి కొంత వ్యవధి వుంటుంది. ఈ వ్యవధి యెంత అని, అనేక పరిశోధనలు జరిగి, చివరకు నిర్ణయం జరిగింది : కాబోయే రజోదర్శనానికి సరిగ్గా పధ్నాల్గవరోజున ఫాలికిల్ చిదికి శోణిత అణువు బయటపడుతుంది అని నేటి పరిశోధకులు నిర్ణయించారు. దీనినిబట్టి లెక్కచూస్తే, సరిగ్గా యిరవై యెనిమిది రోజులకు రజోదర్శనం కలిగిననాడు, కిందటి రజో దర్శనం ప్రారంభంనుంచి, పధ్నాల్గవరోజున, ఫాలికిల్ చిదికి, లూటియంలో యిమిడివున్న శోణితఅణువు బయటపడుతుంది అని నిర్ణయం. బైటపడినది మొదలు ఒకరోజు, అనగా ఇరవై నాలుగు గంటలవరకూ, లూటియంనుంచిహార్మోన్లు ముమ్మరంగా బయలువెడలి, సరాసరి రక్తంలో కలియడం ప్రారంభమౌతుంది; అంటే ఈకాలంలో లూటియమూ శోణితఅణువూ కూడా చాలా ఉధృతంగా వుంటవి. ఈ ఉధృతస్థితి రెండు రోజులవరకూ కూడా వుండవొచ్చునని అభిప్రాయం వున్నది, ఈవిధంగా దీనినుంచి హార్మోన్లు రక్తంలో కలియడంవల్లను, అక్కడినుంచి, శరీరంలో రక్తప్రవాహం జోరుఅయి, శరీరంలో కొంత వేడిహెచ్చి, స్తనాలలోనూ శరీరంమొత్తంలోనూ కొన్నిమార్పులు ప్రారంభమౌతవి.

ఈ మార్పులలో ముఖ్యంగా గుర్తించవలసింది గర్భకోశంలో జరిగేమార్పు: ఫాలికిల్ చిలికిన రెండవరోజునుంచీ గర్భకోశకండరాలలో, ఒక కదలిక

ప్రారంభమై, గర్భకోశం లోపలిపొర వొకటి వొదులుకావడం ప్రారంభమై, రజోదర్శనానికి రెండు రోజులుముందుగా పూర్తిగా వొదులయి, రజోదర్శనం కలగడంలో యీపొర ముక్క-లౌతుంది. ఈ పొర ముక్క-లయి రజోదర్శనం కలిగేనాటికి - అనగా యిరవై యెనిమిదవనాటికి - అప్పటికే శక్తిహీనమై పోయిన శోణిత అణువు, వొడిలిపోయిన లూటియంతో సహా రజస్సావంలో కలిసి బైటికిపోతుంది. ఈ విధంగా కాకుండా, లూటియం ఉద్ధృతంగావున్న కాలంలో శుక్లఅణువు శోణిత అణువులో కలియడం తటస్థిస్తే గర్భం ప్రారంభమౌతుంది. ఈస్థితి కలగగానే, లూటియం పిండపుతెరగా తయారుకావడం ప్రారంభమౌతుంది, అంతతో, గర్భకోశంలోని తెర ముక్క-లు కాకుండా ఆగిపోయి, ఫలప్రదమైన లూటియంతోకూడిన శోణిత అణువు గర్భకోశంలోనికి దిగజారిరాగానే, యీ పొర, యేర్పాటుకాబోయే పిండానికి, పైపొరగా మారుతుంది. ప్రతీ నెలా, యీ విధంగా స్త్రీ మాతృత్వానికి ఆయత్తంకావడంలో ఆమె శరీరంలో అనుగుణంగా అనేక మార్పులు జరుగుతవి. ముఖ్యంగా, ఫాలికిల్ చిదికి, లూటియం బయటపడిన తరువాత, అయిదవరోజునుంచీ, స్తనాలలో మార్పు ప్రారంభమై, రజోదర్శనం కలిగేనాటికి యేడురోజులు ముందుగా, స్తనాలు బిగువులయి వీటిలో మార్పు ఆరంభిస్తుంది. కాని, శుక్లశోణిత అణువుల కలయిక జరగకపోతే, రజోదర్శనం ప్రారంభం కాగానే, స్తనాలలో బిగువుపోయి సామాన్యస్థితి యేర్పడుతుంది.

ఇప్పటికి విశదమైన విషయాలను బట్టి, ప్రతీనెలా స్త్రీ మాతృత్వానికి సిద్ధమౌతూ వుంటుంది ; అందుకు అనుగుణంగా, ఆమె శరీరంలోకూడా అవసరమైన మార్పులు జరుగుతూ వుంటవి, అని నిర్ణయమౌతుంది. కాని, ఈ యత్నం ఫలప్రదంకాక, శుక్లఅణువు జయప్రదంగా శోణిత అణువును చేరలేకపోతే, ఇరవైయెనిమిదవ నాటికి, శక్తిహీనమై పోయిన లూటియమూ, నిర్జీవమైన శోణితఅణువూకూడా, ముక్కలైపోయిన గర్భకోశపు పొరతోనూ, స్రవించే రక్తంతోనూ కలిసి, బయటికి ప్రవహించిపోతవి. ప్రతీ యిరవైయెనిమిది రోజులకూ ఒక్కసారి చొప్పున తటస్థించే దీనిని రజోదర్శనం - Menses - అంటారు. ఈ రజోదర్శనాన్ని ప్రతీదాన్నీ మూడు దశలుగా భాగించవొచ్చును.

1. పూర్వదశ - రజోదర్శనానికి ముందుగాపధ్నాలుగు రోజులనుంచి శరీరంలో వేడి హెచ్చుతూ, వారం రోజులకు రజోదర్శనం ప్రారంభమౌతుందనగా, శరీరంలో రక్తప్రవాహం జోరుకావడమూ, కొద్దిగా నడుములాగడమూ కటిప్రదేశం బరువెక్కడమూ, రహస్యయింద్రియాలలో కొంత బిగువు కలగడమూ, వాటిలో వేడి కలగడమూ, గుండెకాయ కొంచెం చురుకుగా కొట్టుకోడమూ, మొదలైనచిహ్నాలు కనిపించుతవి.

2. మధ్యదశ-మూడు మొదలు అయిదు రోజులవరకూ రుతుస్రావం బయటకు ప్రవహిస్తూ

వుంటుంది. మామూలుగా మూడు - నాలుగు రోజులు లెక్క. సాధారణంగా ఆరంభంనుంచి రెండవరోజువరకూ యెక్కువగా ప్రవహించి, మూడవనాటికి తగ్గడమే కాక, పల్చబడి, యెరుపు తగ్గి, మూడవరోజు కాగానే మామూలుస్థితి యేర్పడవొచ్చును.

3. పరదశ - రుతుస్రావం ఆగి పోయిన తరువాతను, నాలుగైదు రోజులలో గర్భకోశంలోని రక్తకూసాలు, తమలో కలిగిన మార్పును సర్దుకుని, మామూలు స్థితిని పొందుతవి. ఈ దశలో యోని, స్పర్శసుఖాన్ని యెక్కువగా అనుభవింపజేస్తుంది.

రజోదర్శనకాలంలో స్త్రీకి శారీరికంగానూ మానసికంగానూ వుండేస్థితులను గురించిన వివరాలను శాస్త్రజ్ఞులు తెలియబరిచారు : అలసట త్వరగా కలగడమూ, బద్ధకమూ, తోచనితనమూ, నోటిలో నీరు యెక్కువగా వూరి ఉమ్మురావడమూ, చూపూ వినికిడీ కొంచెం మందం కావడమూ, కళ్ళు కొద్దిగా వాచినట్టు వుండడమూ, ముక్కులు బిగిసినట్టు వుండడమూ, ఉండి వుండి నాడి దుడుకుగా కొట్టుకోడమూ, గొంతుకు కొద్దిగా బొంగురుపోడమూ, ఒక మోస్తరు తలనొప్పీ, మొదలైన లక్షణాలు సామాన్యంగా కనిపించుతవి. ఈ చిహ్నాలు అన్నీ అందరికీ వుండవు; తత్వాలను బట్టి ఈ చిహ్నాలు కొందరిలో కొన్ని, మరికొందరిలో మరికొన్ని వుంటవి. ఆకలీ, జీర్ణశక్తీ విషయంలో ఒక విచిత్రం వున్నది : కొందరికి రుతుదర్శన కాలంలో, విపరీతమైన ఆకలి కలుగుతుంది;

కొందరికి ఆకలి చచ్చిపోయి, తిండిమీదను కాంక్ష వుండదు. వయస్సు మీరుతూవున్నకొద్దీ, తత్వంలో మార్పులు కలుగుతూ పైన వివరించిన చిహ్నాలు యెక్కువగా కనిపించవొచ్చును. వయసు మీరిన వారికి ముఖ్యంగా, కాళ్ళలో చల్లదనమూ, వాతం నొప్పులూ, పేగులలో గాలీ, కళ్ళయెదరను నల్లని తేలుతూవున్న మచ్చలు కనిపించడమూ, మొదలైన లక్షణాలు కనిపించుతవి. రజోదర్శనకాలంలో స్త్రీకి చీకాకూ, కోపమూ, విసుగుదలా, చలచిత్తమూ, మొదలైన వికారాలు కొన్ని కలగడం సహజం. రజోదర్శనకాలంలో కొందరికి మలం హెచ్చుగా పోవడంకూడా వుంటుంది. రజోదర్శనం అయిపోయిన తరువాతను ప్రతీస్త్రీకీ మలబద్ధకం కలుగుతుంది.

రజోదర్శనం కలగడంలోనూ, ఆగిపోడంలోనూ తత్వాలనుబట్టీ, వంశంలోవున్న తీరులనుబట్టీ భేదాలువున్నవి. మూడు - నాలుగు రోజులు సామాన్యం అయినా, కొందరు స్త్రీలకు రజస్రావం రెండు రోజులలోనే కట్టిపోతుంది ; కొందరికి ఏడు రోజులవరకూ కట్టదు. రజోదర్శనానికీ రజోదర్శనానికీ మధ్యను వ్యవధిలోకూడ యీ విధంగానే భేదాలువున్నవి. ఇరవై యెనిమిది రోజులకు వొక్కసారి కలగడం సామాన్యంఅయినా, ఇరవై తొమ్మిది,ముప్పై, ముప్పైవొక్కటి, ముప్పైరెండు రోజుల వ్యవధివున్నా స్త్రీలు కూడా వున్నారు ; అరుదుగాఅక్కడక్కడను ఇరవై యొక్క రోజులకు రజోదర్శనం కలిగే స్త్రీలుకూడా లేకపోలేదు. ఇంతేకాదు, అక్కడక్కడను,

చాలా అరుదుగా, రజోదర్శనం అన్నమాటేలేని స్త్రీలుకూడా వుంటారు ; వారూ బిడ్డల్ని కంటూవుంటారు ; ఆరోగ్యంగానూ వుంటారు. గర్భశాస్త్రపరిశోధనచేసిన బార్క్లే, బాస్నీ, అనే యిద్దరు శాస్త్రవేత్తలు, యిటువంటి స్త్రీ ఒకామెను గురించి వివరాలు స్వయంగా తెలుసుకుని, "ఆమె కాపురం చేస్తూవున్నప్పటికీ, ముప్ఫైయేళ్లు వొచ్చేవరకూ రజోదర్శనం యెరగదు ; కాని, ఆ వయస్సు తరువాతను రజోదర్శనం కలిగి, ఆ తరువాత మూడు సంవత్సరాలకు గర్భవతి అయ్యింది" అని తమ గ్రంథంలో రాశారు. కుక్, అనే శాస్త్రవేత్త, అతిశీతలమైన గ్రీన్ లెండ్ దేశంలోని స్త్రీలసంగతిని తెలియ జేస్తూ, "శీతాకాలంలో సూర్యరశ్మి, గ్రీన్ లెండ్ లో కొన్ని మాసాలవరకూ కనిపించదు ; ఆ కాలంలో అక్కడిస్త్రీలలో నూటికి పదిమందికే, రజోదర్శనం నెలనెలా కనబడుతుంది ; తక్కిన తొంభై మంది స్త్రీలకూ శీతాకాలంఅంతా రజోదర్శనం వుండదు" అని తెలియజేశాడు. పెరుగ్వే అనే దేశంలోని 'గుఅరేనియన్' జాతిని గురించి, అజారే అనే శాస్త్రవేత్త "ఈ జాతి స్త్రీలకు రజోదర్శనానికీ రజోదర్శనానికీ మధ్యను చాలా వ్యవధి వుంటుంది ; వీరికి రుతుస్రావంకూడా చాలా తక్కువ" అని తెలియబరిచాడు. 'టయర్రాడెల్ ఫ్యూనగో' అనే దేశంలో, స్త్రీలకు రజోదర్శనం ఆరుమాసాలకు ఒకసారి కలుగుతుంది, అని హేవెలక్ ఎల్లిస్ తెలియబరిచాడు.

రజోదర్శనం గురించి కొన్ని విచిత్రమైన విశేషాలు కూడా వున్నవి: కార్యంనాడు

ముఖ్యంగానూ, ఒక్కొక్కప్పుడు వివాహకాలంలోనూ, అనుకోకుండా రజోదర్శనం కలగడం తటస్థిస్తుంది. అనుభవం గల స్త్రీలు, జాగ్రత్తగా రోజులు లెక్కపెట్టి, ఫర్వాలేదని ముహూర్తనిశ్చయం చేయిస్తారు; కాని, లెక్క తప్పించి, రజోదర్శనం హఠాత్తుగా కలుగుతుంది. దీనికి కారణం వొక్కటే: పెద్ద ఉద్రేకాలు కలిగినప్పుడు, మానసికంగా కలిగే కలవరపాటు, రజోదర్శనాన్ని త్వరితం చేస్తుంది. అందుచేతను, ముహూర్తనిర్ణయాలు చేసేటప్పుడు, కొద్దిరోజులు వ్యవధి వున్నది కదా ఫర్వాలేదని లెక్కలువేస్తే, భంగపాటుకి అవకాశం కలుగుతుంది. పెద్ద ఉద్రేకాలేకాదు, హఠాత్తుగా కలిగే దుఃఖాలూ, సంతోషాలూ కూడా, రజోదర్శనాన్ని తబ్బిబ్బుచేయగలవు. హఠాత్తుగా యిటువంటి సుఖదుఃఖాలలో యేవి కలిగినా, రజోదర్శనం ప్రారంభం కావడమే కాదు: రజోదర్శనం మధ్యలో యివి కలిగినప్పుడు, రజోదర్శనం హఠాత్తుగా ఆగిపోడం కూడా, తటస్థించవొచ్చును. వాతావరణంలో పెద్దమార్పు హఠాత్తుగా కలిగితే కూడ. యిటువంటి తబ్బిబ్బులకు అవకాశం వుంటుంది.

ఈ సందర్భంలో చెప్పదగిన విశేషం మరొక్కటి కూడా వున్నది: రజోదర్శనానికి పధ్నాలుగురోజులు ముందుగా, శోణిత అణువుగల గుడ్డు, శోణకోశం నుంచి బయటపడడం మామూలు; కాని, యీ కాలానికి కొద్దిరోజులు ముందుగా, రతిక్రీడలో అమితమైన

ఉద్రేకం కలగడం తటస్థిస్తూ, శోణకోశం నుంచి, గుడ్లు పక్వాల్లవ రోజుకు ముందుగానే కూడా బైటపడవొచ్చును.

రజోదర్శనాన్ని గురించిన కొన్ని నమ్మకాలను గురించికూడా తర్కించడం కొంతవరకూ అవసరం. మన దేశంలో దీనిని 'అంటు' గా భావించడమూ, దీనిని 'బహిష్ట' అనేశబ్దంతో అర్థయుక్తంచేసి, రజోదర్శనకాలంలో స్త్రీ అంటరానిది అయి, దూరంగా వుండడమూ కొందరిలో ఆచారం అయివున్నది. ఈ విధానాన్నిగురించి పాశ్చాత్యుల లోకూడ పూర్వం ఆచారాలువుండేవి, అని చెప్పడానికి గుఆరినోనియస్ * రాసిన ఒకపద్యం సాక్ష్యంగా కనిపిస్తూ వుంది. గుఆరినోనియస్ రాసినపద్యంలోని విశేషాలుయివి: "రజోదర్శనకాలంలో స్త్రీలు, వివాహాలకూ నృత్యాలకూ వెళ్లకూడదు; యీ రోజులలో సంగమంచేయరాదు; యెక్కువ చలికి గురికాకూడదు; ఏడ్పూ, విచారమూ కలగనీయ రాదు; ఈ రోజులలో స్త్రీలు తమచేతితో వంటచేయుట, ద్రాక్ష రసమున్న తావులకువెళ్లుట, పళ్లతోవున్న చెట్లకిందనిలుచుట పనికిరాదు." అని గుఆరినోనియస్ రాశాడు. ఆఫ్రికాలోని 'సురినాం' అనేజాతిలో ఒక ఆచారంవున్నది: వారిలో బహిష్ట అయిన స్త్రీలు, దూరంగా; ఏకాంత ప్రదేశంలో వుంటారు. ఆ రోజులలో యెవరైనా తమవేపు వొస్తూవుంటే, "మికే"

* Writing of Guarinonius quoted in Ploss - Bartel's "Woman in Biology and Anthropology" Edited by E. S. Dingwall, D. Sc., Ph. D.,

"మికే", అంటే, 'నేను మైలపడివున్నాను' అని కేకలు వేస్తారు. ఈ నాడుకూడా, పాశ్చాత్యదేశాలలో, రజోదర్శన కాలంలో స్త్రీ తయారుచేసిన కేకలూ, పచ్చళ్ళూ, రుచిగా వుండవని, కొంత నమ్మకం వున్నది. మనదేశంలోకూడ యీ కాలంలో స్త్రీ ముట్టుకుంటే పచ్చళ్లు పాడైపోతవనే నమ్మకం వున్నది. ఈ స్థితిలోవున్న ఒక్కొక్క స్త్రీగాలి తగిలితే, కొన్ని మొక్కలు వాడిపోడం తటస్థిస్తుందనికూడా నమ్మకంవున్నది. ఈ నమ్మకాలు వుత్తి చాదస్తాలా, లేక వీటిలో యేమైనా అర్థంవున్నదా, అనే ప్రశ్నను వాన్ డి వెల్డ్ అనేపరిశోధకుడు తర్కించి, ఒకసలహాను యిచ్చాడు: శాస్త్రరీత్యా నిర్ధారణ కానంత మాత్రాన, శాస్త్రరీత్యా తగినసమాధానాన్ని ఈయలేకుకనుక, డాక్టర్లు కొన్ని పురాతననమ్మకాలను తోసిపార వేస్తున్నారు; కాని రజోదర్శనకాలంలో, రజస్రావంనుంచీ, స్త్రీ స్వేదగ్రంథులనుంచీ కొన్ని విషపదార్థాలు - Toxic substances - వెలువడుతూవున్నట్టు ఈ నాడు కొందరు పరిశోధకులు నిర్ధారణచేస్తున్నారు; రక్తంలో తయారైన కొన్నివిషాలు, రజోదర్శనకాలంలో రుతుస్రావంగుండానూ, చెమటగుండానూ బయటికిపోడం తటస్థిస్తుంది అని, ఏష్నర్, జర్మను గర్భశాస్త్రనిపుణుల సంఘంలో తెలియబరిచాడు; అందుచేతను, రజోదర్శనకాలంలో స్త్రీ శరీరంనుంచీ, రజస్రావం నుంచీ వెలువడే విషపదార్థాలనుగురించీ వాటి వాసలను గురించీ తగినపరిశోధనలు జరగవలెననీ, దీనిని గుడ్డినమ్మకంగా

తోసివేయడం తగదేమో అనీ, వాన్ డి వెల్డ్ అభిప్రాయపడుతున్నాడు.

ఈ సందర్భంలో మన దేశంలో వున్న ఒక తెలివి తక్కువను తెలియబరచడం చాలాఅవసరం: రజోదర్శనకాలంలో అందునిమిత్తం, ఏ గుడ్డలనుబడితే ఆ గుడ్డలను వాడడమూ, వాటినిదుమ్ముపడేచోట్లను ఆరబెట్టడమూ మంచిదికాదు. కంటికికనబడని క్రిములు దుమ్ములో వుండే అవకాశమేకాక, దుమ్ముసహితం అశుభ్రతకు కారణంకావొచ్చును. రజోదర్శనకాలంలో రహస్యఅవయవంలోని రక్తకూపాలు పెద్దవిఅయి, సున్నితంగా వుండడంవల్లను, వీటిలో ఏ అశుభ్రత ప్రవేశించినా, అది చాలా బాధలకు ఆస్కారం కావొచ్చును. ఈ సందర్భంలో యెప్పటికప్పుడు, అతి శుభ్రమైన గుడ్డల్ని వాడడం చాలా అవసరం. చాలామంది స్త్రీలకు రహస్య అవయవంలో కలిగేబాధలు కొన్ని, ఈ అశుభ్రతవల్లను కలిగినవే అని డాక్టర్లు చెబుతున్నారు.

ప్రసవమైన తరువాతను, తిరిగి రజోదర్శనం ప్రారంభంకావడంలోకూడా, తత్వాలనుబట్టీ, వంశసాంప్రదాయాలనుబట్టీ, అనేకభేదాలు వున్నవి. కొందరు స్త్రీలకు పాలచేపు వున్నంతకాలమూ రజోదర్శనం ఆగిపోతుంది; కొందరికి పాలచేపు వుంటూవున్నా కూడా నెలనెలకూ రజోదర్శనం కలుగుతుంది; కొందరికి ప్రసవమైన తరువాతను రెండు మూడు మాసాల తరువాతనుంచీ, కొందరికి ఆరూ, యేడూ,

తొమ్మిది మాసాల తరువాతనుంచీ ప్రారంభమౌతుంది; ఎక్కువకాలం పాలిచ్చే తల్లులలో అక్కడక్కడ, అరుదుగా, రజోదర్శనం పూర్తిగా ఆగిపోడంకూడా తటస్థిస్తుంది - అని, బార్‌క్లే - బాస్నీ అనే శాస్త్రవేత్తలు తెలియబరిచారు.

రజోదర్శనకాలంలో, కామ వాంఛ యే విధంగా వుంటుంది, ఆ రోజులలో రతికి పూను కోడం తగునా, అనేసంగతులను గురించిన అభిప్రాయాలను కూడా తెలియబరచడం అవసరం: రజోదర్శనం ప్రారంభానికి ముందురోజులలోనూ, రజోదర్శనం ఆగిపోయిన తరువాతి రోజులలోనూ, స్త్రీకి కామవాంఛ తీవ్రంగా వుంటుందని, మేరీ స్టోప్స్ తెలియబరుస్తూవుంది. ఇతర రోజులలో రతికి సుము ఖులుకాని స్త్రీ సహితం, ఈ రోజులలో, కామానికి సులభంగా లొంగుతుందని, జోసెఫ్ టెన్నెన్ బాం, అభిప్రాయం. రజోదర్శనం అవుతూవున్నప్పుడు, సురతానికి పూను కోకపోడానికి, ఆకాలంలో వాంఛ తీర్చుకోడం తప్పనే నమ్మకమూ, అసహ్యంగా వుంటుందనేభావమూ ఉండడంవల్లను, కోరికను అపుకుంటారు కాని, ఆకాలంలో కామవాంఛ వుండక పోదు, అని హేవెలక్ ఎల్లిస్ అభిప్రాయం. ఒక సంగతిని మాత్రం, తెలియబరచడం అవసరం: రజస్రావం ప్రవహిస్తూ వున్నకాలంలో, స్త్రీరహస్య అవయవంలోని పల్చని చర్మాలు, చాలా సున్నితంగా వుండడంవల్లను, వీటికి యెక్కువ వొత్తిడి కలగడం మంచిదికాదని, గ్రహించడం మంచిది: ఈ కాలంలో

సురతానికి పూనుకుంటే, తరువాత శుభ్రత, జాగ్రత్తగా చేయవలెను; లేనినాడు, పురుషఅవయం మీదను - ప్రమాదకరం కాకపోయినా - చిన్న పుండు కావడానికి అవకాశం వుంటుంది.

మానవుల్ని సరిగ్గా పోలివున్న కోతుల స్థితి, యీ సందర్భంలో యెలావుంటుందో కూడా, కొందరు శాస్త్రజ్ఞులు గుర్తించారు; కీత్, అనేశాస్త్రవేత్త "చింపాంజీ" అనే పెద్దజాతి కోతిని గురించి యీ విధంగా తెలియబరిచాడు "ఈ కోతికి, తొమ్మిదీ - పది సంవత్సరాల వయస్సులో రజోదర్శనం మొదటిసారి కలిగింది; తరువాత నుంచీ, ఇరవైనాలుగు రోజులకు వొకసారి చొప్పున ప్రారంభమై, మూడురోజుల వరకూ, ఋతుస్రావంధారాళంగా ప్రవహించేది". అని. కీత్ తెలియబరిచిన సంగతులను ధృవపరుస్తూ, ఇంకొక శాస్త్రవేత్త మరొకసంగతినికూడా తెలియబరిచాడు: ఋతుస్రావం ప్రవహిస్తూవున్న కాలంలో, ఆడది, మగదానిని దాటనీయదు, అని.

రజస్వలకావడం ఏ వయస్సులో జరుగుతుంది. అనే సంగతిని నిర్ణయించడం అంతసులభంకాదు. సాధారణంగా పన్నెండూ - పదిహేను సంవత్సరాల మధ్యకాలంలో కావడం సహజం; కాని, అక్కడక్కడ పదీ పదకొండు సంవత్సరాల వయస్సులోనూ; అరుదుగా పదహారూ పద్ధెనిమిది సంవత్సరాల వయస్సులోనూ సమర్తకావడంకూడా

కద్దు. శీతలదేశవాసులకీ, ఉష్ణదేశవాసులకీ, రజస్వాలలయ్యే వయస్సులలో భేదాలు ఉన్నవి. మిల్లు, అనేశాస్త్రవేత్త "శీతల దేశాలలోకన్న, ఉష్ణదేశాలలోని బాలికలు, రెండు సంవత్సరాలు ఆలస్యంగా రజస్వాలలౌతారు" అని నిర్ణయించాడు. డాక్టర్ ఆర్. డబుల్‌యూ. ఎల్లిస్ ఈ సంగతినిగురించి కొంత పరిశోధనచేసి, సగటున లెక్కలువేసి, "శీతలదేశమైన ఇంగ్లాండులో బాలికలు, పదమూడు సంవత్సరాల ఏడుమాసాల ప్రాంతంలోనూ; ఉష్ణదేశమైన నైగీరియాదేశంలో బాలికలు, పధ్నాలుగు సంవత్సరాల అయిదుమాసాల ప్రాంతంలోనూ రజస్వాలలౌతున్నారు" * అని నిర్ణయించాడు. శీతోష్ణపరిస్థితులే కాక జాతినిబట్టీ, వంశంలోవున్న తీరునుబట్టీకూడా భేదాలు వుంటవి. ఈ సందర్భాలలో బాలికకు సాధారణంగా తల్లి లక్షణాలు రావడం మామూలు.

రజోదర్శనం ఆగిపోడం, అనగా ముట్లు ఉడగడం - Menopause- నడివయస్సు దాటిపోగానే జరుగుతుంది. ఈ సందర్భంలో కూడా, స్త్రీ తత్వాన్నిబట్టీ, వంశంలో వున్న తీరునుబట్టీ, జాతినిబట్టీ, నివసించే దేశ శీతోష్ణ పరిస్థితులనుబట్టీ, తేడాలు వుండడం సహజం. రజోదర్శనం ప్రారంభమై, అది పూర్తిగా ఆగిపోయేకాలానికి మధ్యనువుండే వ్యవధి, సాధారణంగా ముప్పై - ముప్పై అయిదు సంవత్సరాలు అని నిర్ణయించవొచ్చును. సాధారణంగా గొడ్రాలి

* R. W. B. Ellis, M. D., F. R C. P. in British Medical Journal of 15-1-1950.

కన్న, పిల్లల్ని కన్నతల్లికి యెక్కువకాలం వ్యవధి వుంటుంది. స్త్రీలకు, ఏ వయస్సులో ముట్లు ఉడగడం తటస్థిస్తుంది అనే సంగతిని పరిశోధన చేశారు, పాశ్చాత్యదేశాలలో. ఈ పరిశోధనవల్లను తేలిన వివరాలు యివి: ప్రతీ నూరుగురు స్త్రీలలోనూ నలభై మందికి, నలభైయారు - యాభై సంవత్సరాల వయస్సులోనూ; ఇరవైయారుగురికి, నలభై వొకటి - నలభై యైదు సంవత్సరాల వయస్సులోనూ, పదిహేనుగురికి, యాభై యొకటి - యాభైఅయిదు సంవత్సరాల వయస్సులోనూ పందొమ్మండుగురికి, నలభై లోపుగానూ, యాభైఅయిదు తరువాతనూ రజోదర్శనం ఆగిపోతూ వున్నట్టు విశదమయ్యింది.

రజోదర్శనం, ఆఖరిదశలో ఆగిపోడంలో, తత్వాలనుబట్టి అనేక విధాలుగా జరుగుతుంది: హఠాత్తుగా ఆగిపోడం మామూలు. కొందరికి, కొంతకాలం ఆగి, మళ్ళీ ప్రారంభమై, మరికొంతకాలం ఆగి, కొద్ది వ్యవధిలోనూ, యెక్కువ వ్యవధిలోనూ కనపడుతూ, చివరకు పూర్తిగా ఆగిపోతుంది. మరికొందరికి, యెక్కువగా రుతుస్రావం ప్రవహించి, కొంతకాలంవరకూ ఆగిపోయి, మళ్ళీవిస్తారం ప్రవాహం కలిగి, ఈవిధంగా కొంతకాలం గడిచి, తరువాత ఆగిపోతుంది. కొందరికి, రుతుస్రావం రానురాను, చాలా తక్కువ అవుతూ, యెక్కువవ్యవధియిచ్చి, మళ్ళీతక్కువగా ప్రవహిస్తూ, నెమ్మదిగా అదృశ్యమాతుంది; ఈ ఆఖరి పద్ధతిని రజోదర్శనం ఆగడం జరిగిన స్త్రీలకు, శారీరకంగానూ, ముఖ్యంగా మానసికం

గానూ విస్తారం బాధలు వుండవు; ఈ కాలంలో శరీరంలో కలిగే మార్పుల్ని, వీరు కష్టంలేకుండా భరిస్తారు.

రజోదర్శనం విరమించేకాలంలో, స్త్రీశరీరంలో అనేకమైన మార్పులు జరుగుతవి; శరీరతత్వం ఈ దశలో పూర్తిగా మార్పు పొందుతుంది. అందుచేతను, ఈ కాలంలో స్త్రీకి శారీరికంగానూ, మానసికంగానూ కొన్ని బాధలు తప్పవు. శారీరికంగా కలిగే బాధలు యివి: జీర్ణశక్తి తగ్గడమూ, మలబద్ధకమూ, పేగులలో వాయువూ, స్తనాల లోనూ కడుపులోనూ రకరకాల నొప్పులూ, నరాలలో నీరసమూ, ఉండివుండి నాడి దుడుకూ, ముఖానికి రక్తం తన్ని ముఖం జేవురించడమూ, హఠాత్తుగా శరీరంలో వేడి హెచ్చ డమూ, అకారణంగా గుండె యెక్కువగా కొట్టుకోడమూ, విస్తారంగా చెమట పోయడమూ, ఉండివుండి తల తిరగడమూ, చెవులు అప్పుడప్పుడు గళ్ళు పడడమూ, చెవులలో గింగురు శబ్దంవినపడడమూ,కళ్ళయెదరనునల్లటిమచ్చలు కనపడడమూ, శారీరికంగా కలిగే బాధలు యివి. ఇక, మానసికంగా కలిగే బాధలు: కోపమూ చీకాకూ హెచ్చుకావడమూ, తొందర పాటూ, సరియైన ఆలోచనకీ శాంతానికీ ఓపికలేకపోడమూ, దిగులూ, మనస్సులో అర్థంకాని వ్యాకులపాటూ - మామూ లుగా ఆరోగ్యంగానూ, మనస్సు నిలకడగానూ వుండే స్త్రీలకు, ఈ మానసిక వికారాలు సాధారణంగా కలుగుతవి. కాని, మామూలుగా తగినంత ఆరోగ్యం లేకనూ

హిస్టీరియాతో - అపస్మారం - బాధపడుతూనూ, నరాల సత్తువ సడలి చికాకులపాలౌతూనూవుండే స్త్రీలకు, రజో దర్శనం ఆగిపోయేకాలంలో చాలా విధాలైన బాధలు కలుగు తవి; జీవితంలో శారీరికంగానూ, మానసికంగానూ అనా రోగ్యంపాలైన స్త్రీలు, చెప్పరాని బాధలపాలై, మతిస్థిరం తప్పి, తమకీ యితరులకు కూడా, బాధకరమూ ప్రమాద కరమూ కూడా అవుతారు.

రజోదర్శనం ఆగిపోయే ముందు కాలంలో, అనగా తత్వంలో మార్పు ప్రారంభమౌతూవున్న ప్పుడు, స్త్రీకి కామవాంఛ యెక్కువకావడం సహజం. భర్త, సానుభూతి గలవాడయ్యి ఈ రహస్యాన్ని గ్రహించి, సాద రంతో ఆమె కోర్కెలను గ్రహించి ఆదరించి, ఆమె కోర్కెలను నెరవేరుస్తే, ఆమెకు కామశక్తి వయసుమీరేవరకూ నిలుస్తుంది. భర్త, అనుకూలుడుకాక, ఆమెకు అసంతృప్తి కలిగినా, ఆమె కోర్కెలు నెరవేరకపోయినా, ఆమె సంసారసుఖం అంతతో అంతమైపోతుంది; ఆమెకు, యిక వాంఛకూడా పోతుంది.

రజోదర్శనం ఆగిపోయేకాలంలో ఒకటి - రెండు సంవత్సరాలు కలిగే వొడిదుడుకులకు కంగారు పాలు కాకుండా, మనోధైర్యాన్ని కాపాడుకుని, స్త్రీ, జాగ్రత్తపడవలెను. ఇక్కడినుంచి, స్త్రీ తత్వం మారుతుంది, మానసికంగానూ శారీరకంగానూకూడా. శారీరకంగా, ఆరోగ్యం చక్కగా వుంటుంది; మానసికంగా మంచిశాంతి యేర్పడు

తుంది. భర్తలోవుండే లోపాలకు, బాధలుపడే మనస్థితి పోతుంది, భార్యకు; ఆమెకు సహనశక్తి యెక్కువౌతుంది; జీవితంలో, మంచిచెడ్డల అనుభవాలవల్లను, మనస్సు చక్కని నిలకడనుపొంది, ఓర్పూ, శాంతమూ, ప్రేమా, ప్రధానమై, తన సంసారాన్నీ తన సంతానాన్నీ ఓరిమితో చక్కదిద్దగలిగే నేర్పరితనం సహజంగా కలుగుతుంది.

ఇక్కడినుంచి, అలలకదలికలూ, గాలివిసురులూ లేక, నిర్మలంగా, నిశ్చలంగా, నీటుగావున్న అఖండగోదావరీనదిలో, నిండు తెరచాపతో, నాఫుగా, సుఖంగా, శాంతంగా సాగిపోయే పడవ ప్రయాణంవంటిది అవుతుంది, స్త్రీ జీవయాత్ర.

209

# గర్భ రహస్యం

సృష్టికథ చాలా విచిత్రమైనది. ఇంతకన్న ఆశ్చర్యకరమైన రహస్యం మరొకటి లేదు, ప్రపంచకంలో. అందుచేతనే, వైద్యులూ, వేదాంతులూ, మేధావులూ, అన్ని దేశాలలోనూ, అనాదికాలంనుంచి నేటివరకూ, ఈ రహస్యాన్ని గురించి అనేక విధాలుగా ఊహాలుచేస్తూ వొచ్చారు. గ్రీసుదేశంలో మహామేధావి అనిపించుకున్న ఎరిస్టాటిల్, రెండువేలరెండువందల సంవత్సరాల క్రితం, ఈ సమస్యను గురించి అనేక యోచనలను చేశాడు. మనదేశంలో ప్రాచీనకాలంలో అనేక గ్రంథాలలో ఈ రహస్యాన్ని గురించి చర్చవున్నది. ఈ ప్రాచీన శాస్త్రజ్ఞులు అందరూ, ఒక్క సంగతిని మాత్రం విశదంగా చెప్పగలిగారు: స్త్రీ నుంచి శోణితఅణువు బయలుదేరుతుందనీ, పురుషుడి నుంచి శుక్ల అణువు బయలుదేరుతుందనీ, వీటి రెండింటి కలయికా పిండోత్పత్తికి కారణ మౌతుందనీ మాత్రం, వీరు తెలియజేయ గలిగారు. కాని, అంతకుమించి వారు గ్రహించలేక పోయారు.

ఈ నాడు పరిశోధకులకు, ఆధునికరసాయనశాలలూ, మైక్రోస్కోప్ వంటి శక్తివంతమైన యంత్రాలూ, సులభంగా లభ్యమౌతూవుండడం వల్లను, నేటి గర్భశాస్త్ర పరిశోధకులు, అనేకమైన నిగూఢరహస్యా

లను అవగాహనచేసికోగలుగుతున్నారు. శుక్ల, శోణిత అణువుల నిర్మాణాలూ, వాటి కలయికా, అక్కడి నుంచి ప్రారంభమై పిండం ఏర్పాటూ, ఆతరువాతనుంచి వివిధదశలలో పిండం యెదుగుదలా, పిండదశలో శిశువు ఆడ - మగ నిర్ణయమూ, మొదలైన అనేక రహస్యాలు ఈ నాడు వెల్లడి అయినవి. ఈ రహస్యాలను తెలుసుకోవలెనంటే, శుక్ల శోణిత అణువుల నిర్మాణందగ్గరనుంచి ప్రారంభించడం అవసరం.



శోణిత అణువు

శోణిత అణువు గుండ్రంగా వుంటుంది. సూది మొనను కాగితంమీదను తేలికగా నొక్కితే ఎంతగుంట పడుతుందో, అంతమాత్రంవుంటుంది, దీని

పరిమాణం. దీని వ్యాసం - అడ్డకొలత - అంగుళంలో నూట యిరవైయైదవవొంతు వుంటుంది. ఇది, శోణకోశంలో యిమిడి వుండి, రజోదర్శనానికీ రజోదర్శనానికీ సరిగ్గా మధ్యకాలానికి పక్వమౌతుంది. గ్రేఫియన్ ఫాలికిల్ అనీ, కార్పస్ లూటియం అనీ, అనబడే రెండు పొరలలో యిమిడి, మొత్తమంతా గుడ్డువలె ఆకారంకలిగి వుంటుంది, శోణితఅణువు. పక్వం కాగానే, శోణకోశంనుంచి, యిది బయటపడుతుంది. ఈ బయటపడడంలో, పైపొర అయిన ఫాలికిల్ చిదికిపోతుంది. అంతలో లూటియం అనే పసుపుపచ్చని పొరలో యిమిడివుండి శోణితఅణువు బయటపడి, చలనఅంగుళాలకు చిక్కుతుంది. చలనఅంగుళాలు, దీనిని శోణితనాళంలో ప్రవేశపెడతవి. శోణిత నాళాలలోపలను వేలాడుతూవుండే యీనెల కదలిక వల్లను, శోణితఅణువు దొర్లుతూవొచ్చి, గర్భకోశం లోనికి దిగజారుతుంది. ఫాలికిల్ చిదికిన తరువాతనుంచీ శోణితఅణువు శక్తివంతంగావుంటుంది. ఈ శక్తి తగ్గిపోయే లోపుగా, శుక్లఅణువు దీనిలో చేరగలిగితే, అక్కడనుంచి సృష్టికథ ప్రారంభమౌతుంది.



శుక్ల అణువు

శుక్ల అణువు, తలా, శరీరమూ, తోకా కలిగి, సన్నగా పొడుగుగా, చేపఆకారంగా వుంటుంది.

ఇది, శోణిత అణువుకన్న చాలా చిన్నది; శక్తివంతమైన మైక్రోస్కోప్‌ద్వారా చూస్తేనేకాని కనపడదు. దీని మొత్తం పొడుగు - తోకతోసహా - అంగుళంలో అయిదువందలవొంతు, దీని శరీరం వెడల్పు, అంగుళంలో ఆరువేలవొంతు మాత్రం వుంటుంది. శుక్ల అణువులు, పురుషుడి వృషణంలోపలను గచ్చకాయవలెవున్న బీజంలో యిమిడివున్న సూక్ష్మనాళాలలో తయారవుతవి. ఈ సూక్ష్మనాళాలలో, వివిధదశలలో తయారవుతూవున్న శుక్ల అణువులు వుంటవి. ఇవి తయారుకాగానే, సూక్ష్మనాళాలనుంచి ఎపిడిడిమిస్‌లోచేరి, అక్కడ నిలవవుంటవి. ఆతరువాతను, ఎపిడిడిమిస్‌నుంచి, శుక్లనాళంగుండా తోయబడి, శుక్లనాళం - ప్రోస్టేట్ గ్రంథిని చేరేముందు విపులం అయిన భాగంలో - నిలవవుంటవి. శుక్లకోశం నుంచీ, ప్రోస్టేట్ గ్రంథి నుంచీ వెలువడే ద్రవాలలో కలిసేవరకూ, స్వతంత్రించి కదిలే శక్తి వుండదు,। శుక్లఅణువులకు. బీజాలనుంచి, యింతవరకూ జరిగే,వీటి ప్రయాణానికి శరీరంలోని యితరశక్తులు కారణం. స్ఖలనమైనప్పుడు, శుక్లకోశంనుంచీ, ప్రోస్టేట్ గ్రంథినుంచీ వెలువడే ద్రవాలతో కలిసి శుక్లఅణువులు బయటపడుతవి. రతి మితంగావున్నవారిలో, ఒక్క స్ఖలనంలో కొన్నిలక్షల శుక్ల అణువులు వుంటవి.

స్ఖలనం అయినప్పుడు, యోనిలో పడగానే, శుక్ల అణువు తోకవిదిల్చి, ఆ కదలికతో యాత్ర ప్రారంభిస్తుంది. ఈ విధంగా, ఈదుకుంటూ గర్భకంఠంద్వారా

గర్భకోశాన్నీ, దానినీ దాటి శోణితనాళాలనీ ప్రవేశిస్తుంది. శోణితనాళాల లోపలిభాగంలో ఈనెలుఉన్నవనీ, ఈ యీనెలు గర్భకోశం వైపుగా కదులుతూ, శోణిత అణువును అటువైపు నడిపించుతవనీ, యిదివరలో తెలుసుకున్నాం. ఈ యీనెల కదలిక, తనకు యెదురు అయినప్పటికీ, ఆ కదలికను ఉపయుక్త పరుచుకుని, శుక్ల అణువు యెదురు ఈదుకుని వెళ్తుంది. గర్భ కంఠం వద్దను స్ఖలనమైతే, అక్కడినుంచి ప్రయాణం ప్రారంభించిన శుక్ల అణువు, గర్భకోశం మధ్యకు చేరడానికి రెండు మూడు గంటలకాలం పడుతుంది. అక్కడినుంచి శోణితనాళాల లోపలికి చేరడానికి మరికొన్ని గంటలు పడుతుంది. ఎంత త్వరితంగా శుక్ల అణువు ప్రయాణంచేసినా, అది, శోణితఅణువును చేరడానికి, అధమం యెనిమిది గంటలు పడుతుంది. ఈ విధంగా యీదుకుని వెళ్ళగలిగిన శుక్ల అణువు, శోణితఅణువును చేరగానే చాలా విచిత్రమైన కార్యం జరుగుతుంది :

శోణితఅణువు స్పర్శ తగలగానే శుక్లఅణువు తన తలనుయెత్తి, తన తలయెదరనువున్న మొనతో, శోణితఅణువు పైవలయంమీదను ఒక్కదెబ్బ కొడుతుంది; ఆ దెబ్బకు, శోణితఅణువు పైవలయం చీలుతుంది ; ఆ చీలికగుండా శుక్లఅణువు శోణితఅణువు లోపలికి చొరబడిపోతుంది. ఈ చొరబడడంలో, శుక్ల అణువు, తలా, శరీరమూ మాత్రం లోపలకుపోయి, తోక యివతలను వుండిపోతుంది. శుక్లఅణువు, తనలో ప్రవేశించిన తక్షణం, శోణిత

అణువు, తన పైవలయంలో కలిగిన చీలికను పూడ్చివేసు కుంటుంది ; అంతేకాదు, ఆ మరుక్షణంనుంచీ, శోణితఅణువు, దుర్భేద్యమైన ఒక కోటగా తయారవుతుంది. అంటే, ఒక శుక్లఅణువు తనలో చేరగానే, ఇక యితర శుక్లఅణువులు, లోపలకు రావడానికి వీలులేకుండా చేస్తుంది. ఇంతతో సృష్టికథ ప్రారంభమౌతుంది.

ఇకనుంచి పిండం యెదుగుతూ నాలుగువారాల నాటికి, పావురంగుడ్డంత అవుతుంది; రెండు నెలలు అయ్యేటప్పటికి, కోడిగుడ్డంత అవుతుంది; నాల్గవనెల పూర్తి అయ్యేటప్పటికి, అయిదు అంగుళాల పొడవు కలిగి, రెండున్నర పౌన్ల బరువు వుంటుంది; తొమ్మిదవనెల పూర్తి అయ్యేటప్పటికి, పద్దెనిమిది అంగుళాల పొడవుకలిగి, నాలుగు మొదలు - ఆరుపౌనుల వరకూ బరువువుంటుంది; తొమ్మిదినెలల పదిదినాలకు - అనగా ప్రసవసమయానికి - ఇరవై అంగుళాల పొడవుకలిగి, ఆరుమొదలు - పది పౌనులవరకూ బరువు కలిగి వుంటుంది.

పుట్టబోయే శిశువు ఆడ - మగ నిర్ణయాన్నిగురించి, నేటి పరిశోధకులు కొన్ని రహస్యాలను తెలుసుకున్నారు. ఆడ - మగ నిర్ణయం 'క్రోమోజోంలు' - Chromosomes - అనే సూత్రాలమీదను ఆధారపడు తుంది. స్త్రీ శోణితఅణువులో అన్నీ ఎక్స్‌క్రోమోజోంలే - X Chromosomes - వుంటవి; కాని, పురుషుడి శుక్ల

అణువులలో ఎక్స్ క్రోమోజోంలూ, వై క్రోమోజోంలూ - Y Chromosomes - కూడా వుంటవి. అందుచేతను, పురుషుడినుంచి వెలువడే శుక్లఅణువు ఎక్స్ క్రోమోజోంలు వున్నది శోణిత అణువుతో చేరితే, ఎక్సతో ఎక్స కలియడం వల్లను, ఆడపిల్ల తయారవుతుంది; కాని, పురుషుడినుంచి వెలువడే వై క్రోమోజోంలుగల శుక్ల అణువు శోణితఅణువుతో చేరితే, ఎక్సతో వై కలియడంవల్లను మగపిల్లవాడు తయారవుతాడు. పురుషుడి శుక్లంలో ఎక్స, వై క్రోమోజోంలు వుండడమూ, స్త్రీ శోణితంలో, అన్నీ ఎక్స క్రోమోజోంలే వుండడమూ నిర్ణయం కావడంవల్లను, ఈ రహస్యం యిప్పుడు అవగాహన అయ్యింది. దీనినిబట్టి, శిశువు ఆడ - మగ నిర్ణయం, శుక్ల శోణిత అణువుల కలయికనాడే జరిగినట్టు అంగీకరించాలి. కాని, పిండం యెదుగుదలలో ఏడవవారం నాటికిగాని, అవయవాల యేర్పాటులో ఆడ - మగ నిర్ణయం తేలదు. పిండానికి అవయవాలు యేర్పాటు కావడంలో, ఏడవవారంనాటికి శోణ కోశాలు తయారు కావడమూ, లేక అవి దిగజారి వృషణాలు యేర్పాటుకావడమూ, అనే సమస్యమీాదను ఈ నిర్ణయం ఆధారపడుతుంది. ఇక్కడ మరొక రహస్యం వున్నది : పిండం యీ దశలో వుండగా, ఏ హార్మోన్లు ప్రధానమైతే, దానినిబట్టి కూడా నిర్ణయం జరుగుతుంది. మగతనానికి సంబంధించిన హార్మోన్లవల్లను మగపిల్లవాడూ, లేదా ఆడపిల్ల. అందుచేతను, పిండం యేడవవారంనాటికి హార్మోన్లవల్లను శిశువు ఆడ - మగ నిర్ణయం జరుగుతుంది.

గర్భం కలగగానే, స్త్రీ శరీరంలో అనేకమైన మార్పులు జరుగుతవి. 1. గర్భం కలిగిన తరువాతను రజోదర్శనం ఆగిపోతుంది; కాని, ఈ ఆగిపోడానికి యితర కారణాలు వుండవొచ్చును; అందుచేతను, ఈ ఆగడం వల్లమాత్రం గర్భం ప్రారంభమైనదని భ్రమించరాదు. 2. గర్భం ప్రారంభమైన తరువాత, రెండు - మూడు వారాలకు, ఉదయకాలంలో వికారమూ, వాంతులూ ప్రారంభమౌతవి - వీటిని వేవిళ్లు అంటారు. 3. రెండు - మూడు నెలలకు స్తనాలు బిగువుకావడమూ, చూచుకాలు మొనలు దేరి పైకి ఉబకడమూ జరుగుతుంది. 4. మూడవమాసం దాటగానే, పొత్తికడుపు యెత్తుకావడం ప్రారంభమౌతుంది. 5. నాలుగున్నరమాసాలనుంచీ, కడుపులో శిశువు కదలికలు తెలుస్తూవుంటవి.

కటిప్రదేశం యెముకలు



పురుషుడు



స్త్రీ

గర్భాన్ని తాల్చడం సందర్భంలో కొన్ని జాగ్రత్తలను తెలియబరచడం చాలా అవసరం. 1. కటి ప్రదేశం యెముకలయేర్పాటులో స్త్రీ-పురుష శరీరనిర్మాణాలలో భేదాలువున్నవి. పురుషుడి యెముకల యేర్పాటులో, మధ్యను వుండే ఖాళీ తక్కువ. స్త్రీ శరీరంలో, ఈ యెముకల యేర్పాటు వేరు. ఆమె మాతృత్వానికి వినియోగపడే నిమిత్తం, ఈ యెముకలమధ్యనువుండే ఖాళీ యెక్కువగావుండి, ప్రసవసమయంలో, ఈఖాళీగుండా శిశువు దిగజారి, రావడానికి సుఖమైనయేర్పాటు వున్నది. ఈ యెముకల యేర్పాటులో, ఇంతఖాళీలేకుండా వున్నాడు, స్త్రీ, ప్రసవంలో చాలా బాధను భరించి కూడా, ప్రసవంకాలేదు. అటువంటిస్థితిలో, కడుపుశస్త్రంచేసి, శిశువును బయటికితీసి, తల్లి ప్రాణాన్నీ; పిల్ల ప్రాణాన్నీ కాపాడవలసి వొస్తుంది. ఎముకలలో ఇటువంటి యిబ్బందివున్న స్త్రీలూ, ఈ విధంగా ఒకసారి శస్త్రం అయిన స్త్రీలూ, గర్భంతాల్చడానికి తగరు. 2. గర్భకోశాన్ని గురించిన ప్రస్తావనలో యిదివరలో, ఒక ముఖ్యవిషయాన్ని తెలుసుకున్నాం. బాలికకు పద్ధెనిమిది సంవత్సరాల వయస్సునాటికిగాని, గర్భకోశం పూర్తివికాసాన్నిపొంది, దాని కండరాలు సరియైనబలాన్ని పొందవు అని. అంటే, అప్పటికిగాని, ఆమె గర్భంతాల్చడానికి అర్హురాలుకాదు అన్నమాట. ఈ వయస్సులోపుగా గర్భవతులైన స్త్రీలు, రానురాను నీరసపడడమూ, వీరికి గర్భవిచ్ఛిత్తులు కలగడమూ, శరీరపటుత్వమూ, ఆకారమూ చెడడమూ తటస్థిస్తుంది. 3. గర్భంతాల్చి వున్నకాలంలో

స్త్రీకి మెదడు యెక్కువ శక్తివంతంగానూ, ఆమెకు తెలివి తేటలు హెచ్చుగానూ, ఆమె మనస్సు సున్నితంగానూ వుంటుంది అనే డాక్టర్ టార్నియర్ అభిప్రాయాన్ని, డాక్టర్ వినే ధృవపరిచాడు. అందుచేతనే కాబోలును, మనస్సును విహ్వాలం చేసే దారుణదృశ్యాలను చూడరాదని నిషేధంవున్నది. భీభత్స భయానక దృశ్యాలను, చూడకుండా తప్పించుకోవడమే కాక, అటువంటివి కంటపడిననాడు, ఆ ఊహలు మనస్సులో మెరగకుండా మరుపు తెప్పించుకోడం అవసరం. 4. గర్భవతి శరీర పుష్టినికలిగించే మంచి ఆహారాన్ని తీసుకుంటూ, ఆరోగ్యాన్ని జాగ్రత్తగా కాపాడుకోవాలి. ఆవిరిమీదను ఉడికిన - కుకర్ పై వంట - కాయగూరలను తినడంమంచిది; వాటిలో శక్తి హెచ్చుగావుంటుంది - విటమిన్ శక్తి - అని నేటి పాశ్చాత్య వైద్యులు తెలియజేస్తున్నారు. అజీర్ణమూ, మలబద్ధకమూ, కలగకుండాజాగ్రత్తపడడం చాలాఅవసరం. మలబద్ధకం, గర్భవతికి మహాశత్రువు అని వైద్యులు ఘట్టిగాచెబుతున్నారు. 5. గర్భం ప్రారంభమైన కొత్తలో తల్లికి పళ్లు - ముఖ్యంగా దంతాలు - చెడిపోయే అవకాశాలువుంటవి. అందుచేతను, వీటిజాగ్రత్త అవసరం. 6. గర్భం ప్రారంభించిన మూడు- నాలుగు నెలలకు స్తనాలు బిగువై, నిండుదనాన్ని పొందడం ప్రారంభమాతుంది. రోజూ రెండుసార్లు స్తనాలను గోరువెచ్చని నీటితో తడిపి, ఆల్కహాల్‌తో - Alchohol - నెమ్మదిగా మర్దనాచేయడం మంచిది. చూచుకాలు - మొనలు - మరీ చిన్నవిగావుండి,

లోపలికి ముడుచుకుని వున్ననాడు, వాటిని వేళ్ళతో నెమ్మదిగా లాగుతూ, బయటికి వొచ్చేటట్టు చెయ్యడం అవసరం.

గర్భవతిగావున్న కాలంలో కామవాంఛ కలిగిననాడు, వాంఛ తీర్చుకోడం మంచిదా కాదా, అనే సమస్యనుగురించి శాస్త్రవేత్తలు కొన్ని అభిప్రాయాలను తెలియబరిచారు: గర్భవతులుగా వున్నప్పుడు, స్త్రీలకు కామవాంఛ యెంతవరకూ వుంటుంది, అనే సమస్యను గురించి తెలుసుకునే నిమిత్తం, హేరీ కేంప్ బెల్ అనే శాస్త్రజ్ఞుడు, ఇరవైనలుగురు గర్భవతులను ప్రశ్నించి తెలుసుకున్న వివరాలు యివి: వీరిలో, ఎనమండుగురికి కామవాంఛ హెచ్చింది – ఈ యెనమండుగురిలోనూ ఒకామె వయస్సు ముప్ఫై యొక్క సంవత్సరాలు ఆమె నలుగురు పిల్లలతల్లి–; వీరిలో ఏడుగురికి కామవాంఛ బాగా తగ్గింది; మిగతా వారిలో కొందరికి కోరిక అసలు లేకుండాపోయింది; అని తెలియబరిచాడు, కేంప్ బెల్.

గర్భం ప్రారంభమైన తరువాత, మూడు – నాలుగు నెలలవరకూ కామవాంఛ యెక్కువగా వుంటుందనీ, కోరిక తీర్చుకోడంవల్లను ఏ ప్రమాదమూ లేదనీ; నాల్గవనెల తరువాతను కూడా కోర్కెతీర్చుకోవొచ్చునుగాని, పై భాగంలో గర్భానికీ, లోపల పిండానికీ, ఏవిధమైన వొత్తిడీ కలగకుండా జాగ్రత్త తీసుకోడంలో, పురుషశరీరం బరువు గర్భాన్ని అనుకోకుండానూ, పురుషఅవయవం వొత్తిడి గర్భ కంఠానికి తగలకుండానూ జాగ్రత్తఅయిన బంధనం అవసరమనీ.

హెలీనా్రైట్ అభిప్రాయపడుతూ వున్నది. గర్భం ప్రారంభమైన కొన్నిమాసాలవరకూ కామవాంఛ హెచ్చుగావుంటుందనీ కోరిక తీర్చుకోడంవల్లను యితర బాధలు కలగనినాడు, సురతం తప్పుకాదనీ, ఏడవమాసంతరువాతను మాత్రం, మానుకోడం మంచిదనీ, లియోనోరా ఐల్స్ తెలియబరుస్తూవుంది. ఏడవ మాసం తరువాతను సంగమంవల్లను, శిశువు కళ్ళకు ప్రమాదం కలగవొచ్చునని వైద్యుల అభిప్రాయం. ఈ సందర్భంలో ఒక సంగతిని ముచ్చటించడం మంచిదేమో! పశుపక్ష్యాదులలో ఒక నియమం సర్వత్రావున్నది: గర్భం కలిగిన మరుక్షణం నుంచీ, ఆడది, మగదానిని దాటనియ్యదు. కామవాంఛ ఋతుకాలంలో తప్ప, మరెప్పుడూ కలగని ప్రకృతి వుండడం వల్లనేమో, వాటి స్వభావం ఒక విధంగానూ, మానవస్వభావం మరొకవిధంగానూ వున్నది.

శోణకోశాలు, యెప్పుడైతే తమనుంచి శోణిత అణువుల్ని బయటికి పంపడం ఆపివేయడం జరుగుతుందో, ఆనాటినుంచీ స్త్రీకి గర్భంతాల్చే అవకాశం ఆగిపోతుంది. ఈ పని ఏ వయస్సులో జరుగుతుంది అంటే, సాధారణంగా నలభైఐదు - నలభైయెనిమిది సంవత్సరాల వయస్సు అని చెప్పవొచ్చును. తత్వాన్నిబట్టీ, వంశంలో తీరును బట్టీ, జాతిని బట్టీ, నివసించే దేశశీతోష్ణస్థితులనుబట్టీ భేదాలు వుండడం సహజం. పాశ్చాత్యదేశాలలో, ప్రత్యేక లెక్కలను వేసి, యాభైసంవత్సరాల వయస్సు దాటిన తరువాతను గర్భవతులైన స్త్రీల సంఖ్యను లెక్కచూస్తే, యీ కింది వివరాలు

తెలిసినవి: యాభైదాటిన ప్రతీ పదివేలమంది స్త్రీలలోనూ, డెన్మార్కు దేశంలో నాలుగువందల అరవై అయిదుగురూ; ఇంగ్లాండు దేశంలో పదహారువందల డెభ్భైయేడుగురూ, లెఖ తేలారు.

గర్భవతి అయినది మొదలు ప్రసవం అయ్యేవరకూ స్త్రీ మనస్సు ఆనందంతో కూడివుండవలెను; ఏవిధమైన దుఃఖమూ, మనస్సును పీడించే బాధలూ వుండరాదు. ఆమె కంటపడే దృశ్యాలు కూడా చక్కని ఊహలనూ, శాంతమైన భావాలనూ, ఆనందాన్నీ కల్పించేవిగా వుండాలి. గర్భవతికి యేది తినవలెననే కోరికవుంటే, దానిని ఆమెకు పెట్టవలెననే ఆచారం మనలోవున్నది. దీని రహస్యం, ఆమెకు ఏ విషయంలోనూ కూడా అసంతృప్తి వుండరాదనే నమ్మకమే కదా! శయనాగారాలు శుభ్రంగానూ, అందంగానూ వుంచడమూ, శయనాగారాలలో చక్కని బొమ్మలను వుంచడంలోనూ ఉద్దేశం యేమిటంటే, ఆ గదిలో ప్రవేశించగానే మనస్సు చక్కని ఊహలతోనూ, ఆనందంతోనూ, మంచిభావాలతోనూ నిండి వుండవలెననే నమ్మకమే!

పుట్టబోయే శిశువు అవయవస్ఫూర్తికి, గర్భవతి అయిన తల్లి శరీరం ఆరోగ్యంగానూ, బలంగానూ వుండడం అవసరం; అట్లాగే, పుట్టబోయే శిశువు మనోవికాసానికి, గర్భవతి అయినతల్లి మనస్సు శాంతంతోనూ ఆనందంతోనూ నిండివుండడం అవసరం.

222

# సుఖప్రసవం

"అనుమానం పెనుభూతం" అంటారు. అనుమానం అంటే, నిజం తెలియకపోడంకదా! ఇక, పెనుభూతం యేమిటి అంటే, భయభ్రాంతులలో పడి పోయిన మనస్సుకు, అన్నీ భూతలవలె కనపడడం అన్నమాట. పాము కాటునిగురించి తెలియజేస్తూ, ఒక సుప్రసిద్ధ వైద్యుడు, ఈ మధ్యను ఒకసంగతిని వెల్లడించాడు: విషం గల పాము కావడమూ, దాని కాటువల్లను విషం శరీరంలోనికి యెక్కి ప్రమాదం కావడమూ కన్న, పాము కాటువేయగానే, భయం వల్లను ప్రాణాలువిడిచినవారు చాలామంది వున్నారు, అని తెలియజేశాడు. "రజ్జు సర్పభ్రాంతి" అని వేదాంతులు, ఒక సందర్భంలో వాదిస్తారు. రజ్జు అంటే, తాడు. తాడును చూసి, పాము అని హడిలిపోడం, అని దీనికి అర్థం. కనుచీకటిలో తాడును తొక్కి, కెవ్వుమని కేకవేసి, ముచ్చెమటలు కమ్మి, విషం తలకు యెక్కిపోతూవుందని, ప్రాణంమీదకు తెచ్చుకో బోతాడు, "పాము కాదు, తాడు" అని, భ్రాంతిని పోగొడితే, 'అమ్మయ్య' అని, చెంబుడు నీళ్ళుతాగి, పదినిముషాలకు

సేదదేరి, లేస్తాడు, ఒకడు. మరొకడు, తాడును తొక్కగానే, గంతువేసి, వెనకకు తిరిగిచూసి, అదేమిటో పరీక్షచేసి, ఆ తాడును కాలితో తోసిపారవేసి, నవ్వుకుంటూ తనదారిని తాను పోతాడు. గుండెదిటవు వుండడం, ఉండకపోడం అని, సాధారణంగా సమాధానం చెబ్తారు, యీ తత్వాలలోని భేదాలకు.

కాన్పునిగురించి, పునర్జన్మ అనీ, గండం గడవడం అనీ, బ్రతికి బయటపడడం అనీ, అనేక విధాలుగా అంటారు. ప్రసవసమయంలో ఒక్కొక్కస్త్రీ, వేసే కేకలూ, పడే ఖంగారూ, చేసేగాభరా, వీటినిబట్టి యోచిస్తే, కాన్పు, నిజంగా పునర్జన్మయేమో అనిపిస్తుంది. ఆ సమయంలో యిటువంటి స్త్రీ చేశేగోలలో, 'ఇకవొద్దు', అనేమాటను బట్టి, 'ప్రసూతివైరాగ్యం' అనే హేళన బయలుదేరింది. ఒక్కొక్క స్త్రీ, ఏ పెద్దబాధాపడకుండా, చక్కనిఓర్పుతో సహించి, 'అదృష్టవంతురాలు! ఏం సుఖంగా ప్రసవించింది!' అనేటట్టుగా కనగలుగుతుంది. జంతులోకంలో యెక్కడ చూసినా, యీనడంలో, ఏ జంతువూకూడా విపరీతమైన బాధలను పడడం కనిపించదు, ఎందుచేతను యీ భేదం? ఈ ప్రశ్ననుగురించి. ఆధునిక పరిశోధకులు కొన్నిరహస్యాలను కనుక్కున్నారు. ఈ రహస్యాలను అర్థంచేసికోవలెనంటే,

ముందుగా నాడీమండలాన్ని గురించీ, గర్భకోశంలోని కండరా లను గురించీ, కొన్ని వివరాలను తెలుసుకోవాలి.

ఇదివరలో నాడీమండలాన్ని గురించి వివరాలు తెలుసుకున్నప్పుడు, శరీరమంతటనూ జ్ఞాననాడులు ఉన్నవనీ, ఈ జ్ఞాననాడులనుంచి వార్తలు, వెన్నెముకలోవున్న వైట్ మేటర్ - గ్రేమేటర్ల ద్వారా, మెదడు అడుగుభాగంలో వున్న థలామస్ అనే నరాలకూడలిద్వారా మెదడులోని గ్రేమేటర్ లో వివిధస్థానాలకు ప్రసరించుతవనీ, మెదడులోని స్థానాలనుంచి వెలువడే ఆజ్ఞలను, వాటికి సంబంధించిన కర్మనాడులు అమలులోపెడతవనీ, తెలుసుకున్నాం. జ్ఞాననాడుల వలెనే, శరీరంలో వివిధప్రదేశాలలోనూ, శరీరంలోపలనువున్న అస్వాధీనఅవయవాలలోనూ, నొప్పిని తెలియజేసే నరాల కొసలు వున్నవి; వీటిని నాసీసెప్టార్స్ -Nociceptors-అంటారు. జ్ఞాననాడులనుంచి వలెనే, వీటినుంచి, నొప్పికి సంబంధించిన వార్తలు వెన్నెముక మధ్యనువున్న వైట్ - గ్రేమేటర్ల ద్వారా, థలామస్ కూ, దానిద్వారా మెదడులోని గ్రేమేటర్ లోని స్థానాలకూ అందుతూ వుంటవి. ఇక్కడ నొప్పి కలుగుతూ వున్నది, అని వార్తను నాసీసెప్టార్ తెలియబరచగానే, మెదడు ఆజ్ఞాపించగా, నొప్పి కలుగుతూవున్న అవయవానికి సంబంధిం చిన కర్మనాడి కదిలి, ఆ అవయవంలోని కండరాలు ముడుచు కునేటట్టు చేస్తుంది.

1




11




1 శరీరంలోని అవయవాలనుంచి వార్తలు థలామస్ ద్వారా గ్రేమేటర్‌కు ప్రసరించడం.

11 మెదడులోని గ్రే మేటర్‌నుంచి కర్మనాడులకూ, అవయవాలకూ ఆజ్ఞలు ప్రసరించడం

1 మెదడు ఉపరిభాగంలో గ్రేమేటర్ 2 థలామస్ - నరాల కూడలి 3 వార్తల కుడియెడమ మార్పులు 4 వెన్నెపూసలోనుంచి వార్త ప్రసరింపు.

జ్ఞాననాడులనుంచీ, నొప్పిని తెలియబరిచే నాసీసెప్టార్ నాడులనుంచీ వెళ్ళేవార్తలన్నీ కూడా థలామస్ అనే నరాలకూడలి ద్వారా మెదడుకు అందుతవి. ఈ వార్తలు అందడంలో ఒక ప్రమాదం యేర్పాటు కావొచ్చును : ఏ వ్యక్తి అయినా, అనవసరంగా ఖంగారుపాలౌతూ,

అల్పవిషయాలకు కూడా భేజరాకావడం అభ్యాసమైపోతూ, గాభరాపడడం అనే స్వభావాన్ని అలవాటుచేసి వేసుకుంటే, థలామస్ - నరాల కూడలి - రానురాను మరీ సున్నితమై పోవడం తటస్థిస్తుంది. థలామస్ యెప్పుడైతే, మరీ సున్నితమై పోతుందో, దీనికి అందిన వార్తలను మెదడుకు తెలియబరచ డంలో అనవసరపు ఖంగారువొకటి తయారవుతుంది. ఈ విధంగా థలామస్, ఖంగారుగా వార్తను తెలపడంవల్లను మెదడుకూడా ఖంగారుగానే కర్మనాడుల్ని కదుపుతుంది;అంతతో కర్మనాడులు అవసరమైనదానికన్న యెక్కువగా కండరాలలో కదలికను కలిగించుతవి.

ఒక ఉపమానం, యీ స్థితిని బాగా వ్యక్తంచేస్తుంది : టెలిగ్రాం వొచ్చింది, అనగానే, పెడబొబ్బలు ప్రారంభించి, ఊరూవాడాకూడా యెగిరిపోయే టట్టు శోకాలు పెడతారు వొకరు, టెలిగ్రాంలో యేమి సంగతివున్నదోకూడా తెలుసుకోడం తరువాతిసంగతి ; ఏడవ వలసిన చెడ్డయేమీలేదు అని నిర్ధారణ అయ్యేవరకూ, ఆపశోపాలు తప్పవు, వీరికి మరొకరు, యిటువంటి అనవసరపు ఖంగారు పడకుండా వుండవొచ్చును. థలామస్ నరాలకూడలి- మరీ సున్నితమైతే, మొదటివ్యక్తి పద్ధతి తయారవుతుంది.

ప్రసవసమయంలో, ఒకరు భరించినట్టు మరొకరు భరించలేకపోడానికి, ఈ థలామస్ యెంతవరకూ కారణం ; యిది కారణమైతే, దీనికీ గర్భకోశా

నికీవున్న సంబంధం యేమిటి, అనే సంగతులను తెలిసికోవలె నంటే, ముందుగా గర్భకోశకండరాల యేర్పాటును గురించిన వివరాలను తెలుసుకోవాలి :



గర్భకోశం - కండరాలు

గర్భకోశంలోనూ, హృదయ కోశంలోనూ వున్నంతటి బలమైన కండరాలు, శరీరంలో మరియే అవయవంలోనూ లేవు. గర్భకోశం పై భాగంలోని కండరాలు, కోశం నిలువునా వుంటవి; ఈ కండరాలు ముడుచు కున్నప్పుడు, గర్భకోశం నిలువునా ముడుచుకుంటుంది.

గర్భకోశం లోపలిభాగంలో, కొన్ని కండరాలు అడ్డంగా వుంటవి; యీ అడ్డపు కండరాలు, కోశం పై భాగంలోకన్న, కోశం కింది భాగంలో- అనగా గర్భకంఠం దగ్గరను - యెక్కువ దట్టంగా వుంటవి; అందుచేతను, యీ కండరాలు ముడుచుకున్నప్పుడు గర్భకంఠం అడ్డంగా ముడుచుకుంటుంది.

నాడీమండలాన్ని గురించిన వివరాలను తెలుసుకున్నప్పుడు, ఒకవిశేషాన్ని తెలుసుకున్నాం: కేంద్రనాడీమండలం - Central Nervous System - శరీరాన్నంతనీ అలుముకుని, దాని మంచిచెడ్డలను గురిస్తుంది, అని. ఈ కేంద్రనాడీమండలంనుంచి వెలువడిన, ఉపనాడీమండలం - Sympathetic Nervous System - శరీరంలోని అస్వాధీనఅవయవాల మంచిచెడ్డలను గురిస్తుంది. ఈ ఉపనాడీమండలం శరీరంలోకలిగే ఉద్రేకాలకు స్థానం; కనుకనే, ఉపనాడీమండలానికి - థలామస్ - నరాలకూడలి - తోనూ, మెదడు తోనూ సంబంధం యెక్కువ.

ప్రసవసమయంలో, నొప్పులు ప్రారంభంకాగానే జరిగేపని యేమిటంటే: గర్భకోశంలోని నిలువుకండరాలు వొత్తిడినికల్పించి, గర్భకోశం నిలువునా ముడుచుకుంటూ, లోపలనువున్న శిశువును, గర్భకంఠంలో నుంచి బైటకు తోసివేయడం ప్రారంభమౌతుంది. ఈ నిలువుకండరాలయత్నానికి, ఏ అభ్యంతరమూ లేనినాడు, ప్రసవం సులభంగా జరుగుతుంది. ఈ నిలువుకండరాలు కేంద్రనాడీ

మండలం స్వాధీనంలో వుంటవి. గర్భకోశం, లోపలిభాగంలో వుండే అడ్డకండరాలు, ఉపనాడీమండలం స్వాధీనంలో వుంటవి. ఉపనాడీమండలం ఉద్రేకాలకు స్థానం అనీ, యీ ఉపనాడీమండలానికి థలామస్‌తోనూ, మెదడుతోనూ సంబంధం యెక్కువనీ తెలుసుకున్నాం. ప్రసవసమయంలో భయాన్ని పెంచుకుని మానసికమైన ఉద్రేకాన్ని కల్పించుకుని ఖంగారుపాలైతే, గర్భకోశంలోని అడ్డకండరాలకు వొత్తిడిని కల్పిస్తుంది ఉపనాడీ మండలం. అంతతో, గర్భకోశంలో రెండువిధాలైన వొత్తిడులు ప్రారంభమౌతవి: నిలువుకండరాలు శిశువును గర్భకంఠంద్వారా బైటికి నెట్టివేస్తూవుంటే, అడ్డకండరాలు గర్భకంఠాన్ని ముడుచుకునేటట్టుచేస్తూ, శిశువు సులభంగా బైటికి పోడానికి అభ్యంతరాన్ని కల్పించడం ప్రారంభమౌతుంది.

ఈ చిక్కు మనస్సులో ప్రారంభమై ఆలస్యమైన కొలదీ మనస్సులో బీభత్సం యెక్కువ కావడమూ, గర్భకోశంలో వొత్తిడి కలుగుతూవుంటే, నొప్పిని తెలియబరిచే నరాల కొసలు, యీ వార్తను థలామస్‌కు పంపడమూ, థలామస్ అంతతో విపరీతమైన సంచలనంలోపడి, మెదడును ఖంగారుపాలు చేయడమూ — ఈ విధంగా, కాన్పు ఆలస్యమైనకొలదీ మనస్సులో ఖంగారు పెరగడమూ, మనస్సులో ఖంగారు హెచ్చినకొలదీ కాన్పు ఆలస్యంకావడమూ తటస్థిస్తుంది. మొత్తం మీదను నిలువు కండరాలశక్తీ, కేంద్రనాడీ మండలం శక్తీ ఎక్కువైనది కావడం వల్లను, ప్రసవం ఆగదు; కాని, ఈ మధ్యలో అనవసరంగా కలిగేబాధ తప్పదు.

అయితే, ఒక స్త్రీకి లేనిఖంగారు మరొక స్త్రీకి యెందుకు కలగవలెను, అని అనుమానం కలగడం సహజం. ఈ ప్రశ్నకు శాస్త్రజ్ఞులు సమాధానం చెప్పారు : ప్రసవం అనుభవంలేని స్థితిలో – అనగా; తొలి కాన్పుకు పూర్వం – ప్రసవసమయంలో వెర్రికేకలువేసి, నానా ఖంగారూచేసే స్త్రీ పడుతూవున్న బాధను చూడడంవల్లనో, ఆ సమయంలో ఆ కేకలనూ, ఆ యేడ్పులనూ వినడంవల్లనో; లేదా ఆమ్మలక్కలుచేరి, యీ సంగతులను గురించి యిది పెద్ద బాధ అని మాట్లాడుతూవుంటే, అటువంటి సంగతులను వినడం వల్లనో; ఈ అనుభవంలేనివారు, మానసికంగా విపరీత అభిప్రాయాలను పెంచుకుని, గర్భం ప్రారంభమైనది మొదలు, ఈ ఖంగారునుగురించి ఆలోచిస్తూ, నొప్పులు ప్రారభంకాగానే, ప్రమాదంలో పడిపోయామని ఖంగారుపాలైపోతారు. భయం అంటువ్యాధి వంటిది.

"అనుమానం పెనుభూతం" అని మొట్టమొదటను చెప్పి, రజ్జుసర్పభ్రాంతినిగురించి తెలియబరచడం యిందు నిమిత్తమే. ప్రసవమంటే యేమో పెద్ద ప్రమాదమనీ, కాన్పులో యేదో ప్రాణాపాయము వున్నదనీ, ఊహించి, ఖంగారులో పడిపోయిన స్త్రీకి; గర్భం తాల్చింది మొదలు దృష్టి గర్భకోశం మీదనే వుంటుంది. ఈ ఊహా, ప్రసవసమయానికి ఒక ఖంగారును కల్పించుతుంది. ప్రసవసమయములో అనవసరపు గాభరాను కల్పించుకోకుండా, అవయవాలను డీలాగా వొదిలి వుంచగలిగిననాడు, తొలికాన్పు

సహితం చాలా సులభమౌతుంది; తొలికాన్పులో కొంత యెక్కువ కష్టం వుండేమాట నిజం. దీనిని జాగ్రత్తగా సాధించిననాడు, తరువాతి కాన్పులు మరీ సులభమౌతవి.

ప్రసవం సులభంగా కాక, కాన్పు కష్టమైననాడు, ఇదివరలో డాక్టర్లు, అనేకవిధానాలను అనుసరించేవారు. మత్తుమందును యిచ్చి, స్పృహ లేకుండా చేయడమూ గర్భకోశకండరాలలో వొత్తిడిని కల్పించగలిగిన పిట్యూటరీ గ్రంథి హార్మోన్‌ను ఇంజెక్షన్ ఈయడమూ మొదలైన విధానాలను అనేకాన్ని ఉపయోగించేవారు. సృష్టిలో ఏ ప్రాణికీలేని బాధ స్త్రీకి మాత్రం యెందుకు కలగవలెను, అనే ఆలోచనతో కొందరు డాక్టర్లు ప్రత్యేకపరిశోధనలు చేసి, ఒక కొత్తయత్నానికి పూనుకున్నారు. వీరి నూతన అభిప్రాయాలప్రకారం నడపడానికి, ప్రసూతిగృహాలను వేరుగా నిర్మించారు; ఈ ప్రసూతిగృహాలలో చేరిన గర్భవతులకు, అనేకవిషయాలను బోధపరుస్తారు: గర్భంకలగడం అంటే యేమిటి, పిండం వివిధదశలలో యెలా పెరుగుతుంది, గర్భవతి యీకాలంలో ఏయేజాగ్రత్తలను తీసుకోవలెను, కటిప్రదేశంలోని కండరాలూ, గర్భానికి చెందిన కండరాలూ, బలాన్ని పొందడానికి ఏయే వ్యాయామాలు అవసరం మొదలైనసంగతులను తెలియబరుస్తూ; ఇక ప్రసవం యెలా జరుగుతుంది, గర్భకోశకండరాల నిర్మాణం యెలావున్నది, ఈ కండరాలలో వొత్తిడి యెలాకలుగుతుంది, నొప్పులు ప్రారంభమైనప్పుడు శిశువు సునాయాసంగా బయటకు రావడానికి తల్లి బాధపడకుండా

ఏ విధంగా సహాయపడగలదు, అనేసంగతులనుకూడా గర్భవతులకు తెలియజేస్తారు. వీటికి సంబంధించిన బొమ్మలను చూపిస్తూ, గర్భవతులకు అన్ని విషయాలనూ తేటతెల్లం చేస్తారు. ఈ రహస్యాలన్నీ తెలియగానే, గర్భవతులకు అనవసరపుభయాలు పోయి, ప్రకృతిసిద్ధంగా జరిగే కాన్పునకు తల్లికూడా సహాయపడి, అనవసరపు బాధలకు లోనుకాకుండా, ప్రసవం సుఖవంతమౌతూవుంది గర్భవతులకు.

ఈ కొత్త పద్ధతులలో కొన్ని చాలాఉపయుక్తమైనవి. గర్భవతి, శ్రమపడి పనులుచేయవలెననే ఆచారం మనలోనూ వున్నది. ఈ విధంగా పనులుచేయడంలో కలిగే వ్యాయామమేకాక, ముఖ్యంగా కటిప్రదేశంలోని కండరాలకూ, నడుముకూ బలాన్ని కలిగించే వ్యాయామాలు చాలా అవసరం. దీనికితోడు, ఊపిరి పీల్చడంలోనూ, ఊపిరి వదలడంలోనూ కొన్ని రీతులు నేర్చుకుని, ప్రసవం అవుతూవున్నప్పుడు, కొంతవరకూ ఊపిరి బిగబట్టి, శిశువు బయటికి రావడానికి తోడ్పడాలి. ఈ విధమైన వ్యాయామాలకు గర్భవతి అలవాటుపడుతూ, అవయవాలలో ఏవిధమైన బిగింపూ లేకుండా, అన్ని అవయవాలకూ సడలింపు కలిగించి, సంపూర్ణ విశ్రాంతిని శరీరానికీ మనస్సుకీ కూడా కలిగించగలగాలి. యోగాసనాలలో 'శవాసనం' యిందుకు తోడ్పడుతుంది. ఊపిరికి సంబంధించిన వ్యాయామమూ, సంపూర్ణ విశ్రాంతికి సంబంధించిన అభ్యాసమూ, చక్కగా అలవడిన గర్భవతికి ప్రసవం చాలా సుఖవంతమౌతుంది.

ప్రసవం మూడుదశలు : మొదటి దశలో పిల్లనొప్పులు ప్రారంభమై ఆగిపోతవి. త్వరలో పురుడు రానున్నదని సూచన యీ పిల్ల నొప్పులు. ఆ తరువాతను, రెండవదశలో, నిజమైన ప్రసవం ప్రారంభమౌతుంది. ఈ దశలో గర్భకోశంలోని నిలువుకండరాల వొత్తిడివల్లను శిశువు బైటికి రావడానికి యత్నం యెక్కువౌతుంది; అందుచేతను గర్భ కంఠం విడివడుతూ వుంటుంది. ఈ స్థితిలో తల్లికి ఉఛ్వాస నిశ్వాసాలు యెక్కువ అవుతవి. ఒకటి రెండుసార్లు వొత్తిడి కలిగి కొంత విశ్రాంతి కలుగుతుంది. ఆ తరువాతను, మూడవదశ ప్రారంభమౌతుంది. ఈ దశలో గర్భకోశంలో పెద్ద వొత్తిడి ప్రారంభమౌతుంది, గర్భకంఠం పూర్తిగా విడివడి శిశువుకు దారియిస్తూవుంటుంది. ఈ సమయంలో తల్లి ఊపిరి పీల్చి దమ్ముపట్టి, శిశువును బైటికి నెట్టివేయడానికి తోడ్పడాలి; ఈ యత్నం ఒకటి రెండుసార్లు జరగగానే, శిశువు బైటికి రావడం ప్రారంభమౌతుంది. ఈ క్షణంలో, అనగా గర్భకోశం పూర్తిశక్తిని ఉపయోగించి శిశువును నెట్టివేస్తూవున్న క్షణంలో, సాధారణంగా తల్లి ఒక విధమైన మైకంలో వుంటుంది; ఈ క్షణంలో విశ్రాంతి దానంతటను అదే కలుగుతుంది.

ఈ విధంగా, గర్భమూ, కాన్పూ గురించిన వివరాలను తెలియబరుస్తూ గర్భవతులకు అవసరమైన జ్ఞానాన్ని కలిగించడానికి ఇంగ్లాండులోనూ, అమెరికాలోనూ, యూరప్‌ఖండంలోని అనేక దేశాలలోనూ ప్రసూతిగృహాలు అనేకం నిర్మాణమైనవి. గర్భవతులు

కాగానే, యీ ప్రసూతి గృహాలకు వెళ్తే, అక్కడ అన్ని రహస్యాలనూ తెలిపి, అజ్ఞానాన్నీ అనవసరపు భయాల్నీ తొలగించి, అనవసరపు బాధలపాలు కాకుండా సుఖంగా ప్రసవించడానికి తల్లులకు అవసరమైన సలహాలూ సహాయాలూ యేర్పాటు చేస్తున్నారు, ఈ ప్రసూతి గృహాలలో.

ప్రసూతిగృహం అతి శుభ్రం గానూ, కంటికి ఆనందదాయకంగానూ, పరిశుభ్రమైనగాలి తగలడానికి వీలుగానూ వుండవలెనని యేనాడో మన ప్రాచీన శాస్త్రజ్ఞులు చెప్పారు. చీనా, గ్రీసు, రోము దేశాలలో ప్రాచీన రచయితలు, ఈ సంగతులను గురించి విరివిగా రాశారు. ప్రాచీనకాలంలో, రోమనులు తమ ప్రసూతి గృహాలను పూలదండలతో అలంకరించి, కంటికి ఆనందప్రదంగా వుంచేవారు. ఈనాటి మన ప్రసూతి గృహాలనుగురించి విస్తరించి చెప్పనక్కరలేదు; "పురిటికంపు" అనే మాటనుబట్టి, దాని హీనస్థితి అర్థమాతుంది. ఈ పద్ధతి తల్లికీ పిల్లకూ ఆరోగ్యకరంకాదు.

ప్రసవసమయంలో సమర్థుడైన డాక్టరూ, శిక్షణపొందిన మంత్రసానీ సహాయాన్ని పొందడం చాలా అవసరం. శిశువు తలముందుగా జన్మించడం సహజం; కాని యెదురుకాళ్లతో పుట్టడమూ, శిశువు అడ్డం తిరిగి ప్రసవం ప్రమాదంకావడమూ, శిశువు మెడకో, కాళ్లకో, చేతులకో, పేగు అడ్డుపడడమూ తటస్థించవొచ్చును. ఈ

సందర్భాలలో సమర్థుడైన డాక్టరు దగ్గరవుండడం చాలాఅవసరం. మంత్రసానికూడా క్రమశిక్షణపొందినదికావడం ముఖ్యం. కాన్పు చేయించడంలో, మంత్రసాని చేతులు అతిశుభ్రంగా వుండాలి. మంత్రసానికి గోళ్లు పెరిగివున్నా, వేళ్లకు ఉంగరాలు వున్నా, వాటిలోచేరినమట్టి, తల్లి అవయవంలో అంటితే, కొన్నిప్రమాదాలు వున్నవి. క్రమశిక్షణపొందిన మంత్రసానులు యీ జాగ్రత్తలను తీసుకుంటారు; వాళ్లు చేతులను క్రిమినాశనం చేసే ద్రవంలో కడుక్కొని జాగ్రత్తపడతారు. తల్లికి సెగఅంటు వున్ననాడు, శిశువు కళ్లకు ప్రమాదంవున్నది; అందుచేతను, శిశువు జన్మించగానే, ఔన్సు నీళ్లల్లో ఒక ధాన్యపుగింజ యెత్తు సిల్వర్ నైట్రేట్ - Silver-Nitrate - కలిపివుంచి, ఆ ద్రావకంతో శిశువుకళ్లను శుభ్రంచేస్తే, కళ్లకు ప్రమాదం తప్పుతుంది; లేనినాడు, రెండు - మూడు రోజులలో శిశువు కళ్లుచెడిపోడం తటస్థిస్తుంది. సరియైన శిక్షణగల మంత్రసాని, యీ జాగ్రత్తలను తీసుకుంటుంది. అంతేకాదు, శిశువు జన్మించగానే మంత్రసాని మరికొన్ని జాగ్రత్తలనుకూడా అనుసరించాలి. క్రిమినాశనం చేసే మందునీళ్లలో, సన్నని, నూలు దారాన్ని, కత్తెరనో - కత్తినో, కడిగి శుభ్రపరిచివుంచి, శిశువుబొడ్డుదగ్గరగా దారంతో బిగించి ముడివేసి, కొన్ని అంగుళాల దూరంలో బొడ్డుతాడును కోసివేయాలి; ఆ తరువాతను, బొడ్డుమీదను బోరిక్‌పౌడిని - Boric Powder - జల్లి, మందునీళ్లల్లో తడిపిన శుభ్రమైన గుడ్డముక్కతో బొడ్డును కప్పివుంచవలెను. కొద్దిరోజులలో బొడ్డుదానంతటను అదే వూడిపోతుంది.

కాన్పు అవుతుందనగా, రెండు రోజులు ముందుగానే పాలచేపు ప్రారంభమౌతుంది; ఒక్కొక్కప్పుడు వాటియంతటను అవి, పాలు కారడం కూడా మామూలు. ప్రసవమైన రెండు - మూడు రోజుల వరకూ, పాలు పలచగావుండి తరువాతను చిక్కబడుతవి. శిశువు పాలు తాగడంతో, తల్లికి కలిగే స్పర్శ సుఖంవల్ల పాలచేపూ, పాల వృద్ధీ కలుగుతుంది. మరొక ముఖ్యవిషయం, స్తనాలకూ గర్భకోశానికీ యేదో విచిత్రమైన సంబంధం వున్నది. ప్రసవంలో బాగా వొదులైపోయిన గర్భకోశకండరాలు, శిశువు పాలు తాగుతూవుంటే, ముడుచుకోడం ప్రారంభించుతవి.

కాన్పు అయిన తరువాత తిరిగి రజోదర్శనం కలగడంలో, తత్వాలనుబట్టి, వ్యవధులు వేరు వేరుగా వుండడం సహజం. సాధారణంగా కాన్పు తరువాత, ఏడు - తొమ్మిది నెలలో తిరిగి ప్రారంభమౌతుంది. పిల్లకు పాలిస్తూ వున్నన్నాళ్ళూ - రెండు సంవత్సరాల వరకూ కూడా - రజోదర్శనం ఆగిపోయినవారు ఉన్నారు. పాలచేపు ఆగిపోయిన అయిదు - ఆరు మాసాలలో తిరిగి రజోదర్శనం ప్రారంభం కావడం మామూలు, ఎక్కువకాలం పాలిచ్చిన కొందరు తల్లులకు రజోదర్శనం ఆగిపోడంకూడా జరుగుతుంది; కాని యిటువంటివారు చాలా అరుదు.

కాన్పు అయిన తరువాతను భార్యాభర్తల సంగమానికి, యెంత వ్యవధివుండవలెను

అనే ప్రశ్నకు, స్త్రీ ఆరోగ్యాన్నిబట్టి, వ్యవధి నిర్ణయించాలి అని చెప్పాలి. సాధారణంగా రెండు మాసాలు వ్యవధి మంచిది అంటారు. కాని, స్త్రీ సంపూర్ణ ఆరోగ్యంలో వున్ననాడూ, ప్రసవంలో,లోపలిపొరలకు ప్రమాదం కలగకుండా వున్ననాడూ, పదిహేను రోజుల తరువాతనుంచీ ప్రారంభించ వొచ్చునని వాన్ డి వెల్డ్ తెలియబరిచాడు. ఈ సందర్భంలో ఒక జాగ్రత్తను తెలియబరచడం చాలాఅవసరం : గర్భానికీ- గర్భానికీ మధ్యను వ్యవధి రెండున్నర సంవత్సరాలు వుండడం చాలా అవసరం అని డాక్టర్లు నిశ్చయంగా చెబుతున్నారు. ప్రసవమైన ఆరు వారాల తరురాతనుంచీ మళ్ళీ గర్భం కావడానికి అవకాశం వుంటుంది. రెండున్నర సంవత్సరాలవ్యవధి వున్ననాడు, తల్లి అవయవాలకు నిండుశక్తి కలుగుతుంది, కాన్పులో సడలిని గర్భకోశకండరాలు, తిరిగి పూర్తి శక్తిని పొందుతవి. తొందరలో గర్భం కలగడం వల్లను, గర్భకోశకండరాలకు పూర్తి శక్తి వుండదు ; అందువల్లను పుట్టేపిల్లలకు తగినంతటిశక్తి వుండదు ; తల్లి శక్తికూడా తగ్గుతుంది, ఆమె అవయవాలు త్వరలో డీలాపడి, శరీరం పొంకమూ ఆకారమూ సడిలి యౌవనం దిగజారిపోయినట్టు కనిపించుతవి.

స్త్రీ యౌవనాన్ని జాగ్రత్తగా కాపాడుకోవలెనన్నా, భార్యాభర్తలు సంసారసుఖాన్ని యెక్కువకాలం అనుభవించవలెనన్నా, తమ సంతానం ఆరోగ్యవంతంగా వుండవలెనన్నా, శాస్త్రవేత్తలు సూచించిన విధానాలను జాగ్రత్తగా అనుసరించాలి.

# జననశాసనం

నూటయాభై సంవత్సరాలక్రితం మాల్‌థూస్ అనే శాస్త్రవేత్త కొన్ని పరిశోధనలుచేసి ఒక రహస్యాన్ని ప్రపంచకానికి తెలియబరిచాడు: ప్రపంచకంలో అనేక దేశాలలో జనసంఖ్య యేవిధంగా పెరుగుతూవున్నదీ, పంటల అభివృద్ధి యేవిధంగా వుంటూవున్నదీ, అనేక సంవత్సరాలలెక్కలను తనిఖీచేసి, మాల్‌థూస్ ఒక నిర్ణయానికి వొచ్చాడు: ప్రతీదేశంలోనూ ఏటేటా జనసంఖ్య పెరుగుతూవున్నది కాని, దానికి తగినట్టుగా తిండిపంటలు పెరగడంలేదు; అందుచేతను, రానురాను ప్రపంచకంలో కరువులుహెచ్చి, ప్రజలు ఆకలిబాధల పాలవుతారు. ఇదీ మాల్‌థూస్ తెలియబరిచిన రహస్యం.

మాల్‌థూస్ కల్పించిన ఆందోళనతో, శాస్త్రజ్ఞులు అనేకులు కన్నులుతెరిచారు. అతని లెక్కలనుగాని, అతడు తేటతెల్లంచేసిన సత్యాన్నిగాని కాదనడానికి అవకాశం లేక పోయింది. అంతలో మేధావులందరూ, ఈ సమస్యను యెలా యెదురుకోవడము అని ఆలోచనలలో వడ్డారు; అందరికీ సులభంగా కనిపించేది ఒక్కటేమార్గం: మానవకోటిలో పుట్టుకల్ని తగ్గించడం. అయితే ఈ తగ్గించడం

యెలాగున ? జనన నిరోధమార్గాలను కనుక్కోవాలి. ఈ యత్నంలో అనేకవిధానాలను కనిపెట్టారు. వీటిని ప్రచారం చేయడానికి 'మాల్ థూస్ లీగ్' వంటివి అనేక సమాజాలు అనేక దేశాలలో ఏర్పాటైనవి. పాశ్చాత్యదేశాలలో కొన్ని ప్రభుత్వాలు, యీ వుద్యమాలు అవసరమనికూడా అంగీకరించినవి.

జననశాసనం అవసరమనీ, ఇది సాధ్యమనీ, యెప్పుడైతే నిర్ధారణఅయినదో, ఆక్షణం ఆ దేశాలలో ఛాందసులైన మతగురువులు, పెద్ద ఆందోళనలను లేవదీసి ఒక గాలిదుమారాన్ని రేగగొట్టారు. ఎప్పుడైతే వాదోపవాదనలకు దిగడం తటస్థించిందో జననశాసనం తిండీ, పంటలూ ప్రపంచజనాభా, దేశజనభా సమస్యగానేకాక, సామాన్య కుటుంబ సమస్యలకూ, కొన్ని కొన్ని సందర్భాలలో వ్యక్తిగతంగావు డే సమస్యలకూకూడా అతి అవసరమని, సబబైన వాదనలు బయలుదేరినవి. ఏ యే సందర్భాలలో జననశాసనం అవసరమని ప్రాజ్ఞులైనవారందరూ నేడు అంగీకరిస్తున్నారో, వాటిని వివరించడం అవసరం :

1. నేటి ప్రపంచకంలో వ్యక్తి సుఖమూ, సంసారసుఖమూ డబ్బుమీదను ఆధారపడుతూ వుండడం వల్లను, కన్న పిల్లలనందరినీ సుఖంగా పెంచే ఆర్థికశక్తి లేనివారు, జననశాసనాన్ని అవలంబించి, తమ కుటుంబాన్ని మితిమీరి పెరగకుండా ఆపుదలచేయడం అవసరం.

2. స్త్రీకి సరియైన ఆరోగ్యం లేని కారణంచేతను, ఆమె గర్భంతాలిస్తే, ఆమె ఆరోగ్యానికీ, ఆయుష్యుకీ ప్రమాదాలు తప్పవని వైద్యులు నిర్ణయంగా చెప్పిననాడు ; అటువంటి స్త్రీ జననశాసనానికి పూనుకోడం మంచిది ; అటువంటి స్త్రీకి కలిగే సంతానంకూడా ఆరోగ్యంగా వుండడం అరుదు.

3. స్త్రీ కటిప్రదేశం యెముకల లోపలిభాగం – అనగా శిశువు జన్మించే లోపలి వలయం– ప్రసవంలో శిశువు బయటికిరావడానికి తగినంత పెద్దదిగావుండక పోతే, ఆ స్త్రీ యెంతప్రసవ వేదనపడినా బిడ్డ బయటకు రాలేదు ; అటువంటిస్థితిలో తల్లి కడుపును శస్త్రంచేసి, – Caesarian Operation – బిడ్డను బయటకు తీయడంకన్న వేరొకమార్గంలేదు. అట్లా చేయక ఉపేక్షచేస్తే, తల్లికీ పిల్లకూ కూడా చావు తప్పదు. ఈ విధమైన శస్త్రం ఒక్క–సారిచేసిన తరువాత ఆ స్త్రీ మళ్ళీ గర్భంతాల్చడానికి అర్హు రాలుకాదు ; ఈ శస్త్రం మాటిమాటికీ చేయడానికి వీలు లేదు. అందుచేతను, కటిప్రదేశం యెముకల యేర్పాటు ప్రసవానికి, అనుకూలంగాలేని స్త్రీలు, జననశాసనం అవలం బించక తప్పదు.

4. బాలికకు 18 సంవత్సరాల వయస్సువరకూ గర్భకోశం పూర్తిబలాన్నీ, సంపూర్ణ వికా సాన్నీ, పొందదు. గర్భకోశం సంపూర్ణవికాసాన్ని పొందక పూర్వం, బాలిక గర్భవతికావడం, ఆమెకూ, పుట్టబోయే

శిశువుకూ కూడా మంచిదికాదు. కనుక, పద్ధెనిమిది సంవత్స రాలకు పూర్వం, బాలిక కాపురంచేయడం తప్పనిసరి అయిన నాడు, ఆమె పద్ధెనిమిది సంవత్సరాల వయసువరకూ జనన శాసనం అవలంబించడం మంచిది.

5. ప్రసవమైన తరువాత, మళ్ళీ గర్భధారణకు, రెండున్నరసంవత్సరాల వ్యవధి వుండడం చాలా అవసరమని డాక్టర్లు నిర్ణయంగా చెబుతున్నారు. రెండున్నర సంవత్సరాల వ్యవధి వున్ననాడు, తల్లి ఆరోగ్యమూ, ఆమె శరీరం పొంకమూ బిగువూ బాగుండడమూ, పుట్టేపిల్లలు ఆరోగ్యవంతులుగానూ ఆయుష్మంతులుగానూ, బుద్ధివికాసంగల వారుగానూ వుండడానికి అవకాశాలూ యెక్కువని శాస్త్ర వేత్తలు నిర్ణయిస్తున్నారు. కనుక, యీ రెండున్నర సంవత్స రాల వ్యవధినిమిత్తం, ఆ కాలంలో స్త్రీ జననశాసనం అవలం బించడం అవసరం.

6. తరుచుగా గర్భవిచ్ఛిత్తి - Abortion - కలుగుతూ వున్ననాడు, ఆ స్త్రీ కొంతకాలం గర్భకోశానికి బలం కూడే నిమిత్తం జననశాసనం అవలం బించడం మంచిది.

7. తరతరాలుగా కుదరని రోగాలతో బాధపడుతూ వున్నవారూ; తరతరాలుగా వెర్రి కుట్టెల్నీ, పిచ్చివాళ్ళనీ తమ వంశంలో కంటూ వున్నవారూ, జననశాసనం అవలంబించడం చాలా అవసరం.

మానవ హృదయం గలవారూ, మానవకోటి సుఖాన్ని కోరేవారూ, పైన వివరించిన సందర్భాలలో స్త్రీ జననశాసనానికి పూనుకోడం అవసరమేనని అంగీకరించక తప్పదు. దీనిని గురించి ఇదివరలో జరిగిన వాదోపవాదాలనుగురించి తెలియబరచడమూ, వాటిని తర్కించడమూ వల్ల ప్రయోజనంలేదు. అంతకన్నా ముఖ్యమైన సంగతి యేమిటంటే, జననశాసనానికి ఏ యే పద్ధతులు వున్నవో వాటిలో యేవి ఉపయుక్తమూ, సులభసాధ్యమూ అయినవో తెలిసికోడం అవసరం. ఈ యత్నాలను గురించిన వివరాలు ఇవి:

1. బ్రహ్మచర్యనిష్ఠకు పూనుకోడం ఒక మార్గం. ఈ నిష్ఠకు భార్యాభర్తలు యిరువురూ మనశ్చాంచల్యం లేకుండా నిలవగలిగిననాడు అది జయప్రదమవుతుంది, నిజమే; కాని, ఒకానొక కవి పలికినట్టు "నాతిగల బ్రహ్మచర్యము నాతరమా" అనే సంగతిని జాగ్రత్తగా ఆలోచించాలి. దీనిలో కొన్ని ఘట్టి చిక్కులు వున్నవి: దీనిని నిర్వహించడంలో వుండే కష్టాలకన్న, దీని నిర్వహణవల్లను అతిప్రమాదకరమైన బాధలు కలగవొచ్చును. మానసికంగా కోర్కెలు కలుగుతూవుండగా, వాటిని అణిచిపెట్టడమనేయత్నం ఒక నిరంతర యుద్ధం వంటిది అవుతుంది; స్త్రీగాని పురుషుడుగాని ఈ విధమైన రాపాడింపులో పడిననాడు, ఆ వ్యక్తి మానసికంగానూ శారీరకంగానూ బాధలపాలు కావలసి వొస్తుంది. కష్టనిష్ఠురాల సంగతిని అటువుంచి,

ఈ బలవంత బ్రహ్మచర్యం సామాన్యులకు వీలుకానిది అని మాత్రం అంగీకరించక తప్పదు.

2. బిందువారణం - Coitus-interruptus - అనగా సంయోగంలో స్ఖలనం అయ్యే సమయంలో పురుషుడు తన రహస్య అవయవాన్ని వెలుపలకు లాగివేసి, రేతస్సు యోనిలో పడకుండా చేయడంవల్లను గర్భం కలగకుండా చేయవచ్చును. ఈ విధానాన్ని అనుసరించమని శాస్త్రజ్ఞులు యెవ్వరూ సలహాయివ్వరు; పైగా శాస్త్రవేత్తలు అందరూ దీనిని పూర్తిగా ఖండించి, చాలా ప్రమాదకరమైన విధానమని నిర్ణయించారు. ఈ విధానంలో స్త్రీకీ పురుషుడికీ కూడా భావప్రాప్తి కలగకుండానే రతికార్యం విచ్ఛిన్నం కావడంవల్లను, నరాలకూ, అవయవాలకూ కలిగిన ఉద్రేకం అణగకుండానే విరమింపు జరుగుతుంది. నాడీమండలానికి యిది ఒక దెబ్బవంటిది అవుతుంది. ఈ విధానాన్ని తరుచు అనుసరించడంవల్లను కాలక్రమంగా నరాల సత్తువ చెడిపోతుంది; మనస్సు అసంతృప్తిలోపడి ఖిన్నం అవుతుంది, ఈ పద్ధతి కొంతకాలం అనుసరించినవారు, ఆరోగ్యం చెడి అనేక విధాలైన విచిత్రబాధలను అనుభవిస్తారు.

3. పిల్లలుపుట్టకుండా స్త్రీ గొడ్రాలు కావడానికి పూర్వకాలంలో సంస్కృతగ్రంథాలలో మనవారు అనేక విధానాలను సూచించారు. "కువిమార తంత్రం" అనే గ్రంథంలో మూడు ప్రక్రియలను గురించిన

వివరాలు వున్నవి. కల్యాణ మల్లకవి రచించిన "అనంగరంగం" అనే గ్రంథంలో "వంధ్యాత్వాపాదనం" అనే భాగంలో నాలుగు ప్రక్రియలను గురించిన వివరాలు వున్నవి; ఈప్రాచీన గ్రంథాల తరువాతను వెలువడిన "దత్తాత్రేయతంత్రం" లోనూ, "పవనవిజయస్వరోదయ" గ్రంథంలోనూ, "భావ ప్రకాశ" అనే ఆయుర్వేదగ్రంథంలోనూ, జననశాసనవిధానాలను రచించిన వివరాలు అనేకం ఉన్నవి. "ప్రాణకృష్ణౌధావలి" వంటి యింకా అనేక గ్రంథాలలో కూడా ఈ ప్రస్తావన వున్నది.

మన ప్రాచీనులు చెప్పిన ఔషధాలూ, వాటిని తయారుచేసే విధానాలూ విశదంగా తెలుస్తూ వున్నవి. పాశ్చాత్య వైద్యవిధానంలో ఈ ప్రయోజనానికి తయారైన మందులు అనేకం వున్నవి. కాని, ఈ ప్రక్రియల ప్రయోజనాలు యెంతమాత్రమో, వాటివల్లను ఒక వేళను ఏవైనా ప్రమాదాలువుంటే అవి యెటువంటివో, నిర్ధారణగా తెలియదు. అందుచేతను మన పూర్వపు ప్రక్రియలను గురించి గాని, నేటి పాశ్చాత్యమందులను గురించిగాని వివరాలను తెలియబరచలేదు. వీటి మంచిచెడ్డలను గురించి సమర్థులూ అనుభవజ్ఞులూ అయినవైద్యులవల్ల తెలిసికోడం మంచిది.

4. ఏ విధమైన అపాయమూ లేనివీ, నిశ్చయంగా గర్భంకలగకుండా ఆపుజేయగలిగినవీ అయిన సాధనాలను కొన్నింటిని పాశ్చాత్యులు తయారు

చేశారు, ఇవి రబ్బరుతో తయారైన వొస్తువులు. వీటి వివ రాలూ, వీటినివాడే విధానాలూ తెలిసికోడం అవసరం :

ఎఫ్. ఎల్. అని సాధారణంగా వాడుకలోవున్న ఫ్రెంచి లెటరు ఒకటి వున్నది, పల్చని రబ్బ రుతో తయారైన తొడుగుయిది; చుట్టచుట్టి వుంటుంది. దీని చివరిభాగంలో ఖాళీగావున్న ఒకతిత్తి వేలాడుతూ వుంటుంది. ఈ చుట్టను విడదీయకుండా పురుష అవయవం చివరిభాగాన్ని ఆన్చి, అవయవంమీదికి, ఆ చుట్టను నెమ్మదిగా దొర్లిస్తే, యిది పూర్తిగా పురుష అవయవానికి తొడుగువలె వుంటుంది. ఖాళీగావున్న తిత్తి పురుష అవయవం చివరను వేలాడుతూ వుంటుంది. సంగమంలో ఏ విధమైన కష్టమూ వుండదు. స్ఖలనమైన వీర్యం, చివరను వేలాడుతూవున్న తిత్తిలో పడి, గుప్తంగా వుంటుంది; యోనిలోనికి వీర్యం పడకపోడంవల్లను గర్భం కలగడానికి అవకాశం అసలు వుండదు. ఫ్రెంచి లెట రును ఉపయోగించడంలో జాగ్రత్తలను గుర్తించిన వివరాలు, స్వర్గం – నరకంఅనే ప్రకరణంలో వున్నవి :

ఫ్రెంచి లెటరును వాడడంలో సురతానికి యేలోపము కూడా కలగదు. దీనిని ఉపయోగించ డాన్ని స్త్రీ గ్రహించలేదు. కనుక స్త్రీకి కలిగే సుఖంలో యే మాత్రమూ లోపం వుండదు. కాని, పురుషుడు అంసతృప్తిని పొందడానికి కొన్ని అవకాశాలు వున్నవి. తాను తెలిసి

ఉపయోగిస్తూ వుండడంవల్లను పురుషుడు అసంతృప్తిని మానసికంగా కల్పించుకుంటాడు. ఈ అసంతృప్తిని గ్రహించి, దీనికి అవకాశాన్ని వీలున్నంతవరకూ తగ్గించవలెనని కొత్త పద్ధతిని కల్పించి, అమెరికన్ టిప్సు - American tips - అనే తొడుగులు తయారైనవి.

"అమెరికన్ టిప్సు, ఫ్రెంచి లెటరు సిద్ధాంతాన్ని అనుసరించినవే, కాని, యివి పూర్తిగా పురుష అవయవాన్ని అంతనూ కప్పివుండవు. ఇవి పొట్టిగా వుండి, మణి భాగానికి మాత్రం తొడుగులై, మణిని మాత్రం కప్పివుండి మణిగట్టు వెనకలోతులోనికిదిగి, అక్కడ బిగబట్టుతవి. అందువల్లను రతి వొరిపిడిలో కదలవు. మణిగట్టు వెనకకు దొర్లిన మణిచర్మమూ, పురుషావయం మిగతాభాగం మీాది చర్మం సమస్తమూ, సహజ విధంగానే వుండడంవల్లను, సుఖానికి అభ్యంతరంవున్నదని పురుషుడు భావించడానికి వీలులేదు. ఫ్రెంచిలెటరుకువలెనే, అమెరికన్ టిప్సుకు కూడా చివరను తిత్తివుండడంవల్లను, స్ఖలనంకాగానే వీర్యం ఆ తిత్తిలో పడిపోతుంది. అందువల్లను గర్భంకలగడానికి అవకాశం ఏ మాత్రమూ వుండదు.

రబ్బరుతో తయారయ్యే వాటిలో చెక్ పెస్సరీలు - Check pessary - కొన్నివున్నవి. 'ఛెక్ పెస్సరీలు' అర్థగోళాకారంగావుంటవి. ఇవి, మూడు పరిమాణాలు గలిగి, నంబరు 1. బాలికలకూ, నంబరు 2. వయస్సు

వొచ్చినవారికీ, నంబరు 3. కొన్ని ప్రసవాలు అయినవారికీ సరి పోయేటట్టుగా తయారవుతవి. ఏ పరిమాణం గల ఛెక్-పెస్సరీ తమకు సరిపోతుందో తెలుసుకునిమరీ వాడడం ముఖ్యం. ఒక విధమైన ఘట్టితనం కలిగివున్న రబ్బరుతో తయారుకావడం వల్లను, ఈ పెస్సరీలు నొక్కినట్టయితే మణుగుతవి. ఛెక్ - పెస్సరీని వేళ్లమధ్యను నొక్కిపట్టి, మడతగాచేసి యోనిలోనికి చొప్పించి, చివరివరకూ తోసి, అక్కడ గర్భకంఠానికి టోపీ వలె పట్టేటట్టు చెయ్యవలెను. ఈపని చేతకానివారు, లేడీ డాక్టర్లద్వారా సులభంగా తెలుసుకోవచ్చును. ఒక్కసారి పద్ధతి తెలిస్తే, తరువాతను యెవరికివారే అతిసులభంగా ఉపయోగించగలుగుతారు.

ఛెక్ - పెస్సరీని గురించి కొన్ని విశేషాల్ని కూడా తెలుసుకోడం అవసరం: స్త్రీ దీనిని ఉపయోగించిననాడు, యిదివున్నట్టు పురుషుడు గ్రహించలేడు; అంటే దీనివల్లను రతి సుఖానికి ఏలోటూ వుండదన్నమాట. తరువాత దీనిని పదేపదే బయటకు తీయనక్కరలేదు; లోపల దీనిని అలా వుంచివేసి నిద్రలేచిన తరువాతను, బయటకు తీయవొచ్చును; లోపలను వుంచివేయడంవల్లను ఏ యిబ్బందీ కలగదు. తీయడం అలవాటు అయ్యేవరకూ యిబ్బంది కలగకుండా వుండడానికి చెక్ - పెస్సరీకి సన్నని పట్టుతాడు కట్టివుంటుంది; ఆతాడును పట్టిలాగుతే, పెస్సరీ బయటకు సులభంగావొస్తుంది; అలవాటు పడినతరువాతను తాడు అవసరంవుండదు; తాడును కోసివేయవొచ్చును.

ఛెక్ - పెస్సరీని ఉపయోగించి నంతమాత్రాన గర్భం కలిగే అవకాశాలు వుండవని నిశ్చయించడానికి వీలులేదు. ఛెక్ - పెస్సరీ గర్భకంఠాన్ని మూసి వేస్తుంది అనీ, అందువల్లను యోనిలో పడిన వీర్యంలోని శుక్ల అణువులు గర్భకోశంలోనికి ప్రవేశించలేవనీ నిర్ధారణగా చెప్ప వొచ్చును; కాని, శుక్లఅణువులు తమ శక్తిని కోల్పోవడానికి చాలా వ్యవధిపడుతుంది. వీటిశక్తి పూర్తిగా నశించే లోపుగా పెస్సరీని తొలగించిననాడు, ఆ అభ్యంతరం పోగానే అవి గర్భ కంఠం ద్వారా లోపలికి ఈదుకునిపోడానికి అవకాశం వుంటుంది. అందుచేతను, ఛెక్ పెస్సరీతోపాటు క్వైనాతో తయారైన పెస్సరీని - Quinine Pessary - వాడడం మంచిది. క్వైనా తగలగానే శుక్లఅణువులు శక్తిహీనమైపోతవి. క్వైనా పెస్సరీని వాడనినాడు, చెక్ పెస్సరీని తొలిగించే ముందు "డూష్" అనే సాధనాన్ని వాడి, యోని లోపలిభాగాన్ని బాగా కడగాలి. కడిగే నీటిలో పెర్మాంగినేట్ ఆఫ్ పొటేషియంను, ముదరగులాబీ రంగు వొచ్చేటంతగా కలిపి, ఆ నీరును వాడడం మంచిది. ఈ మందునీరు తగలగానే శుక్ల అణువులు శక్తిహీనమైపోతవి.

౬. జననశాసనానికి శస్త్ర విధానం కూడా వున్నది. శస్త్రం చేసి శోణకోశాలను తీసి వేస్తే, ఇక గర్భంతాల్చే అవకాశం లేకుండా పోతుంది. కాని, ఈ శస్త్రం చాలా కష్టమైనది. స్త్రీ ఉదరాన్ని చీల్చి శస్త్రం చేయుడం అవసరం కనుక, ఈ విధికి పూనుకోడం సమంజసం

కాదు. ఈ శస్త్రానికి నేర్పరిఅయిన డాక్టరు కావాలి. అందు చేతను ఈ యత్నం చేయదగినదికాదు.

పురుషుడి సంగతివేరు. శుక్లఅణువులు వృషణాలలో సూక్ష్మనాళాలలో తయారై, ఎపిడిడిమిస్‌లో నిలవవుండి, శుక్లనాళంద్వారా బైటకు వొస్తూవుంటవని యిదివరలో తెలుసుకున్నాం. జననశాసనం నిమిత్తం పురుషుడికిచేసే శస్త్రం – Vasectonomy – చాలా సులభం. ఏ విధమైన బాధా ప్రమాదమూ, కష్టమూ కూడా లేనిది. వరిబీజానికిచేసే శస్త్రంకన్న సులభమైనది. సమర్థుడైన డాక్టరు ఏ బాధా కలగకుండా సులభంగా యీ శస్త్రం చేసి, వృషణాలనుండి వెలువడే శుక్లనాళాలను దారంతో కట్టివేసి, శుక్లాణువు ఊర్ధ్వముఖముగా పోకుండా నిరోధం కల్పించగలుగుతాడు. మళ్ళీ సంతానం కావలెనన్ననాడు, మళ్లీ శస్త్రంచేసి ఆ కట్టిన దారాలను తీసివేయవొచ్చును. కాని, యీ విధానం అంతగా నమ్మదగినదికాదనీ, బిగించి కట్టిన దారాలు యేకారణం చేతనైనా కొద్దిగా సడిలితే, శుక్లఅణువులు బైటకు వొచ్చే అవకాశం వుండవొచ్చుననీ కొందరు శాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతున్నారు.

ఈ శస్త్రంలో మరొక విధం కూడా వున్నది : శుక్లనాళాలను కట్టివేయడం బదులు, వాటిని కత్తిరించి వేస్తారు. ఈ శస్త్రం జరిగిన తరువాతను శుక్లఅణువులు బీజం నుంచి బైటకువొచ్చే అవకాశం లేనందువల్లను గర్భం కలిగే అవకాశం ఏ మాత్రమూ వుండదు.

ఈ శస్త్రంవల్లను పురుషుడి శరీరానికి ఏమైనా లోపంకలుగుతుందా, రతికార్యానికి ఏ విధంగానైనా శక్తితగ్గుతుందా అని కొందరికి అనుమానాలు కలగవొచ్చును. శాస్త్రవేత్తలు, యీ అనుమానాలకు అగత్యం ఏ మాత్రమూ లేదనీ యీ శస్త్రం చేయించుకున్న పురుషులు బాగా ఆరోగ్యంగా వుంటున్నారనీ, వారి సంగమ పటుత్వం మామూలుగానే వుంటూవున్నదనీ, ఘట్టిగా చెబుతున్నారు.

స్ఖలనం అయ్యే ద్రవం చాలా వరకూ శుక్లకోశంనుంచీ, ప్రోస్టేట్ గ్రంథినుంచీ, కూపర్ గంథులనుంచీ ప్రవహిస్తుందని యిదివరలో తెలుసుకున్నాం. ఈ శస్త్రంచేసినా స్ఖలనం మామూలుగా అవుతుందనీ స్ఖలనం కాగానే కలిగేభావప్రాప్తికీ, అవరోహణలో కలిగే తన్మయత్వానికీ, ఏ లోపాలూ కలగవనీ, నిష్కర్షగా చెప్పవొచ్చును.

6. జననశాసనాన్ని గురించిన పరిశోధనలలో యిటీవలను ఒక కొత్తసిద్ధాంతం బయలుదేరింది : స్త్రీ శరీరంలో మార్పులు ఒక లయను అనుసరిస్తూ వుండడం వల్లను దీనిని లయవిధానం – Rhythmic Method – అనీ, శోణితఅణువు శక్తిమంతంగావున్నకాలంలోనే శుక్ల అణువు దానిలోచేరి, గర్భం కలుగుతుంది కనుక, ఆకాలాన్ని దాటించిన నాడు గర్భం కలిగేఅవకాశాలు వుండవు కనుక ఈ కాల నిర్ణయాన్ని సూచిస్తూ, భద్రతాకాలం – Safe Period –

అనీ, ఈ సిద్ధాంతానికి పేరులు పెట్టారు. ఈ సిద్ధాంతం వివరాలు తెలిసికోవలెనంటే, రజోదర్శనం గురించిన వివరాలు మళ్ళీ మననం చేసుకోవాలి :




ఫాలికిల్ - చిదకడం

ఇరవైయెనిమిదేసి రోజులకు ఒక్కసారిచొప్పున సరిగ్గా రజోదర్శనంకలిగే స్త్రీలకు, రజోదర్శనానికీ రజోదర్శనానికీ సరిగ్గా మధ్యలో శోణకోశం నుంచి గుడ్డు బైటపడి, ఫాలికిల్ చిదికి, లూటియంలో యిమిడివున్న శోణిత అణువు బైటపడుతుంది. ఈ మధ్యకాలం, కాబోయే రజోదర్శనానికి పధ్నాలుగు రోజులు ముందుగానూ, కిందటి రజోదర్శనం ఆరంభమైననాటికి పధ్నాలుగు రోజులు తరువాతనూ, అని నిర్ణయం; రజస్రావం ప్రవహించడం నాలుగు రోజులు లెక్క అయిననాడు, రజస్రావం కట్టిపోయిన పదవనాడు అని లెక్క వేయాలి. ఫాలికిల్ చిదికిన తరువాతను శోణిత అణువు చాలా శక్తివంతంగా వుంటుందనీ, ఈ శక్తి హెచ్చుగావున్న కాలంలో శుక్ల అణువు దీనిని కలిస్తే గర్భం ప్రారంభమౌతుందనీ యిది వరలోనే విశదమయ్యింది. అందుచేతను, శోణిత అణువు శక్తి

వంతంగావున్నరోజుల్ని తప్పించి సంగమం జరిగితే, గర్భం కలగడానికి అవకాశాలు వుండవు. ఇదీ నూతన సిద్ధాంతం.

అయితే, ఫాలికిల్ చిదకడం యెట్లా నిర్ణయించడం? దీనినిగురించి కొన్ని రహస్యాలువున్నవి. స్త్రీ శరీరంలోని వేడినిబట్టి ఫాలికిల్ చిదకడాన్ని తెలుసుకోవొచ్చును. పడకనుంచి లేవకుండా, థర్మామీటర్-Thermo-meter - నాలుకకిందను అయిదునిమిషాలు వుంచి చూస్తే, శరీరంలోని వేడి తెలుస్తుంది. రజోదర్శనం ప్రారంభానికి రెండు రోజులు ముందుగా, స్త్రీ శరీరంలో, వేడితగ్గడం ప్రారంభిస్తుంది. రజస్రావం ప్రవహిస్తూవున్న రోజులలోనూ, ఆ తరువాతను మరికొన్ని రోజులూ, రోజురోజుకూ వేడి తగ్గుతూ, ఫాలికిల్ చిదకడానికి రెండురోజులు వ్యవధివుండనగా, శరీరంలోని వేడి, బాగాతగ్గి, కనీసస్థితిని పొందుతుంది. ఈ కనీసస్థితిలో రెండు రోజులు అలావుండి, హఠాత్తుగా హెచ్చడం ప్రారంభమవుతుంది. ఈ విధంగా, హఠాత్తుగా వేడిహెచ్చడం ప్రారంభమైనదంటే, ఆరోజున ఫాలికిల్ చిదికి, శోణితఅణువు తన కోశంనుంచి బైటపడినదన్నమాట. ఆ నాటినుంచీ, స్త్రీ శరీరంలో వేడి రోజూ రోజూ హెచ్చుతూ, మళ్లీ రజోదర్శనం ప్రారంభానికి రెండు రోజులుముందుగా తగ్గడం ప్రారంభిస్తుంది.

ఫాలికిల్ చిదికి, శోణిత అణువు బైటపడడం నిర్ణయంగా తెలియవలెనంటే, థర్మామీటర్‌తో వేడిని కొలవడంతన్న వేరేమార్గంలేదు. ఇరవైయెనిమిదేసి

రోజులకు సరిగ్గా రజోదర్శనం అయ్యేవారికిమాత్రం, మధ్య కాలంలో - అనగా, కాబోయే రజోదర్శనానికి ముందు, పధ్నాల్గవరోజు - అని చెప్పవొచ్చును. రజోదర్శనంలో భేదాలువున్నవారు, వేడి కొలతనుబట్టి ఫాలికిల్ చిదకడం తెలిసికోడం మంచిది. ఈ విధంగా తమ తమ తత్వాలనుబట్టి ఫాలికిల్ చిదికేరోజును నిర్ణయంచేసేనిమిత్తం, ఒక మాసంలో వేడి కొలతలను తీసిచూసి, ఫాలికిల్ చిదికేరోజును గుర్తువుంచు కుని, దానికి అనుగుణంగా ఆ రోజులలో సంగమాన్ని మాను కుంటే, గర్భధారణకు అవకాశంవుండదు.

ఎన్నిరోజులు, ఏయే రోజులు, మానడం అనే సంగతిసికూడా గ్రహించాలి. డాక్టర్, ఎమ్. ఎడ్వర్డు డేవీస్; డాక్టర్ మారిన్ ఫిష్‌బీన్ మొదలైనవారు, ఒకఅభిప్రాయాన్ని తెలియజేస్తున్నారు: ఫాలికిల్ చిదికిన తరువాతను,శోణితఅణువు పూర్తిశక్తి ఒక్కరోజు, అనగా ఇరవై నాలుగు గంటలు మాత్రమేననీ; స్ఖలనమైన క్షణంనుంచీ, శుక్లఅణువు పూర్తిశక్తి, రోజూ - రోజున్నర - అనగా, ఇరవై నాలుగు మొదలు ముప్ఫైయారు గంటల వరకే వుంటుందనీ; అందుచేతను, ఫాలికిల్ చిదికినదని నిర్ణయానికి, రెండు రోజులు సంగమం ఆపుజేస్తే, గర్భనివారణ చేయవొచ్చుననీ, డాక్టర్ డేవిస్ మొదలైనవారు నిశ్చయంగా చెబుతున్నారు. ఫాలికిల్ చిదికిన తరువాతను మూడు - నాలుగు రోజుల వరకూ కూడా గర్భం కలిగే అవకాశాలు వున్నవనీ, శుక్లఅణువుశక్తి కూడా, ముప్ఫైయారు గంటలకన్నా యెక్కువ కాలం వుంటుందనీ

వాన్ డి వెల్డ్ అభిప్రాయపడ్డాడు. ఏదైనా, ఫాలికిల్ చిదకడానికి రెండురోజులు ముందు నుంచీ, సంగమాన్ని ఆపి, ఫాలికిల్ చిదికిన తరువాతను, నాలుగు రోజులవరకూ సంగమం చేయకుండా వున్ననాడు, గర్భధారణకు అవకాశాలు వుండవు. అని, ఈ సిద్ధాంతం ప్రకారం నిర్ణయమవుతూవుంది.

బీదతనమూ, అవిద్యా యెక్కువగావున్న మనదేశంలో, డబ్బు ఖర్చుతో కూడిన ఇతర మార్గాలకన్న, ఈ లయ విధానం- Rhythmic Method - ప్రజాబాహుళ్యం అనుసరించడానికి సులభమని యెంచి, భారత ప్రభుత్వం, డాక్టర్ స్టోన్, అనే పరిశోధకుణ్ణి, అమెరికా నుంచి పిలిపించి, అతనివద్దను కొందరు డాక్టర్లను, ఈ నూతనపద్ధతులలో తయారుచేసి, ఢిల్లీలోనూ మరికొన్ని చోట్లనూ, యిందునిమిత్తం ఆస్పత్రులను నిర్మించారు. రాష్ట్రప్రభుత్వాలు కూడా, భారతప్రభుత్వం చూపినవిధానాన్ని అనుసరించాలి. ఈ యత్నాలకు ప్రజలు కూడా సహకారం చూపాలి.

పెంచలేని సంతానాన్ని కనడం వల్లను ప్రత్యేక కుటుంబాలకు పెద్ద ఆర్థికసమస్య తయారు కావడమేకాక, దేశం మొత్తం మీదను జనసంఖ్య విస్తారంగా పెరుగుతూ, తిండికి కరువు యేర్పడి, మనదేశం యేటేటా, యితర దేశాలను తిండికోసం బిచ్చమెత్తే సిగ్గుబాటు, మనకు లేకుండా వుండవలెనంటే, జననశాసనం అవసరమని ప్రాజ్ఞులు అంగీకరించక తప్పదు.

# దురదృష్టవంతులు

సృష్టికార్యాన్ని నిర్వహించడానికి అశక్తుడు, యౌవన సౌభాగ్యాన్ని అనుభవించడానికి అసమర్థుడు, దాంపత్యజీవనానికి నిష్ప్రయోజకుడు అయిన వానికన్న దురదృష్టవంతుడు, యీ ప్రపంచకంలో మరొకడు వుండడు. ఈ దురదృష్టం – నపుంసకత్వం

నపుంసకత్వం రెండువిధాలు ; తాత్కాలికం, శాశ్వతం. శాశ్వతమైన నపుంసకత్వానికి సమాధానపడడంకన్న వేరేమార్గం లేనందుచేతను, అది విస్తారం బాధకరం కాకపోవొచ్చును. కాని, శక్తి వున్నట్టు వుండీ, అది సమయానికి నిష్ప్రయోజనమై ఆడించే ఆటకు గురికావడంకన్న నరకం మరిలేదు. అందుచేతను, యీ తాత్కాలికమైన నపుంసకత్వాన్ని గురించీ, దానిని సరిచేసుకుని సుఖాన్ని అనుభవించే మార్గాలను గురించీ తెలుసుకోడం అవసరం :

1 తగినంత విశ్రాంతీ, విరామమూ లేకుండా, శక్తివున్నదికదా అని, విరతిలేకుండా కామాన్ని తీర్చుకోడం తటస్థిస్తే, అవయవాలూ మెదడూ కూడా డీలాపడిపోడం తప్పదు. ఇంత విపరీతమైననాడు,

శాశ్వతమైన నపుంసకత్వం కలగవొచ్చును; అంత విపరీతం కాకపోయినా, అతిగా రమించిననాడు, నపుంసకత్వం తాత్కాలికం కావొచ్చును.

2. వ్యాయామాభ్యాసాలకు లోనయిననాడు - అనగా, కామవాంఛను తీర్చుకోడంలో ప్రకృతిసహజంకాని కృత్రిమమార్గాలకు పూనుకుని, స్వజాతిసంగమానికీ, వియోనులతో సంగమానికీ ముష్టిమైథునం మొదలైన వికృతులకీ యెక్కువగా అలవాటుపడిపోయిన నాడు, సహజమైనసంగమానికి శక్తి తగ్గిపోతుంది; పైగా సహజ సంగమానికి మనోధైర్యం చాలక, అందుకు పూనుకున్నా, ఆ సమయానికి ఖంగారు తయారవుతుంది. ఈ వ్యాయామాభ్యాసాలవల్లను పెద్దప్రమాదం లేదని కొందరిసలహా. కాని, శారీరికంగా కాకపోయినా, మానసికంగా యిది వికృత తత్వాన్ని తయారుచేస్తుంది. అందుచేతను సహజమార్గాలను అనుసరించడానికి అధైర్యం, రాను రాను స్థిరమౌతుంది.

3. శుక్లనష్టం విపరీతస్థితిని పొందిననాడు, నపుంసకత్వానికి దారి యేర్పడుతుంది. స్త్రీ సంపర్కంలేకుండా, దీర్ఘబ్రహ్మచర్యంలో వున్నవారికి, అప్పుడప్పుడు, ఏ స్వప్నంలోనో స్ఖలనంకావడం తగాదాకాదు. కాని, నిద్రలో కలలురాకుండానూ కామోద్రేకం కలిగినప్పుడల్లానూ, స్ఖలనమవుతూ వున్నా; సులభంగా పదేపదే స్ఖలనమౌతూవున్నా; మూత్రంలో వీర్యం కలిసిపోతూవున్నా;

శుక్లనష్టం విపరీతస్థితిని పొందినదన్నమాట. ఈ స్థితినిదాటి ఉపేక్షచేస్తే, ఒక విధమైన నపుంసకత్వం ప్రారంభమౌతుంది; ఇటువంటివారు స్త్రీతో సంగమానికిపూనుకున్నప్పటికీ, ఆరంభం లోనో అతిత్వరలోనో స్ఖలనమౌతూ ఆశాభంగం కలుగుతుంది. ఈ స్థితిలో పడిపోయినవారు, సంగమానికి జంకిపోతారు. ఇటు వంటివారు కొంతకాలం శరీరారోగ్యాన్ని కాపాడుకుంటూ, కామ వాంఛలు కలగని పరిస్థితులలో కొంతకాలం గడపడం మంచిది. తరువాతను, సంగమంలో, స్త్రీ అసంతృప్తిని వెల్లడించక నెమ్మదిగా ధైర్యాన్ని కలిగిస్తూవుంటే, రానురాను అవసరమైన మార్పు కలుగుతుంది.

4. చిరవేగత్వంకూడా, ఒక విధమైన నపుంసకత్వమే. దీర్ఘబ్రహ్మచర్యంలో వున్నవారికీ, వామాభ్యాసాలకు అలవాటుపడిపోయిన వారికీ, శుక్లనష్టం వున్నవారికీ చిరవేగత్వం – కొందరలో స్ఖలనంకావడం – సహజం. కాని, మానసికంగా ఉద్రేకాలను పెంచుకున్నవారికి కూడా, యీ స్థితికలగడంకూడా మామూలు. ఇటువంటి యిబ్బందిలోపడినవారు, కొందరపాటును తగ్గించుకుని, మనస్సులో ధైర్యాన్ని కల్పించుకునీ, మందవేగత్వాన్ని సాధించవొచ్చును. ఏ దీర్ఘవ్యాధివల్లనో నీరసపడినవారికి కూడా, యీస్థితి కలుగుతుంది. అటువంటివారు, పూర్తి ఆరోగ్యం కలిగేవరకూ విశ్రాంతితీసుకోడం మంచిది.

5. ఏ విధమైన జంకు మనస్సులో వున్నాకూడా, ఆరంభంలోగాని, మధ్యలోగాని

ధ్వజీభంగం కలగడమో, స్ఖలనం అతిత్వరలో కావడమో తటస్థిస్తుంది. గర్భం కలుగుతుందనీ, జాడ్యాలు అంటవొచ్చుననీ మొదలైన జంకు మనస్సులో వున్ననాడు, యీస్థితి తప్పదు.

6. శరీరం నుంచి వెలువడే దుర్వాసనా, ఉపయోగించే భాషలో ఏవగింపూ, చేసేచేష్టలలో కష్టం తోచే మోటదనమూ వున్ననాడుకూడా హఠాత్తుగా మనస్సు మారి, ధ్వజీభంగం కలగవొచ్చును.

ఈ విధంగాకలిగే, తాత్కాలికమైన నపుంసకత్వాన్ని సరిచేసుకోడం అంతకష్టంకాదు. నిజస్థితిని తెలుసుకుని, తెలివిగా జాగ్రత్తపడడం అవసరం.

శాశ్వతమైన నపుంసకత్వానికి అనేకకారణాలు వుండవొచ్చును :

1. పురుష అవయవం పుట్టుకలోనే లోపాన్ని పొంది, మరీ సంకుచితమైననాడు, పురుషుడు సంగమానికి సమర్థుడు కానేరడు. అంతమాత్రాన సంతానానికి అవకాశం వుండవొచ్చును. కాని, సంతృప్తికి మాత్రం అవకాశం వుండదు. వరిబీజం, బోదజ్వరంవల్లను బీజాలు విపరీతంగా దిగజారడంవల్లనుకూడా పురుషఅవయవం సంకుచితమౌతుంది.

2. పురుష అవయవం వంకరతిరిగి సంగమానికి యిబ్బంది అయిననాడు, పురుషుడు నిరుపయోగమౌతాడు. సెగ తగలగానే మాన్చుకోకుండా నిర్లక్ష్యంచేసిననాడు, లేపనశక్తి పూర్తిగా నాశనంకావడంగాని

లేదా, లింగంలోని ఘనకండరాలు పాడయి అవయవం వంకర తిరగడం గాని తటస్థించవొచ్చును. ఘనకండరాలు మరీఅంతగా చెడిపోనినాడు, జబ్బు నయంకాగానే సామాన్యస్థితి కలగవొచ్చును. కాని వంకర మరీ విస్తారమై, శాశ్వతమైననాడు, సంగమానికి వీలుకానిస్థితి యేర్పడుతుంది.

3. శరీరంలో కొవ్వు విపరీతంగా పెరిగి, బొజ్జ పెద్దదిగా పెరిగి దిగజారితే కూడా, పురుషుడు అసమర్థుడౌతాడు.

4. మెదడును బాధించే కొన్ని జబ్బులవల్లను కూడా నపుంసకత్వం యేర్పడుతుంది; కాని, మెదడులో భాగాలకు యీ విధమైన యిబ్బంది కలగడం వల్లను, ఆసక్తి తగ్గుతుందా, లేక లేపనశక్తి లేకుండా పోతుందా, అనే సంగతిని నిర్ధారణగా చెప్పడానికి, అవకాశాలులేవు.

5. వెన్నెముకలో కలిగే కొన్ని జబ్బులవల్లను మొదటిలో, ఉద్రేకమూ, శక్తి హెచ్చుతుంది; ఆతరువాతను, త్వరలో పూర్తిగా నపుంసకత్వం కలుగుతుంది; అయినా కోర్కెలు చావవు.

6. ముఖ్య గ్రంథులలో హార్మోన్లలోపం కలిగితే కూడా, నపుంసకత్వం తప్పదు. ముఖ్యంగా కామగ్రంథులలో లోపం కలిగి, వృషణాలు అప్పచుకుపోయినా, థైరాయిడ్, సుప్రారీనల్ గ్రంథులలో లోపాలు కలిగినా నపుంసకత్వం కలిగితీరుతుంది.

7. మత్తు పదార్థాలకు బానిసలై, వాటిని నిరంతరమూ విపరీతంగా వాడుతూవున్నవారూ, విషప్రయోగాలకు లోనైనవారూ, శరీరాన్ని నిస్సారంచేసే దీర్ఘవ్యాధులకు లోనైనవారూ, నపుంసకులౌతారు.

నపుంసకత్వం యేవిధంగా కలిగినా, శరీరాన్నీ మనస్సునీ యిదివరలోవున్న అభ్యాసాలనుంచి మరిలించి, కామానికి సంబంధించిన యోచనలురాకుండా, తప్పించి, అవసరమైనవిశ్రాంతిని శరీరానికీ, యితరవ్యాపకాలలో లీనమైపోయే అవకాశాన్ని, మనస్సుకీ కల్పించాలి.

నపుంసకత్వంవలెనే, సాధారణ ప్రజ దురదృష్టంగాయెంచే స్థితి మరొకటివున్నది. ఇది, నిస్సంతు కావడం – అనగా, సంతానం కలగకపోవడం.

వివాహితులలో నూటికి పది సంసారాలలో సంతానంలేకుండా పోతూవున్నది, అని పాశ్చాత్య దేశాలలో లెక్కలుతేల్చారు. ఈ అంచనా సరియైనదాకాదా అంటే, ఎలకలను పెంచి, పరీక్షచేసి, వాటిలోకూడ, యించుమించు నూటికి పదిలో సంతానం కలగడంలేదు, అని నిర్ణయం చేశాడు, ఒక పరిశోధకుడు. అందుచేతను, సంతానం కలగకపోడానికి కారణాలను తెలుసుకోవాలి:

సంతానం కలగకపోవడానికి కారణాలు అనేకం వుండవొచ్చును. సంతానాన్నికనడం స్త్రీ బాధ్యతగాయెంచి, సంతానంకలగని స్త్రీని 'వంధ్య' అనీ,

'గొడ్రాలు' అనీ అనడం మామూలు. ఈ లోపానికి స్త్రీ బాధ్యురాలుకావొచ్చును. ఆమె శోణితనాళాలలో లోపంవుండి శోణితఅణువు సరిగ్గా ప్రయాణమై రాలేనినాడు, గర్భానికి అవకాశాలువుండవు. సాధారణంగా యీ స్థితికి జీర్ణించిన సెగ కారణంకావొచ్చును. సెగ తగలగానే, నయంచేసికోనినాడు, అది శోణితనాళాల వరకూ ప్రసరిస్తే, అక్కడను ఒక అభ్యంతరం యేర్పాటయి, శుక్లశోణిత అణువుల కలయికకు వీలుకాకుండా పోతుంది. శోణితనాళాలూ, శోణకోశాలూ యిరుపక్కలా, వుండడంవల్లను, ఒకటి యీ దుస్థితిలోపడినా, రెండవది ఆరోగ్యంగావున్న నాడు, అంత యిబ్బందిలేదు. కాని, రెండు నాళాలలోనూ అభ్యంతరాలు యేర్పడిననాడు గర్భానికి అవకాశాలువుండవు. ఇదికాక, మరొక రహస్యంకూడా వున్నది: స్త్రీ రహస్య అవయవాలలోనుంచి స్రవించే ద్రవాలలో ఉప్పదనమూ పులుపూ- Alkalinity or acidity- వుండడం మామూలు. పులుపు విస్తారంగావున్ననాడు, శుక్లఅణువులశక్తి త్వరలో నశిస్తుంది; ఉప్పదనం వాటికి ప్రమాదంకాదు. అందుచేతనే, ఫాలికల్ చిదికి లూటియంలో శోణితఅణువు బయటపడిన కాలంలో, స్త్రీ రహస్యఅవయవాలలో పుల్లదనం చాలా తక్కువగావుండి, గర్భధారణకు యెక్కువ అవకాశాలను కలిగిస్తుంది.

సంతానం కలగపోడానికి లోపం స్త్రీలోనే వున్నదని భావించడం మామూలు అయినా; యిది కేవలం పొరబాటు. ఇందుకు పురుషుడి లోపం కూడా కారణం

కావొచ్చును. పురుషుడి బీజాలలోని సూక్ష్మనాళాలలో శుక్ల అణువులు తయారయి, ఎపిడిడిమిస్‌లో యివి నిలవవుండి, శరీరంలో కలిగే కొన్ని కదలికలవల్లను, యివి శుక్లకోశం విపులభాగం వరకూ కదిలించబడి, అక్కడ నిలవవుండి. స్ఖలనమైనప్పుడు శుక్లద్రవంతో కలిసి బయటపడుతవని యిదివరలో తెలుసుకున్నాం. స్వశక్తితో శుక్ల అణువులు కదలగలగడానికి ప్రోస్టేట్ గ్రంథినుంచి వెలువడే ద్రవం ప్రధానం; ప్రోస్టేట్ గ్రంథినుంచి ఈ ద్రవం వెలువడనినాడు, శుక్ల అణువులు తమంతటను అవి కదలలేవు.

పురుషుడి బీజాలలో లోపం వున్ననాడు. శుక్ల అణువులు శక్తిలేనివి అవుతవి. ఈస్థితికి అనేక కారణాలు వుండవొచ్చును. ఈ కారణాలు కూడా, తాత్కాలికమో శాశ్వతమో కావొచ్చును. బీజాలులేకుండా పోయినా, అరుచుకుపోయినా, శుక్ల అణువులు అసలు తయారు కావు; ఈలోపం శాశ్వతం. బీజాలలో లోపంలేక శుక్ల అణువులు తయారవుతూవున్నప్పటికీ, ఎపిడిడిమిస్‌నుంచి మూత్రద్వారం వరకూ,శుక్లనాళంమొత్తం పొడుగు యిరవైఅడుగులదూరమూ వీటిప్రయాణం సరిగ్గా జరగక, మధ్యలో అభ్యంతరాలు యేర్పడితే కూడా, సంతానం కలిగే అవకాశాలు వుండవు. సెగ తగిలి, అది ఎపిడిడిమిస్ వరకూ వ్యాపించిననాడు, మూడు-నాలుగు వారాలలో కుదుర్చుకోకపోతే, అది శాశ్వతంగా అభ్యంతరమౌతుంది. రెండు బీజాలలోనూ ఎపిడిడిమిస్ ఈ స్థితిని పొందుతే, సంతానానికి అవకాశం వుండదు. పురుషుడి

వల్ల సంతానంలేకపోడానికి కారణాలలో, నూటికి తొంభై మందిలో, సెగ కారణమని డాక్టర్, కేరో అభిప్రాయం. వరిబీజమూ, బోదజ్వరంవల్లను బీజాలు పెరగడమూ, బీజాలలో రణాలు తయారుకావడమూ, సెగవల్లను శుక్లనాళాలలో అభ్యంతరం యేర్పాటుకావడమూ మొదలైన కారణాలవల్లను కూడా సంతానానికి అవకాశంలేకుండా పోవొచ్చును. ఇవి త్వరలో నయమైన నాడు తాత్కాలికం; లేనినాడు శాశ్వతం కావొచ్చును.

ప్రోస్టేట్ గ్రంథి నుంచి వెలువడే ద్రవం చాలా ముఖ్యమైనదనీ, యీ ద్రవం ఆసరాలేనిదే శుక్ల అణువులు తమంతటను అవి కదలలేవనీ తెలుసుకున్నాం. ప్రోస్టేట్ గ్రంథిలో లోపాలు కలిగి, ద్రవం గ్రంథి నుంచి ప్రవహించనినాడు, శుక్ల అణువులు కదలలేవు, శోణిత అణువు లభించేవరకూ యివి ప్రయాణం చేయలేవు. అందుచేత, పురుషుడిలో యీలోపం కలిగిననాడుకూడా సంతానంకలగదు.

పురుషుడిలో లోపంవుండడం వల్లను కూడా, సంతానం లేకపోడం తటస్థిస్తుంది, అని నిర్ణయమౌతూవున్ననాడు, ఈలోపానికి స్త్రీమాత్రమే కారణమంటూ 'వంధ్య' అనీ 'గొడ్రాలు' అనీ; స్త్రీని అనడంకన్న, పురుషుణ్ణి కూడా బాధ్యుణ్ణిచేసి, యిటువంటి పురుషుణ్ణి సూచించడానికి తగినమాటను కూడా కల్పించడం న్యాయంకదా, అన్నది మేరీ స్టోప్స్.

# బ్రహ్మచర్యం

చలనంలేని బ్రహ్మచర్యదీక్ష ఊర్ధ్వరేతస్కతను కలిగించి, నిద్రాణంగావున్న కుండలినీ శక్తికి ప్రేరేణఅయి, మేధస్సు వికాసానికీ, మానసిక శక్తుల విజృంభణకూ సహకారిఅవుతుందని పూర్వకాలంనుంచీ మనలో నమ్మకంవున్నది. రెండువేలసంవత్సరాలక్రితం, పతంజలి తన యోగసూత్రాలలో అనేకరహస్యాలను తెలియబరిచాడు. పూరక రేచక కుంభక విధానాలతో వాయువును ఉపయుక్త పరుస్తూ, ఇడ పింగళ సుషుమ్న నాడులకు స్థిరీకరణ కల్పిస్తూ యోగాసనాలద్వారా శరీరాన్నీ అవయవాలనీ ఆరోగ్యవంతంగానూచేస్తూ, యమ నియమ ఆసన ధ్యాన ధారణ సమాధుల ద్వారా మానసికశక్తులను ఆర్జించడానికి సరియైనవిధానాలను సూచించాడు, పతంజలి.

జీవితంలో యేదోవొక పరమ లక్ష్యాన్ని నిర్ణయించుకొని, తమ శక్తినంతటినీ నిరంతరమూ ఆ లక్ష్యసిద్ధికి సమర్పిస్తూ, ఏదేకదీక్షతో సేవాసక్తులైనవారు మాత్రం జీవితమంతా బ్రహ్మచర్యదీక్షతో గడపడంలో చిక్కులేదు. దీనినిగురించి ప్రాచీనకాలంలో గ్రీసుదేశమేధావులు ప్లేటో, ఎరిస్టాటిల్ మొదలైనవారు దీర్ఘంగా చర్చించారు. ఈ విధంగా సేవలో నిమగ్నులైనవారికికూడా అనేక చిక్కులు

వున్నవని, నేటి శరీర-మనస్తత్వ శాస్త్రవేత్తలు చెబుతున్నారు. కామవాంఛను మళ్లించి, కామానికి సహజంగా ఉపయుక్తపడ వలసిన శక్తినంతా, యితరకార్యాలలో వినియోగపరచడం సాధ్యంకాదనీ, ఇటువంటి లక్ష్యాలనుసాధించడంలోనిమగ్నులైనా శరీరానికీ-మనస్సుకీ వున్న శక్తులనన్నింటినీ యెంతగా వినియోగ పరిచినా, కామశక్తి మిగిలివుంటుందనీ, ఫ్రాయిడ్ అభిప్రాయం.

నేటి పరిశోధనలలో అవగాహన అవుతూవున్న కొన్ని రహస్యాలను తెలియబరచడం అవసరం, యీ సందర్భంలో. శరీరంలో నిగూఢంగా వున్న సప్తగ్రంథుల నుంచీ వెలువడే హార్మోన్లు, సరాసరి రక్తంలో కలుస్తూ వున్నవి. వీటిలో ముఖ్యగ్రంథులకు కామగ్రంథులతో సంబంధం వున్నది. అందుచేతను, కామవాంఛను ప్రకృతి సహజంగా తీర్చుకున్ననాడు, వీటికి వినియోగం కలుగుతుంది; అలా కాని నాడు, యీ హార్మోన్లగతి వక్రించి, వీటిలో ఒక దుష్టత్వం - Toxins - తయారుకావడం ప్రారంభమవుతుంది. దీర్ఘ బ్రహ్మచర్యంలో వున్ననాడు, వీటివల్లను గుండె చురుకూ, నాడీ దుడుకూ, నాడీమండలంలో అనేకవిధాలైన వొడిదుడు కులూ తయారై, వివిధవిధాల వికారాలు ప్రాప్తించుతవి. మానసికంగా కోర్కె వుండి, దానిని అణిచివుంచడం తటస్థిస్తే మెదడుకూడ కొన్ని బాధలకు లోనవుతుంది. కామవాంఛ, సహజమైన విధానాన్ని తీర్చుకోనినాడు, అది అంతర్ముఖమై, మానసికంగా యేదో వికృతిని కలిగించడమో, లేదా, నాడీ

మండలంలో బాధల్ని కల్పించడమో తప్పదు, అని కెన్నెత్ వాకర్ నిర్ణయంగా చెబుతున్నాడు.

ఈ రహస్యాలను ఊహించే కాబోలును, "వేగాన్ న వారయేత్ ధీమాన్" అనే బాహట సూత్రం బయలుదేరింది. బుద్ధిమంతులు, వేగాలను వారించ కూడదు– అనగా ఆపకూడదు – అని సూత్రార్థం. వేగాలు అనగా, శరీరంలోపలనుంచి బైటికిపోడానికి తొందరపాటును కలిగించేవాటిని వేగాలు అన్నారు; వేగాలను ఆపుజేయడంవల్ల శరీరానికి హాని కలుగుతుంది. శుక్లం, వేగాలలో వొకటిగా యెంచారు మన వైద్యులు. శుక్లకోశం నిండి వున్ననాడు, శుక్లం బైటికిపోకుండా ఆపడం వీలుకాదు; దీనిలో కలిగిన వొత్తిడి, యితర రహస్యఅవయవాలలోనూ, వాటికి సంబంధించిన నాడులలోనూ సంచలనాన్ని కలిగిస్తుంది; మనస్సుకు కూడ వాంఛ కలగడానికి, యిది కారణం కావొచ్చును. అటు వంటప్పుడు, ఏ స్వప్నమో కలిగి, యిది బహిర్గతమౌతుంది. ఈ స్థితి తరుచు తటస్థిస్తూవున్ననాడు, మనస్సులో వొక వ్యాకులపాటు తయారవుతుంది. కామవాంఛ కలగకుండా బ్రహ్మచర్యం గడిస్తే ఫరవాలేదు, కాని, కోరికల్ని నిరంతరమూ అణగద్రొక్కుతూ, మానసికంగా యీ యత్నం వొక రాపాడింపుగా పరిణమించిననాడు, బ్రహ్మచర్యదీక్షవల్ల ప్రయోజనాలకన్న ప్రమాదాలు యెక్కువవుతవి. కోరికలు కలగకుండా, మనస్సును మరలించడం వేరు; కోరికలను అణగద్రొక్కుపుంచడం వేరు. అణగారిన కోరికలు, వికృతరూపాలను

పొందడం సహజం. "కామం, వికృత రూపాన్ని తాల్చిననాడు, అది నరకద్వారాల్ని తెరుస్తుంది; ఈ ద్వారాలు తెరవదగినవి కావు" అని రెమీ ది గూర్మాన్, నిశితంగా చెప్పాడు.

ఈ సందర్భంలో కూడా, స్త్రీ - పురుష ప్రకృతులలో పూర్తిభేదం వున్నది "స్త్రీణా మమైథునం జరా, పురుషాణాం మైథునం జరా" అని చాణక్య సూత్రం. అంటే, మైథునంవల్లను పురుషుడికి ముసలితనం కలుగుతుంది, మైథునం లేకపోడంవల్లను స్త్రీకి ముసలితనం కలుగుతుంది, అని సూత్రార్థం. ఈనాడు పాశ్చాత్యపరిశోధకులు తెలియ బరిచే విషయాలు, చాణక్యసూత్రాన్ని బలపరుస్తూవున్నవి. మైథునంవల్లను స్త్రీకి మనస్సూ శరీరమూ కుశలంగా వుండడమే కాక, అవసరమైనంతగా వున్ననాడు, రజోదర్శనంలో కలిగే వొడిదుడుకులూ, నొప్పులూ, నివారణ అవుతవనీ; ఇందువల్లను స్త్రీశరీరం నిండుదనాన్ని పొంది, అవయవస్ఫూర్తి కలుగుతుందనీ కెన్నెత్ వాకర్ నిష్కర్షగా చెబుతున్నాడు. పాశ్చాత్య పరిశోధకులు, ఈ సందర్భంలో మరికొన్ని రహస్యాలనుకూడా తెలియబరిచారు: పిల్లల్నికన్న తల్లికన్న, గొడ్రాలికి, రజో దర్శనం ఆగిపోడం తొందరలో జరుగుతుంది; ఆకాలంలో, పిల్లల్ని కన్నతల్లికన్న, గొడ్రాలికి బాధలు యెక్కువ కలగ వొచ్చును; నడివయస్సుదాటిన తరువాతను పిల్లల్నికన్న తల్లులకు వుండే ఆరోగ్యం, గొడ్రాలికి వుండదు; గొడ్రాలికన్న పిల్లల్నికన్న తల్లులు సామాన్యవ్యాధుల్ని బాగాతట్టుకోగలుగు తారు; అంతేకాదు, గోడ్రాలికన్న పిల్లల్నికన్న తల్లులు

యెక్కువకాలం జీవిస్తారు. స్త్రీపట్ల, చాణక్యసూత్రమూ, పాశ్చాత్యపరిశోధనలూ, తెలియబరిచిన విషయాలను గురించి వ్యాఖ్యానించడం అనవసరం.

శరీరఆరోగ్యం మనస్సుకి ఆనందాన్ని కూర్చుతుంది; మనస్సు ఏ వ్యాకూలపాటూ లేక సుఖంగా వున్ననాడు, శరీరం ఆరోగ్యంగావుంటుంది. కనుక, మనస్సునీ శరీరాన్నీ భద్రంగావుంచే మార్గాలను అనుసరించి, దాంపత్యాన్ని సుఖప్రదంగాచేసుకుని, జీవయాత్ర గడపగలిగిన భార్యాభర్తలు ధన్యులు. 'ఎల్ట్రాబ్' అనే గ్రంథంలో, "కామం అనే శక్తివంతమైన గుర్రాన్ని, కళ్లెంపట్టి అదుపు ఆజ్ఞలలో నడిపించడం నేర్చుకో" అన్నాడు, ఉమార్ హెల్బీ. మన ప్రాచీనశాస్త్రప్రణేతలు చెప్పిన "వేగాన్ న వారయేత్ ధీమాన్" అనే సూత్రానికి, "అతి సర్వత్ర వర్జయేత్" అనే సూత్రాన్నికూడా జతపరిచి జీవితాన్ని సరిదిద్దగలగాలి. వాత్స్యాయనుడు, తన కామసూత్రాలలో, ఆఖరుని తెలియబరిచిన జాగరూకతను పాటించడం చాలా అవసరం: "త దేవ త్కౌశలం విద్వాన్ ధర్మార్థానలోకయన్ నాఽతిరాగాత్మకః కామీ ప్రయుంజానః ప్రసిద్ధ్యతి" అనగా, ఈ శాస్త్రంలో కౌశలాన్ని సంపాదించి, ధర్మార్థాలనుపాటించి, అతిరాగాత్ములు కాకుండా, కాములైనవారు ఆదర్శప్రాయులౌతారు!

